॥ శ్రీహరిః ॥

910

# వివేక చూడామణి

विवेक चूडामणि ( तेलुगु )



गीताप्रेस गोरखपुर

GITA PRESS, GORAKHPUR [SINCE 1923]

గీతాప్రెస్, గోరఖ్‌పూర్

॥ శ్రీహరిః ॥

910

# వివేక చూడామణి

विवेक चूडामणि (तेलुगु)

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ

అనువాదం

బులుసు ఉదయభాస్కరమ్

గీతాప్రెస్, గోరఖ్‌పూర్.

# నివేదనము

భారతదేశమునందు జన్మించిన త్రిమతాచార్యులలో ఆదిశంకరుడు అగ్రగణ్యుడు. క్రీ.శ. 8వ శతాబ్దమునకు చెందిన శ్రీశంకరాచార్యులు ఆనాటి పాషండ మతముల నన్నింటినీ ఖండించి, అద్వైతమతస్థాపన గావించిరి. 32 సంవత్సరముల వయస్సులోనే సకల వేదవేదాంగములను ఔపాసనపట్టి ప్రస్థానత్రయమునకు విపులముగా భాష్యములను వ్రాసిరి. భారతదేశమునందంతటకు సంచరించి తమ వేదాంతభేరిని మ్రోగించుటయే గాక నాలుగుదిశల యందును మఠములను స్థాపించి, తమ శిష్యులను అచ్చట మఠాధిపతులను గావించిరి. శ్రీఆదిశంకరాచార్యులు అనేక గ్రంథములను రచించిరి. "బ్రహ్మసత్యం, జగన్మిథ్య, జీవో బ్రహ్మైవనాఽ పరః" అను సూక్తి అద్వైత సారాంశము. వీరు జ్ఞానమార్గ ప్రాశస్త్యమును ప్రతిపాదించిననూ భక్తిమార్గమును గూడ బహుళ ప్రచారమొనర్చిరి. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వక్కాణించిరి. భక్తి ప్రబోధములైన పెక్కు ఉత్తమగ్రంథములను, స్తోత్రములను రచించిరి.

శ్రీఆదిశంకరుల గ్రంథములన్నింటిలో "వివేకచూడామణి" తలమానికము. సాధన చతుష్టయము, ఆత్మజ్ఞాన మహత్త్వము, స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల వివరణము, దేహేంద్రియాదుల అనిత్యత్వము, పంచకోశముల వర్ణన, ఆత్మస్వరూప నిరూపణము, జీవాత్మ, పరమాత్మల అభేదత్వము 'తత్త్వమసి' అను మహావాక్యవివరణము, బ్రహ్మ, జగత్తుల ఏకత్వము, జీవన్ముక్తుని లక్షణములు మొదలగునవి ఇందలి ముఖ్యాంశములు.

అద్వైతవేదాంతచర్చనేగాక ఇందలి సాహిత్యసౌరభము కూడ పరమానందదాయకము. పఠించినవారు ఆనందసముద్రమున ఓలలాడుదురు. ఇట్టి మహత్గ్రంథమును పాఠకులముందుంచుటకు మేమెంతయో సంతోషించుచున్నాము. సర్వవేదాంతసారమైన ఈ అమృతమును పాఠకులు తనివితీర గ్రోలి తరింతురుగాక!

ఇట్లు

ప్రకాశకులు

# విషయ సూచిక


| క్ర.సం | విషయము | పుట సంఖ్య |
|---|---|---|
| 1. | నివేదనము | 3 |
| 2. | శంకర భగవత్పాదులు | 7 |
| 3. | మంగళాచరణము | 14 |
| 4. | బ్రహ్మనిష్ఠా మహత్త్వము | 14 |
| 5. | జ్ఞానప్రాప్తికి ఉపాయము | 16 |
| 6. | అధికారి నిరూపణము | 18 |
| 7. | సాధన చతుష్టయము | 19 |
| 8. | గుర్వాశ్రయము - ప్రశ్నవిధి | 22 |
| 9. | ఉపదేశ విధానము | 25 |
| 10. | శిష్య ప్రశంస | 27 |
| 12. | స్వప్రయత్నము యొక్క ప్రాధాన్యము | 28 |
| 13. | ఆత్మజ్ఞాన మహత్త్వము | 29 |
| 14. | అపరోక్షానుభవము యొక్క అవశ్యకత | 30 |
| 15. | ప్రశ్న విచారము | 32 |
| 16. | స్థూల శరీర వర్ణనము | 33 |
| 17. | విషయనింద | 35 |
| 18. | దేహాసక్తి నిందనము | 37 |
| 19. | స్థూల శరీర విచారము | 38 |
| 20. | దశేంద్రియములు | 39 |
| 21. | అంతఃకరణ చతుష్టయము | 40 |
| 22. | పంచప్రాణములు | 40 |
| 23. | సూక్ష్మశరీరము | 41 |
| 24. | ప్రాణధర్మములు | 43 |
| 25. | అహంకారము | 43 |
| 26. | ఆత్మార్థమే ప్రేమ | 44 |
| 27. | మాయా నిరూపణము | 45 |

| క్ర.సం | విషయము | పుట సంఖ్య |
|---|---|---|
| 28. | రజోగుణము | 46 |
| 29. | తమోగుణము | 47 |
| 30. | సత్త్వగుణము | 48 |
| 31. | కారణ శరీరము | 49 |
| 32. | అనాత్మ నిరూపణము | 50 |
| 33. | ఆత్మ నిరూపణము | 51 |
| 34. | అధ్యాసము | 54 |
| 35. | ఆవరణశక్తి - విక్షేపశక్తి | 57 |
| 36. | బంధ నిరూపణము | 57 |
| 37. | ఆత్మానాత్మ వివేకము | 58 |
| 38. | అన్నమయకోశము | 60 |
| 39. | ప్రాణమయకోశము | 64 |
| 40. | మనోమయకోశము | 64 |
| 41. | విజ్ఞానమయకోశము | 70 |
| 42. | ఆత్మకు ఉపాధితోడ సంబంధము లేకుండుట | 71 |
| 43. | ముక్తి ఎట్లు కలుగును? | 72 |
| 44. | ఆత్మ జ్ఞానమే ముక్తికి ఉపాయము | 73 |
| 45. | ఆనందమయ కోశము | 76 |
| 46. | ఆత్మ స్వరూప విషయకమగు ప్రశ్న | 78 |
| 47. | ఆత్మ స్వరూప నిరూపణము | 78 |
| 48. | బ్రహ్మమునకు, జగత్తునకు ఏకత్వము | 82 |
| 49. | బ్రహ్మ నిరూపణము | 85 |
| 50. | మహావాక్య విచారము | 86 |
| 51. | బ్రహ్మ భావన | 89 |
| 52. | వాసనా పరిత్యాగము | 95 |
| 53. | అధ్యాస నిరాసము | 98 |

| క్ర.సం | విషయము | పుట సంఖ్య |
|---|---|---|
| 54. | అహంపదార్థ నిరూపణము | 102 |
| 55. | అహంకార నింద | 104 |
| 56. | క్రియా, చింతావాసనల పరిత్యాగము | 107 |
| 57. | ప్రమాదనింద | 110 |
| 58. | అసత్తును పరిహసించుట | 112 |
| 59. | ఆత్మనిష్ఠా విధానము | 116 |
| 60. | అధిష్టాన నిరూపణము | 119 |
| 61. | సమాధి నిరూపణము | 121 |
| 62. | వైరాగ్య నిరూపణము | 127 |
| 63. | ధ్యాన విధి | 129 |
| 64. | ఆత్మ దృష్టి | 131 |
| 65. | ప్రపంచ నివారణము | 135 |
| 66. | ఆత్మ చింతన విధానము | 138 |
| 67. | దృశ్యమును ఉపేక్షించుట | 139 |
| 68. | ఆత్మజ్ఞానమునకు ఫలము | 141 |
| 69. | జీవన్ముక్తుని లక్షణములు | 143 |
| 70. | ప్రారబ్ధవిచారణము | 148 |
| 71. | నానాత్మనిషేధము | 153 |
| 72. | ఆత్మానుభవము యొక్క ఉపదేశము | 155 |
| 73. | బోధోపలబ్ధి | 158 |
| 74. | ఉపదేశము యొక్క ఉపసంహారము | 169 |
| 75. | శిష్యునకు వీడ్కోలు | 184 |
| 76. | అనుబంధ చతుష్టయమ్ | 184 |
| 77. | గ్రంథ ప్రశంస | 185 |
| | వేదాంత డిండిమము (సంక్షిప్తము) | 186 |

# శంకరభగవత్పాదులు

ప్రపంచ దార్శనికులలో శంకర భగవత్పాదులు అగ్రగణ్యులు. వీరి జీవితచరిత్రను గూర్చిన చిన్న పెద్ద గ్రంథములు ఎన్నియో ప్రచురించబడినవి. వీటిలో చాలా గ్రంథములు దిగ్విజయ యాత్రకు సంబంధించినవి.

శంకర భగవత్పాదులు దివ్య ప్రతిభా సంపన్నులు. వీరిలో అద్వితీయమగు పాండిత్యము, గంభీర వచనశైలి, కర్మశీలత, అనంతమగు భగవద్భక్తి, అపరిమితమగు వైరాగ్యము, అద్భుతమగు యోగైశ్వర్యము మొదలగు అనేక గుణములు అహమహమికతో చేరియున్నవి. వీరి నాలుకపై సాక్షాత్తు సరస్వతియే నాట్యము చేయుచున్నది. ఇందువలననే వీరు 32 సంవత్సరములు వయస్సు వరకే ఎన్నో ఉద్గ్రంథములను రచించిరి. భారతదేశమంతయూ పర్యటించి పలు విరుద్ధ మతవాదములను శాస్త్రార్థములతో ఖండించిరి. భారతదేశమున నాలుగువైపులా నాలుగు ప్రధాన మఠములను స్థాపించిరి. భారతదేశమంతట సనాతన వైదిక ధర్మధ్వజమును ప్రతిష్ఠించిరి. ఇట్లు శంకర భగవత్పాదులవతరించి, మునిగిపోవుచున్న సనాతన ధర్మమును ఉద్ధరించిరి. వారు వెలిగించిన కాంతి రేఖలనే ఈనాడు మనము చూచుచున్నాము. వారు చేసిన ధర్మ సంస్థాపనమును చూచి వారు సాక్షాత్తు కైలాసనాథుడగు శంకరుని అవతారమేనని నమ్మిక యేర్పడును. 'శంకర శ్శంకర స్సాక్షాత్' అను ఆర్యోక్తి కూడా దీనికి ప్రమాణము. కావున అందరు శంకరాచార్యులకు ముందుగా భగవచ్ఛబ్దమును వాడుదురు.

శ్రీ శంకర భగవత్పాదులు కేరళ రాష్ట్రంలోని పూర్ణానదీ తీరమున నుండు కాలడీ గ్రామమున వైశాఖ శుక్ల పంచమీ ఆర్ద్రా నక్షత్రమున అవతరించిరి. వీరి తండ్రిగారు శివగురువు. తల్లి ఆర్యాంబ. శివ గురువు గొప్ప విద్వాంసులు. ధర్మనిష్ఠులు. ఆర్యాంబ కూడా పతికి తగిన గుణవతి. చక్కని విదుషీమణి. ధర్మపరాయణ కూడా. కాని ప్రౌఢ వయస్సు దాటిననూ వీరికి సంతానము కలుగ లేదు. అంతట ఆ పుణ్యదంపతులు

అత్యంత శ్రద్ధా భక్తులతో శంకర భగవానునే పుత్రునిగా పొందుటకు కఠిన తపోరూపమగు ఉపాసనను చేసిరి. శ్రీ శంకర భగవానుడు వారి ఉపాసనకు ప్రసన్నులై ప్రత్యక్షమై వారు కోరిన వరము నొసంగిరి. శంకర భగవానుని ఆశీర్వచనముతో శుభ ముహూర్తమున ఆర్యాంబ గర్భము నుండి దివ్య ప్రభావశాలి అమిత తేజశ్శాలియగు పుత్రుడు ఉదయించెను. ఆ శిశువు పేరు శంకరుడనియే పెట్టిరి.

బాల శంకరుని రూపమున ఒక అనిర్వచనీయమగు ఒక మహావిభూతి అవతరించినది. ఈ శంకరుని బాల్యము నుండియే దీనికి ఆధారము లభించసాగినది. ఒక సంవత్సర ప్రాయములోనే బాలశంకరులు తమ మాతృభాషలో తమ అభిప్రాయములను అవసరములను ప్రకటించ గలిగిరి. రెండవ సంవత్సరమున తన తల్లి నుండి పురాణాదికముల లోని కథలను వింటూ వాటిని కంఠస్థము చేయసాగెను. మూడవ సంవత్సరమున అతని తండ్రి అతని కేశఖండనాదికమును గావించి దివంగతుడాయెను. అయిదవ సంవత్సరమున ఉపనయనము గావించి గురుకులమునకు అధ్యయనమునకు పంపిరి. 8 సంవత్సరముల వయస్సులోనే వీరు వేదవేదాంతములను వేదాంగములను సంపూర్ణముగా అధ్యయనము గావించి, ఇంటికి తిరిగి వచ్చిరి. వీరి దివ్యము అద్వితీయమగు ప్రతిభాపాటవమును గాంచి వీరి గురుజనులు ఆశ్చర్యచకితులైరి.

విద్యాభ్యాసము పూర్తి గావించి బాలశంకరులు సన్న్యాసమును స్వీకరించ నిచ్ఛగించిరి. కాని అపుడు తల్లిని ఆజ్ఞ అడుగగా తల్లి అనుమతించలేదు. శంకరులు పరమ మాతృభక్తులు. తల్లి మనసును నొప్పించి సన్న్యాసమును స్వీకరించదలచలేదు. ఒకనాడు తల్లితో కలిసి నదిలో స్నానము చేయుటకు వెళ్లెను. ఆ నదిలో శంకరులను మొసలి పట్టినది. పుత్రుని ఆపదను చూచిన తల్లి దుఃఖముతో తల్లడిల్లినది. ఆ ఆర్తితో హాహాకారము గావించినది. అపుడు శంకరుడు తల్లితో ఇట్లనెను. సన్న్యాసము స్వీకరించుటకు అనుమతించినచో నన్ను మొసలి విడుచును, అని. అంతట తల్లి వెంటనే అనుమతించినది. అట్లే మొసలి శంకరుని విడిచినది. ఇట్లు తల్లి ఆజ్ఞను పొంది ఇంటి నుండి బయలు వెడలెను. అయితే

అట్లు బయలుదేరుటకు ముందు తల్లి ఇష్ట ప్రకారము నీ మరణ సమయమున నేను ఇంటిలో ఉందును అని మాట యిచ్చెను.

ఇంటినుండి బయలు వెడలిన శంకరులు నర్మదా తీర ప్రాంతమునకు వెళ్ళి అచట స్వామి గోవింద భగవత్పాదుల నుండి సన్న్యాస దీక్షను స్వీకరించెను. గురువు శంకరులకు 'భగవత్పూజ్యపాదాచార్యులు' అని నామకరణము గావించిరి. శంకర భగవానులు గురూపదిష్ట మార్గమున సాధనను ప్రారంభించి అతి త్వరలోనే గొప్ప యోగసిద్ధులు మహానుభావులైరి. వారు పొందిన సిద్ధితో ప్రసన్నులైన గురువర్యులు కాశీకి వెడలి బ్రహ్మసూత్ర భాష్యమును రచించమని ఆజ్ఞ ఇచ్చిరి. అంతట శంకరులు కాశికి వెళ్ళిరి. కాశికి వెళ్ళిన తరువాత శంకరుల ఖ్యాతి పెరుగసాగినది. ప్రజలు ఆకర్షించబడి వారి శిష్యత్వమును స్వీకరించసాగిరి. వీరికి ప్రప్రథమ శిష్యులు సనందనులు. వీరికే మొదటి పేరు పద్మపాదులు అని.

శంకర భగవానులు కాశీలో శిష్యులను చదివించటమే కాక గ్రంథరచన కూడా కొనసాగించిరి. ఒకనాడు కాశీ విశ్వేశ్వరుడు సాక్షాత్కరించి బ్రహ్మసూత్ర భాష్య రచనకు ధర్మప్రచారము చేయుటకు ఆజ్ఞాపించిరి. అంతట శంకరులు బ్రహ్మసూత్ర భాష్యమును రచించిరి. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు గంగాతీరమున శంకరుని ఒక సూత్రమునకు అర్థమును ప్రశ్నించెను. ఆ సూత్రముపై ఆ బ్రాహ్మణునితో 27 దినములు శాస్త్రార్థ విచారము కొనసాగెను. తరువాత ఆ బ్రాహ్మణుడు సాక్షాత్తు వేదవ్యాస భగవానులే అని శంకరులు తెలిసికొనిరి. అంతట శంకరులు భక్తి పూర్వకముగా వేదవ్యాసులకు ప్రణామము లాచరించిరి. క్షమ నర్థించిరి. అంతట వేదవ్యాసులు అద్వైత సిద్ధాంతమును ప్రచారము గావించుటకు ఆజ్ఞ ఇచ్చిరి. అట్లే 10 సంవత్సరముల శంకరుల అల్పాయువును 32 వరకు పెంచిరి. ఈ సంఘటన తరువాత శంకరులు దిగ్విజయమునకు బయలు దేరిరి.

శంకర భగవత్పాదులు కాశీలో ఉన్న సమయమున అచట నివసించుచున్న వివిధ మతముల వారి వాదములను ఖండించిరి. అచటి నుండి కురుక్షేత్రమునకు వెళ్ళి ఆట నుండి బదరికాశ్రమమునకు వెడలిరి.

అచట కొన్ని దినములుండి మరికొన్ని గ్రంథములను రచించిరి. శంకర భగవత్పాదుల రచనలన్ని కాశీలోనో బదరికాశ్రమములోనో రచించినవే. 12 నుండి 16 సంవత్సరముల వయస్సులోనే శంకరులు అన్ని గ్రంథములను రచించిరి. బదరికాశ్రమము నుండి బయలు దేరిన శంకరులు ప్రయాగకు వెడలిరి. అచట వీరికి కుమారిల భట్టు కలిసిరి. కుమారిల భట్టు చెప్పిన దానినిబట్టి వారు ప్రయాగ నుండి మాహిష్మతీ పురమునకు వెడలి, అచట మండన మిశ్రుల వద్దకు శాస్త్రార్థ విచారమునకు వెళ్ళిరి. అచట మండన మిశ్రుల యింటికి తలుపులు పెట్టియుండుటతో తమ యోగ బలముతో ఇంటిలోనికి ప్రవేశించిరి. అచట మండనమిశ్రులు శ్రాద్ధమును ఆచరించుచుండిరి. శాస్త్రార్థ విచారమునకు వచ్చితినని తెలిపిరి. వారిరువురి శాస్త్రార్థ విచారమున మధ్యవర్తినిగా మండన మిశ్రుల పత్ని విదుషీమణి భారతీదేవి వ్యవహరించినది. చివరికి మండన మిశ్రులు ఓడిపోయిరి. శంకరాచార్యుల శిష్యత్వమును స్వీకరించిరి. వీరే తరువాత సురేశ్వరాచార్యులుగా ప్రసిద్ధి పొందిరి. అట్లు తన భర్త ఓటమిపాలు కాగా పత్ని భారతీదేవి శంకరాచార్యుల వారితో శాస్త్రార్థ విచారము కొనసాగించెను. కామ శాస్త్ర విషయమున ప్రశ్నించెను. దీనికి సమాధానము చెప్పుటకు శంకర భగవత్పాదులు మరణించిన అమరుక మహారాజు శరీరమును యోగబలముతో పరకాయ ప్రవేశ విద్యచే ప్రవేశించి కామశాస్త్రమును అభ్యసించిరి. భర్త సన్న్యాసి కాగా భారతి బ్రహ్మప్రాప్తికై సిద్ధపడగా శంకరులు ఆమెకు నచ్చచెప్పి శృంగగిరికి గొనిపోయిరి. అచట ఉండి అధ్యాపనము గావించమని అడిగిరి. భారతీదేవి ద్వారా విద్యాభ్యాసము జరిగినందుననే శృంగేరి ద్వారకలలోని శారదామఠములను శిష్య సంప్రదాయములను భారతీ సంప్రదాయములుగా ప్రసిద్ధి కెక్కినవి.

మధ్యభారతమున విజయమును పొందిన శంకర భగవత్పాదులు దక్షిణ దేశమునకు వెడలిరి. మహారాష్ట్రలో శైవులను కాపాలికులను పరాజయము పాలు గావించిరి. ఒక ధూర్త కాపాలికుడు శంకర భగవత్పాదులనే బలినిచ్చుటకు కపటబుద్ధితో వారికి శిష్యునిగా చేరెను. అయితే అతడు శంకరుని బలి ఇచ్చుటకు సిద్ధపడగా పద్మపాదాచార్యులు

అతనిని వధించిరి. బలిచ్చు సమయమున కూడా అనగా కాపాలికుని ఖడ్గము వారి మెడపై నున్న సమయమున కూడా శంకరులు సమాధిలో శాంతముగా కూర్చొనియే యుండిరి.

అటనుండి బయలు దేరి తుంగభద్రా తీరమును చేరి అచట ఒక మందిరమును నిర్మించి అందులో శారదాదేవిని ప్రతిష్ఠించిరి. ఇచట స్థాపించిన మఠమునకు శృంగేరి మఠమని పేరు. 'సురేశ్వరాచార్యులు ఈ మఠములోనే ఆచార్యులుగా నియమించబడిరి. ఈ సమయములోనే శంకర భగవత్పాదులు తమ వృద్ధమాతకు మృత్యువు సమీపించినదని తెలిసికొని ఇంటికి వెడలిరి. తల్లికి అంత్య సంస్కారములను గావించిరి. తల్లి ఇచ్ఛాను గుణముగా శంకరులు ప్రార్థించి తల్లిని విష్ణులోకమునకు పంపిరి అని కథ కలదు. అట నుండి శృంగేరి మఠమునకు వెళ్లి అటనుండి పూరీకి వెడలి అచట గోవర్ధన మఠమును స్థాపించి పద్మపాదాచార్యులను ఆ మఠమునకు అధిపతిని గావించిరి. శ్రీ శంకర భగవత్పాదులు చోల పాండ్య రాజుల సహాయముతో దక్షిణ ప్రాంతములోని శాక్త గాణపత కాపాలిక సంప్రదాయములలోని అనాచారములను దూరము చేసిరి. ఈ ప్రకారము దక్షిణ ప్రాంతము నందంతట ధర్మధ్వజమును ప్రతిష్ఠించిరి. వేదాంత శాస్త్ర ప్రభావమును ఉద్ఘాటించిరి. తరువాత ఉత్తర భారతము వైపు దృష్టి సారించిరి. ఉజ్జయినికి వెళ్ళి అచట భైరవుల భీషణ సాధనములను నిలిపి వేసిరి. అచటి నుండి గుజరాత్‌కు వెళ్ళి ద్వారకలో ఒక మఠమును స్థాపించి అచట తన శిష్యుని హస్తామలకాచార్యులను ఆచార్యులనుగా నియమించిరి. తరువాత గాంగేయ ప్రాంతమున పండితులను పరాజయము పాలు చేసి కాశ్మీర శారదా క్షేత్రమునకు చేరి అచటి పండితులను పరాజితులను చేసి స్వమతమును ప్రతిష్ఠించిరి. మరల అచటి నుండి అస్సాములోని కామరూపున అచటి శైవులను ఓడించి బదరికాశ్రమమునకు వెళ్ళిరి. అచట జ్యోతిర్మఠమును స్థాపించిరి. ఆ మఠమునకు తోటకాచార్యుని అధిపతిని గావించిరి. అటనుండి కేదార క్షేత్రమునకు వెడలి అచట కొన్ని దినములుండిన తరువాత బ్రహ్మైక్యమును పొందిరి.

శంకర భగవత్పాదులు సుమారు 272 గ్రంథములను రచించిరని చెప్పుదురు. కాని ఇవన్నీ వీరే రచించిరనుటకు స్పష్టమైన ఆధారములు లభించుట లేదు. వీరు రచించిన కొన్ని గ్రంథములు.

బ్రహ్మ సూత్ర భాష్యము, ఉపనిషద్భాష్యము, గీతాభాష్యము, విష్ణు సహస్రనామ భాష్యము, సనత్సు జాతీయ భాష్యము, హస్తామలక భాష్యము, లలితాత్రిశతీ భాష్యము, వివేక చూడామణి, ప్రబోధసుధాకరము, ఉపదేశ సాహస్రి మొదలగునవి.

**వివేక చూడామణి :**

శంకర భగవత్పాదులు రచించిన గ్రంథములు చిన్నవి పెద్దవి చాలా ఉన్ననూ వివేక చూడామణి సాధన, జ్ఞానప్రాప్తి విషయమున అత్యుత్తమమైనది. ఈ గ్రంథానుసారముగా జీవుడు మనుష్య జన్మను పొంది సంసారమును విడిచి అంతట పరిశుద్ధమగు భగవంతుని మాత్రమే చూచుచు, జీవన్ముక్తుడై కైవల్యమును పొందుటే ఉత్తమసిద్ధి. ఈ విషయమునే శంకర భగవత్పాదులు గీతాభాష్య బ్రహ్మసూత్ర భాష్యాది గ్రంథములలో విస్తరించి ప్రతిపాదించిరి. ఈ స్థితి ఎన్నో జన్మల పుణ్యము లేనిదే లభించజాలదని శంకర భగవత్పాదులు నుడివిరి.

**"ముక్తిర్నో శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే"** వి.చూ.2

ఈ విషయమునే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు కూడ చెప్పియున్నాడు.

**అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్.** గీతా 6-45

సాధన దృష్టితో చూచినచో భగవత్కృప ద్వారా మోక్షేచ్ఛ, దానికొరకు ప్రయత్నము, సత్సంగ ప్రాప్తి ఈ మూడు అత్యంత దుర్లభములు. వీటి ద్వారా వివేకము కలిగి, జీవన్ముక్తి, లభించును.

**దుర్లభం త్రయమే వైతత్ దైవానుగ్రహ హేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహా పురుష సంశ్రయః ॥ 453**

వి.చూ.3

వివేక చూడామణిలో నిత్యసమాధి కొరకు వైరాగ్యమే సర్వోత్కృష్ట సాధనముగా అంగీకరించబడినది.

"అత్యంత వైరాగ్యవతస్సమాధిః" అని శంకర భగవత్పాదుల వాక్యము. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానులు కూడా ఇదే విషయమును ఉపదేశించిరి.

**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ।**
**శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ॥**
**సమాధావచలా బుద్ధిః తదా యోగమవాప్స్యసి ।**

గీతా 2-52, 53

ఇట్టి విషయము లెన్నియో వివేక చూడామణిలో శంకర భగవత్పాదులు పొందుపరిచిరి. గ్రంథమును పూర్తిగా అధ్యయన మననాదులు చేసిననాడు మాత్రమే గ్రంథములోని మాధుర్యము, తత్త్వము అవగతమగును. కావున పాఠకులు మెల్లమెల్లగా గ్రంథమును మననము చేయుచు ఆనంద రసమును అనుభవింతురు గాత.



॥ శ్రీహరిః ॥

# వివేక చూడామణి

## శ్రీ ఆదిశంకరాచార్య విరచితము

నందితాని దిగంతాని యస్యానందాంబుబిందునా ।
పూర్ణానందం ప్రభుం వందే స్వానందైకస్వరూపిణమ్ ॥

## మంగళాచరణమ్

సర్వవేదాంత సిద్ధాంతగోచరం తమగోచరమ్ ।
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్ ॥ 1

అగోచరుడై యుండి కూడ సమస్త వేదాంతమునకు సంబంధించిన సిద్ధాంత వాక్యములచేత మాత్రమే తెలియనగువాడు, పరమానంద స్వరూపుడు, సద్గురువునగు గోవిందునకు ప్రణమిల్లుచున్నాను.

## బ్రహ్మనిష్ఠా మహత్త్వము

జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్ ।
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః
ముక్తిర్నో శతకోటిజన్మసు కృతైః పుణ్యైర్వినాలభ్యతే ॥ 2

జీవులకు తొలుత మానవజన్మము ప్రాప్తించుటయే దుర్లభము. దాని కంటెను ఆ జీవుడు పురుషుడు అగుటయు, దానికంటెను బ్రాహ్మణుడు అగుటయు, దానికంటెను వైదికధర్మము నాచరించువాడు అగుటయు, దానికంటెను విద్య కలవాడు అగుటయు మఱి దుర్లభము. ఇక ఆత్మానాత్మ వివేకము, చక్కని యనుభూతి, బ్రహ్మాత్మభావమును పొందియుండుట యనునవి యైనచో నూరుకోట్ల జన్మలలో చేసికొన్న శుభకర్మముల పరిపక్వ దశ వలన గాని లభ్యము కావు.

దుర్లభం త్రయమేవైతద్దేవానుగ్రహహేతుకమ్ ।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥ 3

మానవుడు అగుట, మోక్షాపేక్ష కలవాడగుట, మహాపురుషుల ఆశ్రయము ప్రాప్తించుట అను నీ మూడు విషయములును కడు దుర్లభమైనవి. ఇవి దైవానుగ్రహము కారణముగానే ప్రాప్తించునట్టివి.

లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్ ।
యః స్వాత్మముక్తౌ న యతేత మూఢధీః
స హ్యాత్మహా స్వం వినిహంత్యసద్గ్రహాత్ ॥ 4

అతికష్టము మీద లభించు మానవజన్మమును, అందును కూడ శ్రుతి (వేద) సిద్ధాంత పరిజ్ఞానమును పొందిన పురుషజన్మమును పొందియుండి కూడ మూఢమతియై యెవడు తన యాత్మముక్తి కొరకు పాటుపడకుండునో అతడు నిశ్చయముగా ఆత్మహత్య చేసికొన్నవాడే యగును. అసత్తునందు ఆసక్తి కలవాడైన కారణమున అతడు తనను తాను నాశము చేసికొన్నవాడు అగును.

ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తుస్వార్థే ప్రమాద్యతి ।
దుర్లభం మానుషం దేహం ప్రాప్యతత్రాపి పౌరుషమ్ ॥ 5

లోకములో జీవులకు మానవశరీరము, పురుషత్వము రెండును మిక్కిలి దుర్లభములైనవి. అట్టివానిని పొందియుండి కూడ స్వార్థప్రవృత్తికి లోబడి యే మానవుడు ప్రమత్తుడై చరించుచుండునో వానిని మించిన మూఢుడు మఱియొకడు ఉండునా? ఉండడు.

వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్
కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః ।
ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
న సిద్ధ్యతి బ్రహ్మశతాంతరేఽపి ॥ 6

ఒకడు ఎన్ని శాస్త్రప్రసంగములనైనను వివరించవచ్చును. ఎందరు దేవతలను ఉద్దేశించి యైనను యజ్ఞవిధుల నాచరింపవచ్చును. ఎన్ని శుభకర్మములైనను చేయవచ్చును. కాని వానికి బ్రహ్మము, ఆత్మయు నొక్కటియే యను జ్ఞానము కలుగనంత వరకు నూర్గురు బ్రహ్మల కాలము గడచినను ముక్తి లభింపదు.

("చతుర్యుగ సహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే" అనగా నాలుగువేల యుగముల కాలము బ్రహ్మయొక్క ఆయువులో ఒక్క దినము, అంతియే కాలము రేయి యగుచుండును. ఈ క్రమమున నూరు ఏండ్లు అయినచో ఒక కల్పముగా బ్రహ్మయొక్క ఆయువగును.)

అమృతత్వస్య నాఽఽశాస్తివిత్తేనేత్యేవ హి శ్రుతిః ।
బ్రవీతి కర్మణో ముక్తేరహేతుత్వంస్ఫుటం యతః ॥ 7

ధనము వలన అమృతత్వము (ముక్తి) ప్రాప్తించునన్న యాశ లేదని శ్రుతి తెలుపుచున్నది. దీనిని బట్టి ముక్తికి కర్మ కారణము కానేరదనుట స్పష్టమగుచున్నది.

## జ్ఞానప్రాప్తికి ఉపాయము

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్తబాహ్యార్థసుఖస్పృహస్సన్ ।
సంతం మహాంతం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థసమాహితాత్మా ॥ 8

కాబట్టి విద్వాంసుడు అయినవాడు బాహిరములైన భోగములమీద ఇచ్ఛను వీడవలెను. సాధుపుంగవుడైన గురుదేవు నాశ్రయింపవలెను. అతని చేత నుపదేశింపబడిన విషయమందు సమాహితమైన చిత్తముతో ప్రవర్తిల్లుచు ముక్తి కొరకు ప్రయత్నము చేయుచుండవలెను.

ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ ।
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా ॥ 9

నిరంతరమును సత్య (శాశ్వత) వస్తువైన ఆత్మను దర్శించుచు ఉండునట్టి నిష్ఠ వహించి మానవుడు యోగారూఢత్వమును పొంది, సంసారసముద్రంలో మునిగియున్న తనను తానే సముద్ధరించుకొనవలెను.

సంన్యస్య సర్వకర్మాణి భవబంధవిముక్తయే ।
యత్యతాం పండితైర్ధీరైరాత్మాభ్యాస ఉపస్థితైః ॥ 10

ఆత్మాభ్యాసపరాయణులైనవారు, ధీరులును అయిన పండితులు సమస్తకర్మలను పరిత్యజించి భవబంధములనుండి విముక్తులు అగుటకు ప్రయత్నము చేయవలయును.

చిత్తస్య శుద్ధయే కర్మ న తువస్తూపలబ్ధయే।
వస్తుసిద్ధిర్విచారేణ న కించిత్కర్మకోటిభిః ॥ 11

కర్మాచరణము చిత్తశుద్ధి కొరకు ఉద్దేశించబడినది. కాని వస్తూపలబ్ధి (ఆత్మవస్తుప్రాప్తి) కొరకు కాదు. ఆత్మవస్తువు అన్నది కేవలము విచారణము వలన మాత్రమే ప్రాప్తించును. కాని అది కోట్లకొలది కర్మలను ఆచరించినను సిద్ధింపనేరదు.

సమ్యగ్విచారతస్సిద్ధా రజ్జుతత్త్వావధారణా ।
భ్రాంత్యోదితమహాసర్పభయదుఃఖవినాశినీ ॥ 12

త్రాటిని జూచి సర్పమని భ్రమించి భయపడుట వలన గలిగిన దుఃఖమును 'అది సర్పము కాదు. రజ్జువు' (త్రాడు) అని చక్కగా విచారణ చేత సిద్ధింపజేసికొన్న నిశ్చయబుద్ధి హరించగలుగును.

అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః ।
న స్నానేన న దానేన ప్రాణాయామశతేన వా ॥ 13

హితకరములైన పలుకుల మూలమున విచారణ చేయుట చేతనే (ఆత్మ) వస్తువు నిశ్చయింపబడుట గమనింపబడినది. కాని స్నానముల వలన, దానముల వలన, వందలకొలదిగా సాగించిన ప్రాణాయామముల వలన ఆ నిశ్చయము సిద్ధించుట కలుగదు.

## అధికారి నిరూపణము

అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః ।
ఉపాయా దేశకాలాద్యాః సంత్యస్మిన్ సహకారిణః ॥ 14

ఈ విషయమున అధికారి (అర్హత కలవాడు) యైనవానికి మాత్రమే విశేషముగా ఫలము సిద్ధించుట సంభవమగును. దేశకాలాదులగు ఉపాయములు కూడా ఈ విషయమందు తప్పక సహాయకారులు కాగలవు.

అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసోరాత్మవస్తునః ।
సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్ ॥ 15

కావున జిజ్ఞాస కలవాడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు, దయాసముద్రుడును అయిన గురువును శరణు పొంది ఆత్మతత్త్వమును విచారము చేయవలయును.

మేధావీ పురుషో విద్వానూహాపోహవిచక్షణః ।
అధికార్యాత్మ విద్యాయా ముక్తలక్షణలక్షితః ॥ 16

బుద్ధిమంతుడు, విద్యావంతుడు, తర్కవితర్క చతురత గలవాడును అయిన పురుషుడు మాత్రమే ఆత్మవిద్యను పొందుటకు అధికారి (అర్హుడు) అగును.

వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః ।
ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా మతా ॥ 17

సదసద్వివేకము గలవాడు, వైరాగ్యము గలవాడు, శమదమాదిషడ్గుణ సంపద గలవాడై మోక్షము నపేక్షించు వానికి మాత్రమే బ్రహ్మజిజ్ఞాసకు సంబంధించిన యర్హత యుండునని భావించబడినది.

## సాధన చతుష్టయము

సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః ।
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే నసిద్ధ్యతి ॥ 18

బుద్ధిమంతులచేత జిజ్ఞాసకు నాలుగు సాధనములు తెలుపబడినవి. అవి యున్నప్పుడే సత్యస్వరూపమైన ఆత్మయందు నిష్ఠ సాధ్యము కాగలదు. అవిలేనినాడు సాధ్యము కాదు.

ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే ।
ఇహాముత్ర ఫలభోగవిరాగస్తదనంతరమ్ ॥ 19

శమాదిషట్కసంపత్తిర్ముముక్షుత్వమితి స్ఫుటమ్ ।

దానిలో నిత్యానిత్యవస్తువివేకము మొదటి సాధనముగా పరిగణింపబడినది. ఇహలోకమునకు, పరలోకమునకు సంబంధించిన సుఖభోగాదులయందు విరక్తి కలుగుట రెండవ సాధనము. శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము - ఈ యారును షడ్గుణసంపదగా పేర్కొనబడినవి. ఈ సంపద మూడవ సాధనము. మోక్షాపేక్ష నాలుగవది.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యేత్యేవంరూపోవినిశ్చయః ॥ 20
సో-యం నిత్యానిత్యవస్తువివేకస్సముదాహృతః ।

బ్రహ్మము సత్యము (శాశ్వతము) అయినది. జగత్తు మిథ్యయైనది అనునట్టి నిశ్చయ బుద్ధి కలుగటయే 'నిత్యానిత్యవస్తు వివేకము' అనబడును.

తద్వైరాగ్యం జుగుప్సా యా దర్శనశ్రవణాదిభిః ॥ 21
దేహాదిబ్రహ్మ పర్యంతే హ్యనిత్యే భోగవస్తుని ।

దర్శనము, శ్రవణము మున్నగు విధుల మూలమున దేహము మొదలగు బ్రహ్మపర్యంతముగా ఉన్న అశాశ్వతములైన భోగ్యపదార్థముల యెడల ఏవగింపు, రోత జనించుటయే వైరాగ్యము అనబడును.

విరజ్య విషయవ్రాతాద్దోషదృష్ట్యా ముహుర్ముహుః ॥ 22
స్వలక్ష్యే నియతావస్థా మనసశ్శమ ఉచ్యతే ।

విషయముల సమూహమందు మాటికిమాటికి దోషదృక్పథమును ఏర్పరచికొని విరక్తి చెందిన మనస్సు తన లక్ష్యమునందు స్థిరముగా నిలిచిపోవుట 'శమము' అనబడును.

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే ॥ 23
ఉభయేషామింద్రియాణాం స దమః పరికీర్తితః ।
బాహ్యానాలంబనం వృత్తేరేషోపరతిరుత్తమా ॥ 24

కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను రెండింటిని వానివాని విషయముల నుండి వెనుకకు మరలించి వాని వాని స్వీయ గోళకములందు (పరిధి లేక గడి) నిలుపుట 'దమము' అనబడును. (చిత్త) వృత్తి బాహ్య విషయములను ఆశ్రయింపకుండుట ఉత్తమమైన ఉపరతి యనబడును.

సహనం సర్వదుఃఖానామప్రతీకారపూర్వకమ్ ।
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే ॥ 25

చింతాశోకములకు లోబడక, యెట్టి ప్రతీకారచర్యకును పాల్పడక యుండుచు సర్వవిధదుఃఖములను సహించుట 'తితిక్ష' యనబడును.

శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యవధారణమ్ ।
సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే ॥ 26

శాస్త్రమునందు, గురువాక్యమునందు సత్యబుద్ధి (నిజమే అన్న భావన) కలిగియుండుట 'శ్రద్ధ' యనబడును. ఆ శ్రద్ధవలననే ఆత్మవస్తువు ప్రాప్తించును.

సర్వదా స్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణిసర్వథా ।
తత్సమాధానమిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్ ॥ 27

తన బుద్ధిని సర్వవిధముల శుద్ధబ్రహ్మమునందు సర్వదా స్థిరపరచికొని యుండుటయే 'సమాధాన'మనబడును. చిత్తమును బుజ్జగించుటయో

లేక దాని యిచ్ఛాపూర్తిని సాధించుటయో మాత్రము 'సమాధానము' కానేరదు.

అహంకారాదిదేహాంతాన్ బంధానజ్ఞానకల్పితాన్ ।
స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా ॥ 28

అహంకారము మొదలు దేహము వరకును అజ్ఞానము చేత కల్పించబడిన బంధములు ఎన్ని కలవో వాని నన్నిటిని స్వస్వరూప పరిజ్ఞానము కలుగుటతో పరిత్యజించి వేయవలయు నన్న కాంక్షయే 'ముముక్షుత్వము' (మోక్షాపేక్ష) కలిగియుండుట యనబడును.

మందమధ్యమరూపాఽపి వైరాగ్యేణ శమాదినా ।
ప్రసాదేన గురోస్సేయం ప్రవృద్ధా సూయతేఫలమ్ ॥ 29

ఆ మోక్షాపేక్ష మందగించిన దశలో నున్నది కావచ్చును. వలయునంత తీవ్రమైనది కాక మధ్యమస్థితియందు ఉన్నది కావచ్చును. అది యే దశయందు ఉన్నదైనను వైరాగ్యము చేతను, శమాదిషట్సంపత్తి చేతను వర్ధిల్లి, గురుని కృపచేత పెంపొంది ఫలమును ప్రసవించగలుగును.

వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తువిద్యతే।
తస్మిన్నేవార్థవంతః స్యుః ఫలవంతశ్శమాదయః ॥ 30

ఎవనియందు వైరాగ్యము, మోక్షకాంక్షయు తీవ్రదశయందు ఉండునో వానియందే శమము మొదలగు గుణములు చరితార్థములును, ఫలవంతములును కాగలవు.

ఏతయోర్మందతా యత్ర విరక్తత్వముముక్షయోః ।
మరౌ సలిలవత్తత్ర శమాదేర్భాసమాత్రతా ॥ 31

ఈ వైరాగ్యము, మోక్షకాంక్షయు ఏయెడ మందగించి యుండునో ఆ యెడ శమాదులైన గుణములు కూడ మరుభూమిలో నీటివలె ఆభాసమాత్రముగానే ఉండును.

మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥ 32

స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః ।

మోక్షమునకు కారణభూతమైన సామగ్రియందు భక్తియే సర్వశ్రేష్ఠమైనది. తన నిజరూపమును అనుసంధానము చేయుటయే భక్తియనబడును. తన యాత్మ తత్త్వమును అనుసంధానము చేయుటయే భక్తియని కొందరు అందురు.

## గుర్వాశ్రయము - ప్రశ్నవిధి

ఉక్తసాధనసంపన్నః తత్త్వజిజ్ఞాసురాత్మనః ॥ 33
ఉపసీదేద్గురుం ప్రాజ్ఞంయస్మాద్బంధవిమోక్షణమ్ ।

ఆత్మతత్త్వజిజ్ఞాస గల పురుషుడు ముందు చెప్పబడిన సాధన చతుష్టయసంపదను సమకూర్చుకొని ప్రాజ్ఞుడు (స్థితప్రజ్ఞుడు) అయిన గురువు చెంతకు జేరవలయును. ఆ గురువు వలననే అతడు భవబంధవిముక్తిని పొందగలుగును.

శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః ॥ 34

బ్రహ్మణ్యుపరతశ్శాంతో నిరింధన ఇవానలః ।
అహైతుకదయాసింధుర్బంధురానమతాం సతామ్ ॥ 35

తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః ।
ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేజ్ఞాతవ్యమాత్మనః ॥ 36

శ్రోత్రియుడు, పాపరహితుడు, కోరికలు లేనివాడు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు, బ్రహ్మనిష్ఠ గలవాడు. నివురుగప్పిన నిప్పువలె శాంతముగా నుండువాడు. నిర్వ్యాజ దయాసింధువు అగువాడు, ప్రణతులైన (శరణుజొచ్చిన) సజ్జనుల పాలిటి బంధువు అయిన గురువరుని వినయము, అనునయమును మీరసేవించి, భక్తితో నారాధించి అతడు ప్రసన్నుడు అయిన మీదట చెంతకు జేరి, తాను తెలియగోరిన విషయమును గూర్చి యీ విధముగా ప్రశ్నింపవలెను.

స్వామిన్ నమస్తే నతలోకబంధో
కారుణ్యసింధో పతితం భవాబ్ధౌ ।
మాముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా
ఋజ్వ్యాఽతికారుణ్యసుధాభివృష్ట్యా ॥ 37

ఓ కరుణాసముద్రా! ఓ శరణాగతవత్సలా! ఓప్రభూ! మీకు నమస్కారము. సంసార సముద్రంలో పడియున్న నన్ను సరళము, అతితరకరుణామృతమును వర్షించునదియునగు మీ కృపాకటాక్షము చేత ఉద్ధరించుడు!

దుర్వార సంసారదవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః ।
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహం న జానే ॥ 38

వారింప శక్యముకాని సంసారపు దావాగ్నిచేత దగ్ధుడనయినవాడను. దురదృష్టపు పెనుతుఫాను గాలులచేత కంపింపజేయబడినవాడను. భయమునొందినవాడనై మిమ్ము శరణు పొందినవాడను. ఇట్టి నన్ను ఓ గురుదేవా! మృత్యువు బారినుండి రక్షింపుడు! మిమ్ము దప్ప శరణ్యులైనవారిని వేఱెవ్వరిని నేను ఎరుగను.

శాంతా మహాంతో నివసంతి సంతః
వసంతవల్లోకహితం చరంతః ।
తీర్ణాస్స్వయం భీమమహార్ణవం జనా
నహేతునాన్యానపి తారయంతః ॥ 39

భయంకరమైన సంసారసముద్రమును స్వయముగా తరించినవారై, హేతురహితముగా ఇతరులను కూడ తరింపజేయుచున్నవారై శాంతులు, మహాపురుషులును అయిన సాధుజనులు ఎందఱో ఋతురాజైన వసంతునివలె లోకకళ్యాణము గావించుచు నివసించుచున్నారు.

అయం స్వభావః స్వత ఏవ యత్పర
శ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్ ।
సుధాంశురేషః స్వయమర్కకర్కశ
ప్రభాభితప్తామవతి క్షితిం కిల ॥ 40

మహాత్ములైనవారు స్వయముగనే పరుల శ్రమను తొలగించుటకు పాటుపడుచుందురు. వారి స్వభావమే అట్టిది. సూర్యుని ప్రచండకిరణములచేత సంతప్తమైన భూమిని చంద్రదేవుడు స్వయముగనే చల్లబరచి రక్షించుచుండును కదా!

బ్రహ్మానందరసానుభూతి కవితైః పూతైస్సుశీతైస్సితైః
యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖైర్వాక్యామృతైస్సేచయ ।
సంతప్తం భవతాప దావదహనజ్వాలాభిరేనం ప్రభో
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః ॥ 41

ప్రభూ! ప్రచండమైన సంసారపు దవాగ్నియొక్క జ్వాలలచేత తపించి పోయిన యీ దీనుడను, శరణాగతుడను అయిన నన్ను మీరు మీ బ్రహ్మానందరసానుభవముతో కూడి పవిత్రములై, బహుశీతలములై, స్వచ్ఛములైన మీ వాక్కు అనెడు సువర్ణకలశమునుండి బహిర్గతములై, శ్రవణ సుఖకరములైన వాక్యామృతముతోడ స్నాతుని గావింపుడు! (నా తాపమును హరించుడు!) కరుణామృతపూరితమై మీ దృష్టికి క్షణకాలమైన పాత్రులై మీచేత స్వీకరింపబడినవారు ఎంతయు ధన్యులు.

కథం తరేయం భవసింధుమేతం
కా వా గతిర్మే కతమోఽస్త్యుపాయః ।
జానే న కించిత్ కృపయాఽవ మాం భోః
సంసారదుఃఖక్షతిమాతనుష్వ ॥ 42

నేను ఈ సంసార సముద్రమును ఎట్లు తరింపగలనో? నా గతియేమగునో? దీనికి ఉపాయము ఏమియో యెరుగరాకున్నది? ప్రభూ!

ఒకింత నాపై దయజూపి నన్ను రక్షింపడు! నా సంసార దుఃఖమును హరింపుడు!

## ఉపదేశ విధానము

తథా వదంతం శరణాగతం స్వం
సంసారదావానల తాపతప్తమ్ ।
నిరీక్ష్య కారుణ్యరసార్ద్రదృష్ట్యా
దద్యాదభీతిం సహసా మహాత్మా ॥ 43

ఈవిధముగా పలుకుచు తనను శరణు పొందిన ఆ శిష్యుని మహాత్ముడైన గురువు కరుణాపూరిత దృక్కులతో చూచి యతనికి వెంటనే అభయమీయవలయును.

విద్వాన్ స తస్మా ఉపసత్తిమీయుషే
ముముక్షవే సాధు యథోక్తకారిణే ।
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్ ॥ 44

శరణము కోరుచున్నవాడు, మోక్షాపేక్ష కలవాడు, శాంతచిత్తుడు, ఆజ్ఞాకారి, శమదమాది సుగుణ సంపద గలవాడు, సాధుశీలుడు అయిన ఆ శిష్యునకు కృపాపూర్వకముగా గురువు (ఈవిధముగా) ఉపదేశము చేయవలయును.

శ్రీగురురువాచ

మాభైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః
సంసారసింధోస్తరణేఽస్త్యుపాయః ।
యేనైవ యాతా యతయోఽస్య పారం
తమేవ మార్గం తవ నిర్దిశామి ॥ 45

గురువు పలుకవలయు విధము - "విద్యావంతుడా! భయపడవలదు.

నీకు అపాయము లేదు. సంసారసముద్రమును తరించుటకు నీకు ఉపాయమున్నది. ఎందఱో యతీశ్వరులు ఏ మార్గమున దీనిని తరించిపోయారో ఆ మార్గమునే నీకు చూపుచున్నాను.

అస్త్యుపాయో మహాన్ కశ్చిత్సంసారభయనాశనః ।
యేన తీర్త్వా భవాంభోధిం పరమానందమాప్స్యసి ॥ 46

సంసారభయమును హరింపగల ఉపాయము ఒకటి యున్నది. దాని సాయమున నీవు ఈ సంసారసముద్రమును తరించి పరమానందమును అందుకొనగలవు.

వేదాంతార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్ ।
తేనాత్యంతికసంసారదుఃఖనాశో భవత్యను ॥ 47

వేదాంతవాక్యముల అర్థవిచారణ చేయుట మూలమున ఉత్తమజ్ఞానము కలుగగలదు. దానివలన మీదుమిక్కిలి సంసార దుఃఖము అంతరించగలదు.

శ్రద్ధాభక్తిజ్ఞానయోగాన్ముముక్షోః
ముక్తేర్హేతూన్ వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః ।
యో వా ఏతేష్వేవ తిష్ఠత్యముష్య
మోక్షోఽవిద్యాకల్పితాద్దేహబంధాత్ ॥ 48

మోక్షాపేక్ష గలవానికి ముక్తి లభించవలెనన్న అందులకు శ్రద్ధ, భక్తి, ధ్యానము, యోగము అనునవి కారణభూతములైనవని ప్రత్యక్షముగా వేదవాక్కు చెప్పుచున్నది. ఈ కారణములందు ఎవడు స్థిరపడియుండునో వానికి అవిద్య (అజ్ఞానము) వలన కల్పితమైన దేహబంధము నుండి విముక్తి లభింపగలదు.

అజ్ఞానయోగాత్పరమాత్మనస్తవ
హ్యనాత్మ బంధస్తత ఏవ సంసృతిః ।
తయోర్వివేకోదితబోధవహ్ని
రజ్ఞానకార్యం ప్రదహేత్సమూలమ్ ॥ 49

పరమాత్మ స్వరూపుడవైన నీకు అజ్ఞానము కారణముగా ఈ యనాత్మతోడ బంధనము ప్రాప్తించినది. ఆ కారణమున నీకు (జనన మరణ రూపమైన) సంసారము ప్రాప్తమైనది. కాబట్టి ఆత్మ యేది? ఆనాత్మ యేది? అని వివేచనము చేయగా కలిగిన జ్ఞానరూపమైన అగ్ని యా అజ్ఞానము యొక్క కార్యరూపమగు సంసారమును సమూలముగా భస్మము చేసివేయగలదు."

శిష్య ఉవాచ

**కృపయా శ్రూయతాం స్వామిన్ ప్రశ్నోఽయం క్రియతేమయా ।**
**తదుత్తరమహం శ్రుత్వా కృతార్థః స్యాం భవన్ముఖాత్ ॥ 50**

శిష్యుడు - "స్వామీ! దయచేసి యాలకింపుడు. ప్రశ్నించుచున్నాను. దీనికి మీ ద్వారా సమాధానమును ఆలకించి నేను కృతకృత్యుడనయ్యెదను.

**కో నామ బంధః కథమేష ఆగతః**
**కథం ప్రతిష్ఠాఽస్య కథం విమోక్షః ।**
**కోఽసావనాత్మా పరమః క ఆత్మా**
**తయోర్వివేకః కథముతదుచ్యతామ్ ॥ 51**

బంధనము అనగా నేమి? అది యెట్లు ప్రాప్తించినది? దాని స్థితి యెట్టిది? దానినుండిముక్తి యెట్లు ప్రాప్తించును? అనాత్మ (ఆత్మకానిది) యననేది? పరమాత్మ యేది? ఆ రెండింటి వివేకమును ఎట్టిది? దయచేసి యీ విషయములను నాకు ఎఱిగింపుడు!

## శిష్య ప్రశంస

శ్రీగురురువాచ

**ధన్యోఽసి కృతకృత్యోఽసి పావితం తే కులం త్వయా ।**
**యదవిద్యాబంధముక్త్యా బ్రహ్మీభవితుమిచ్ఛసి ॥ 52**

గురువు - "నాయనా! నీవు ధన్యుడవు, నీవు అవిద్యారూపమైన బంధనమునుండి విముక్తిని గాంచి బ్రహ్మభావమును పొందగోరుచున్నావు. ఈకారణముగా నీచేత నీ వంశము పవిత్రము గావింపబడినది.

## స్వప్రయత్నము యొక్క ప్రాధాన్యము

ఋణమోచనకర్తారః పితుస్సంతి సుతాదయః ।
బంధమోచనకర్తా తు స్వస్మాదన్యో న కశ్చన ॥ 53

తండ్రియొక్క ఋణబంధమును తొలగించుటకు తనయులు మున్నగువారు ఉందురు. కాని తన సంసారబంధమును తొలగించుటకు అన్యులు ఎవ్వరును పూనుకొనజాలరు. దానిని నివారించుకొనుటకు తనయంతట తానే పూనుకొనవలయును. (ఎవరి భవబంధములను వారే తొలగించికొనవలయును.)

మస్తకన్యస్తభారాదేర్దుఃఖమన్యైర్నివార్యతే, ।
క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్ ॥ 54

తలపై నున్న బరువు వలన గలిగిన దుఃఖమును అన్యులు కూడ నివారించగలుగుదురు. కాని యాకలి, దప్పిక మున్నగువాని వలన గలిగిన దుఃఖము మానవుడు తనంత తానే నివారించుకొనవలయును. కాని యన్యులు ఎవ్వరును నివారింపజాలరు.

పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।
ఆరోగ్యసిద్ధిర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥ 55

పథ్యనియమమును పాటించుచు ఎవడు ఔషధసేవనము చేయునో అతడు ఆరోగ్యమును పొందుటను మనము చూచుచుందుము. కాని యీ విధముగా ఇతరులు చేసిన కర్మల మూలమున ఎవడును ఆరోగ్యమును పొందలేడు.

వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా
స్వేనైన వేద్యంన నను పండితేన ।
చంద్రస్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్యమన్యైరవగమ్యతే కిమ్ ॥ 56

(ఆవిధముగానే) పండితుడైనవాడు (ఆత్మ) వస్తు స్వరూపమును కూడ తన జ్ఞాననేత్రముతోనే చూడవలయును. తెలిసికొనవలయును. కాని అది అన్యుల వలన సాధ్యమగు పనికాదు. చంద్రుని స్వరూపమును ఎవరైన తన కన్నులతో తాము చూచి తెలిసికొనవలయును. కాని అది యితరుల వలన తెలియ శక్యమగునా?

అవిద్యాకామకర్మాది పాశబంధం విమోచితుమ్ ।
కశ్శక్నుయాద్వినాత్మానం కల్పకోటిశతైరపి ॥ 57

అవిద్య (అజ్ఞానము), కామన (కోరిక), కర్మము మొదలైనవాని వలన గలిగిన బంధనములను తనయంత తానుగా తొలగించి కొనవలయును. కాని నూరు కోట్ల కల్పముల కాలము గడచినను ఆ పని అన్యుల వలన సాధ్యమగునది కాదు.

## ఆత్మ జ్ఞాన మహత్త్వము

న యోగేన న సాంఖ్యేన కర్మణా నో నవిద్యయా ।
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షస్సిద్ధ్యతి నాన్యథా ॥ 58

మోక్షమన్నది యోగమువలన కాని, సాంఖ్యము వలన కాని, కర్మవలన గాని, విద్యవలన గాని సిద్ధించదు. అది కేవలమును ఒక్క బ్రహ్మాత్మైక్యబోధము (బ్రహ్మము, ఆత్మయు ఒక్కటియే యన్న అనుభవపూర్వక జ్ఞానము) వలన మాత్రమే సిద్ధించును. కాని మఱియే విధమునను సిద్ధింపదు.

వీణాయా రూపసౌందర్యం తంత్రీవాదనసౌష్ఠవమ్ ।
ప్రజారంజనమాత్రం తన్న సామ్రాజ్యాయ కల్పతే ॥ 59

వాగ్వైఖరీ శబ్దఝురీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్ ।
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తుముక్తయే ॥ 60

వీణయొక్క రూప సౌందర్యమునకు, దాని తీగలను మ్రోగించుటలో

సంపాదించుకొన్న నైపుణ్యమునకును ప్రజలను రంజింపజేయుట మాత్రమే ఫలమగును. కాని దానివలన సామ్రాజ్య మేదియు ప్రాప్తింపనేరదు. అట్లే పండితుల వాక్చాతుర్యము, ధారావాహికముగా మాటలాడగల నేర్పు, శాస్త్ర విషయములను వ్యాఖ్యానింపగల కౌశలము, పాండిత్యము - ఇవియన్నియు భోగమునకు హేతువులు కాగలవు. కాని మోక్షమునకు హేతువులు కాజాలవు.

**అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా ।**
**విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా ॥ 61**

పరతత్త్వము తెలియని దశయందును శాస్త్రాధ్యయనము నిరర్థకమే యగును. తెలిసిన దశయందును నిరర్థకమే యగును. (తెలియని దశలో శాస్త్రాధ్యయనమును తగిన విధముగా సార్థకము చేసికొనలేదనియు, తెలిసిన దశలో దానియావశ్యకత యిక లేదనియు భావము).

**శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్ ।**
**అతః ప్రయత్నాజ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః ॥ 62**

శబ్దజాలము మహారణ్యము వంటిది. అది చిత్తవిభ్రమమును కలిగించును. కాబట్టి ఒక తత్త్వవేత్తయైన మహాపురుషుని వలన ప్రయత్నపూర్వకముగా ఆత్మతత్త్వమును ఎరుగవలెను.

**అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా ।**
**కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః॥ 63**

అజ్ఞానము అను సర్పము చేత కాటు వేయబడినవానికి బ్రహ్మజ్ఞానము అను ఔషధము అపేక్షితమగును. కాని వానికి వేదముల వలన, శాస్త్రముల వలన, మంత్రముల వలన, ఔషధముల వలన ప్రయోజనమేమి?

## అపరోక్షానుభవము యొక్క ఆవశ్యకత

**న గచ్ఛతి వినా పానం వ్యాధిరౌషధశబ్దతః ।**
**వినాపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే ॥ 64**

ఔషధమును సేవించుట మాని 'ఔషధము, ఔషదము' అని ఔషధ శబ్దము నుచ్చరించినంత మాత్రమున వ్యాధి నివృత్తము గాదు. అట్లే అపరోక్షానుభవము సిద్ధింపక ముందు 'నేను బ్రహ్మమును. నేను బ్రహ్మమును.' అని పలికినంత మాత్రమున దేహి ముక్తుడు గాడు.

**అకృత్వా దృశ్యవిలయమజ్ఞాత్వా తత్త్వమాత్మనః ।**
**బాహ్యశబ్దైః కుతో ముక్తిరుక్తిమాత్రఫలైర్నృణామ్ ॥ 65**

దృశ్యమాన మగుచున్న ప్రపంచమును విలయము చేయకయు, ఆత్మతత్త్వమును అవగతము చేసికొనకయు కేవలము ఉచ్చారణమే ప్రయోజనముగా గల బాహ్యశబ్దముల వలన మానవులకు ముక్తి ఎట్లు కలుగును?

**అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిలభూశ్రియమ్ ।**
**రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ॥ 66**

సమస్త శత్రుసంహారము గావింపకయు, సమస్త భూమండలగతమైన ఐశ్వర్యమును పొందకయు 'నేను రాజును. నేను రాజును అని' పలికినంత మాత్రమున ఎవ్వడును రాజు కాజాలడు.

**ఆప్తోక్తిం ఖననం తథోపరి శిలాద్యుత్కర్షణం స్వీకృతిం**
**నిక్షేపస్సమపేక్షతే న హి బహిశ్శబ్దైస్తు నిర్గచ్ఛతి ।**
**తద్వద్బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభిర్లభ్యతే**
**మాయాకార్యతిరోహితంస్వమమలంతత్త్వంనదుర్యుక్తిభిః ॥ 67**

భూమిలోపల నిక్షిప్తమైయున్న నిధిని పొందవలె నన్న ఒక విశ్వసనీయుడైన వ్యక్తి అక్కడ నిధియున్నదని ముందుగా తెలియజెప్పుటయు, అనంతరము అక్కడ త్రవ్వుటయు, ఱాలు మున్నగువానిని తొలగించుటయు, అపేక్షితమగును, పిమ్మట ఆ ధనమును పొందుట సంభవమగును. కాని వట్టి మాటలచేత అది బహిర్గతము కాదు. ఆ విధముగనే సమస్తమాయామయ ప్రపంచ విరహితము, నిర్మలమును అయిన

ఆత్మతత్త్వమును పడయవలెనన్న దానికి కూడ ముందు ఒక బ్రహ్మవేత్తయైన గురువు యొక్క ఉపదేశము, అనంతరము దాని మననము, నిదిధ్యాసనము, (మఱియు మఱియు తలచుట) మున్నగు ప్రక్రియలను అనుసరించుటయును అపేక్షితములగును. కాని అది వట్టి మాటలతోను కుయుక్తులతోను ప్రాప్తింపనేరదు.

తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయే ।
స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదావివ పండితైః ॥ 68

కాబట్టి రోగాదుల నివృత్తి కొరకు ఎట్లు స్వయముగా ప్రవర్తింతుమో అట్లే పండితుడైనవాడు భవబంధములను తొలగించుకొనుటకై తన శక్తిని అంతను వినియోగించి స్వయముగనే ప్రయత్నము చేయవలయును.

## ప్రశ్న విచారము

యస్త్వయాఽద్య కృతః ప్రశ్నో వరీయాన్శాస్త్రవిన్మతః ।
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః ॥ 69

నీవు వేసిన ప్రశ్న శాస్త్రవేత్తలు సమ్మతించునట్టిది. సూత్రప్రాయము (సంక్షిప్తము) అయినట్టిది. నిగూఢమైన (గంభీరము) అర్థము కలది. మోక్షాపేక్ష కలవారు ఎరుగదగినిది.

శృణుష్వావహితో బ్రహ్మన్ యన్మయాసముదీర్యతే ।
తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబంధాద్విమోక్ష్యసే ॥ 70

పండితవరేణ్యా! నేను చెప్పుచున్న దానిని శ్రద్ధగా సావధానచిత్తుడవై యాలకింపుము. దానిని ఆలకించుట వలన నీవు శీఘ్రముగా భవబంధముల నుండి విముక్తి పొందగలవు.

మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్యమత్యంతమనిత్యవస్తుషు ।
తతశ్శమశ్చాపి దమస్తితిక్షా
న్యాసః ప్రసక్తాఖిలకర్మణాం భృశమ్ ॥ 71

తతః శ్రుతిస్తన్మననం సతత్త్వ
ధ్యానం చిరం నిత్యనిరంతరం మునేః ।
తతోऽవికల్పం పరమేత్య విద్వాన్
ఇహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి ॥ 72

అనిత్య వస్తువులయందు అత్యంతవైరాగ్యము కలుగుట మోక్షప్రాప్తికి మొదటి కారణము. అనంతరము శమము, దమము, తితిక్షయు కారణములగును. అటు పిమ్మట మునియైనవాడు శ్రవణము, మననము, చిరకాలపర్యంతము నిత్యము 'నిరంతరముగా ఆత్మతత్త్వమును ధ్యానము చేయుచుండవలెను. అప్పుడు ఆ పండితుడు ఇహమందే నిర్వికల్పావస్థను పొంది' నిర్వాణసుఖమును పొందగలుగును.

యద్బోద్ధవ్యం తవేదానీమాత్మానాత్మవివేచనమ్ ।
తదుచ్యతే మయా సమ్యక్ఛ్రుత్వాత్మన్యవధారయ ॥ 73

ఇక నీకు ఆత్మానాత్మ వివేకమును బోధింపవలయును. దానిని ఇప్పుడు నీకు తెలుపుచున్నాను. దానిని ఆలకించి చక్కగా చిత్తములో ధారణము చేయుము!

## స్థూల శరీర వర్ణనము

మజ్జాస్థిమేదః పలరక్త చర్మ
త్వగాహ్వయైర్ధాతుభిరేభిరన్వితమ్ ।
పాదోరువక్షోభుజపృష్ఠమస్తకై
రంగైరుపాంగైరుపయుక్తమేతత్ ॥ 74

అహం మమేతి ప్రథితం శరీరం
మోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః ।

మజ్జ, అస్థి (ఎముక), మేదస్సు (క్రొవ్వు), మాంసము, రక్తము, చర్మము, త్వక్కు అనబడు ధాతువులు గలిగియుండి, పాదములు,

తొడలు, వక్షస్థలము, భుజములు, వెన్ను, మస్తకము అనబడు అవయవములు, ఉపాంగములను గలిగియుండి, నేను, నాది యను అహంకారమమకారములకు ఆశ్రయస్థానమై యుండునట్టి దేహమునే పండితులు స్థూలశరీరమని పేర్కొనిరి.

నభోనభస్వద్దహనాంబుభూమయః
సూక్ష్మాణి భూతాని భవంతి తాని ॥ 75

పరస్పరాంశైర్మిళితాని భూత్వా
స్థూలాని చ స్థూలశరీరహేతవః ।
మాత్రాస్తదీయా విషయా భవంతి
శబ్దాదయః పంచ సుఖాయ భోక్తుః ॥ 76

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి - ఇవి సూక్ష్మ భూతములు. వీని యంశములు పరస్పరము సమ్మిళితములై స్థూలరూపము నొంది స్థూలశరీరమునకు కారణము లగుచుండును. వాని తన్మాత్రలే భోక్త (అనుభవించువాడు) అయిన జీవునకు సుఖమును గలిగించునట్టి శబ్దాదివిషయములు అగుచుండును.

య ఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరుపాశేన సదుర్దమేన ।
ఆయాంతి నిర్యాంత్యథ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మదూతేన జవేన నీతాః ॥ 77

ఈ విషయములందు రాగము అను దుర్దమమైన పాశముచేత ఏ మూఢులు బద్ధులయిపోవుదురో వారు తాము చేసికొన్న కర్మము అను దూతచేత వేగముగా కొనిపోవబడుచు (ఒకప్పుడు) పైపైకి ఉత్తమోత్తమయోనులలోనికి, (మఱియొకప్పుడు) క్రిందకు క్రిందకు అధమాధమయోనులలోనికి పోవుచు వచ్చుచునుందురు.

# విషయ నింద

శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః ।
కురంగమాతంగపతంగమీన
భృంగా నరః పంచభిరంచితః కిమ్ ॥ 78

హరిణమునకు శబ్దప్రీతి, ఏనుగునకు స్పర్శప్రీతి, పతంగమునకు (మిడుత) రూపప్రీతి, మీనమునకు (చేప) రసప్రీతి, భృంగమునకు (తుమ్మెద) గంధప్రీతి స్వభావసిద్ధమైనవి. ఈ అయిదు ప్రాణులును తమతమ స్వభావములను అనుసరించి శబ్దాదులైన అయిదు విషయములందును ఏదియో ఒకదానియందలి ప్రీతిచేతనే బద్ధములై మృత్యువు వాత పడిపోవుచున్నవి. అట్టి దశలో అయిదు విషయములయందలి ప్రీతిచేత బద్ధుడైయున్న మానవుని విషయమున చెప్పవలసినది ఏమున్నది?

దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి ।
విషం నిహంతి భోక్తారం ద్రష్టారంచక్షుషాప్యయమ్॥ 79

దోషదృష్టితో చూచినచో విషయము నల్లత్రాచు విషముకంటెను తీవ్రమైనది. విషము తిన్నవాని ప్రాణములనే హరించును. కాని విషయము కంటితో చూచినవానిని కూడ విడిచిపెట్టదు.

విషయాశామహాపాశాద్యో విముక్తస్సుదుస్త్యజాత్ ।
స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్శాస్త్రవేద్యపి ॥ 80

తొలగించికొన శక్యము కానట్టి విషయప్రీతి యను మహాపాశమునుండి విముక్తుడైనవాడు మాత్రమే మోక్షమును పొందగలుగును. కాని తదితరుడు షట్శాస్త్రవేత్త అయినను ముక్తుడు కాజాలడు.

ఆపాత వైరాగ్యవతో ముముక్షూన్
భవాబ్ధిపారం ప్రతియాతుముద్యతాన్ ।

ఆశాగ్రహో మజ్జయతేఽ౦తరాళే
విగృహ్య కంఠే వినివర్త్య వేగాత్ ॥ 81

క్షణిక వైరాగ్యమునకు లోబడి మోక్షాపేక్షతో సంసారసముద్రమును తరించిపోవుటకు ఉద్యుక్తులైనవారిని మధ్యమందే ఆశయను మొసలి కంఠముపట్టుకొని వేగముగా వెనుకకు లాగి ముంచివేయును.

విషయాఖ్యగ్రహో యస్య సువిరక్త్యసినా హతః ।
స గచ్ఛతి భవాంభోధేః పారంప్రత్యూహవర్జితః ॥ 82

ప్రబలమైన వైరాగ్యమను ఖడ్గముతో విషయవాసనారూపమైన మొసలిని చంపివైచినవాడు మాత్రమే నిర్విఘ్నముగా సంసారసముద్రమును తరించి పోవగలుగును.

విషమవిషయమార్గైర్గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపదమభియాతో మృత్యురప్యేష విద్ధి ।
హితసుజనగురూక్త్యా గచ్ఛతః స్వస్యయుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధిస్సత్యమిత్యేవ విద్ధి ॥ 83

మలినమైన బుద్ధి గలవాడై, విషయములు అను విషమమార్గమునందు పయనించువానిని పదపదమున మృత్యువు వెంబడించుచునే యుండును అన్న మాటను మరువవలదు. అట్లే తన హితమును కోరువారి యొక్కయు, లేక గురువు యొక్కయు ఉపదేశమును అనుసరించియు, తన యుక్తిని అనుసరించియు సాగిపోవు వానికి తప్ప ఫలసిద్ధి కలుగునన్న మాట కూడ సత్యమని నమ్మి తలపులో నిలుపుకొనుము.

మోక్షస్య కాంక్షా యదివై తవాస్తి
త్యజాతిదూరాద్విషయాన్ విషం యథా ।
పీయూషవత్తోషదయాక్షమార్జవ
ప్రశాంతిదాంతీర్భజ నిత్యమాదరాత్ ॥ 84

నీకు మోక్షకాంక్ష యున్నదా? అట్టులైన విషయములను విషమువలె పరిహరించివేయుము! తోడనే సంతోషము, దయ, క్షమ (సహనము) సరళస్వభావము, శమము, దమము మొదలైన శుభగుణములను అమృతమును వలె నిత్యము ఆదరముతోడ సేవించుచుండుము!

## దేహాసక్తినిందనము

**అనుక్షణం యత్పరిహృత్య కృత్య**
**మనాద్యవిద్యాకృతబంధమోక్షణమ్ ।**
**దేహః పరార్థోఽయమముష్యపోషణే**
**యస్సజ్జతే స స్వమనేన హంతి ॥ 85**

అనాదియైన అవిద్య చేత కల్పించబడిన బంధనమును వదలించుకొనుటయను పరమకర్తవ్యమును వీడి అనుక్షణమును పరార్థమైన (అన్యభోగ్యమైన) యీ శరీరమును పోషించుకొనుటయందే నిమగ్నుడై యుండువాడు (ఆ ప్రవృత్తి చేతనే) స్వయముగా తనను తాను హత్య చేసికొన్నవాడు అగుచున్నాడు.

**శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతి ।**
**గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం సఇచ్ఛతి ॥ 86**

శరీరపోషణమే ప్రధానలక్ష్యముగా పెట్టుకొని కాలము గడుపుకొనుచు ఆత్మతత్త్వమును పరిశీలింపగోరువాడు కొయ్యపలక యని భ్రమించి మొసలిని పట్టుకొని నదిని తరింపగోరుచున్నవాడు అగుచున్నాడు.

**మోహ ఏవ మహామృత్యుర్ముముక్షోర్వపురాదిషు ।**
**మోహో వినిర్జితో యేన స ముక్తిపదమర్హతి ॥ 87**

శరీరాదులయందు మోహము కలిగియుండుటయే మోక్షాపేక్ష కలవాని పాలిటి పెనుమృత్యువు. ఆ మోహమును జయించినవాడు ఎవడో వాడే ముక్తిని పడయుటకు అర్హుడు.

మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు ।
యం జిత్వా మునయోయాంతి తద్విష్ణోః పరమంపదమ్ ॥ 88

(కావున) దేహమునందు, దారపుత్రాదులందును ఉన్నవ్యామోహము అను మహామృత్యువును వీడుము! దానిని జయించియే మునులు ఆ శ్రీమహావిష్ణువు యొక్క పరమపదమును పొందుచున్నారు.

## స్థూల శరీర విచారము

త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంకులమ్ ।
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్యమిదంవపుః ॥ 89

త్వక్కు, మాంసము, నెత్తురు, నాడులు, మేదస్సు, మజ్జ, ఎముకలు అను ధాతువుల సముదాయముతో నిండియుండి మలమూత్రభరితమై యున్న యీ శరీరము స్థూలశరీరము. ఇది నింద్యమైనది.

పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా ।
సముత్పన్నమిదం స్థూలం భోగాయతనమాత్మనః ।
అవస్థా జాగరస్తస్య స్థూలార్థానుభవో యతః ॥ 90

పంచీకృతములైన స్థూలభూతముల వలన ఉత్పన్నమైన యీ శరీరము ఆత్మకు స్థూలమైన భోగస్థానము. దీని దశ జాగ్రద్దశ. ఇందే స్థూల పదార్థానుభవము ప్రాప్తించును.

బాహ్యేంద్రియైః స్థూలపదార్థసేవాం
స్రక్చందనస్త్ర్యాదివిచిత్రరూపామ్ ।
కరోతి జీవః స్వయమేతదాత్మనా
తస్మాత్ప్రశస్తిర్వపుషోఽస్య జాగరే ॥ 91

ఈ స్థూల శరీరముతోడ తాదాత్మ్యమును పొంది (శరీరమే తాననుకొని) జీవుడు మాలలు, చందనము, స్త్రీ మొదలైన వివిధ పదార్థములను

బాహ్యేంద్రియముల ద్వారమున సేవించుచుండును. కాబట్టి జాగ్రదవస్థయందు ఈ (స్థూల) శరీరమునకు ప్రాధాన్యముండును.

**సర్వోఽపి బాహ్యసంసారః పురుషస్య యదాశ్రయః ।**
**విద్ధి దేహమిదం స్థూలం గృహద్గృహమేధినః ॥ 92**

గృహస్థునకు గృహము ఎట్టిదో జీవునకు స్థూలశరీరము అట్టిది. ఈ స్థూల శరీరమును ఆశ్రయించియున్న కారణముననే జీవునకు బాహ్యజగత్తు ప్రతీయమాన మగుచుండునని తెలియుము.

**స్థూలస్య సంభవజరామరణాని ధర్మాః**
**స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః ।**
**వర్ణాశ్రమాది నియమా బహుధా యమాః స్యుః**
**పూజాఽవమానబహుమానముఖా విశేషాః ॥ 93**

(ఈ) స్థూలదేహమునకు జననము, వార్ధక్యము, మరణము ధర్మములు, స్థూలత్వమును పొందుట మొదలుగా గల ధర్మములు, శైశవము ఆదిగా గల యవస్థలును కూడ ఈ దేహమునకే కలుగుచుండును. అంతియేకాదు. అనేక విధముల వర్ణాశ్రమాది నియమములు, యమములు, పూజ, మానము, అవమానము, బహుమానము ఆదిగా ఎన్నియో విశేషానుభవములు కూడ దానికే కలుగుచుండును.

## దశేంద్రియములు

**బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి**
**ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్ ।**
**వాక్పాణిపాదం గుదమప్యుపస్థః**
**కర్మేంద్రియాణి ప్రవణేన కర్మసు ॥ 94**

చెవి, త్వక్కు, కన్ను, ముక్కు, నాలుక - ఈ అయిదును విషయజ్ఞానము కలిగించునవి యగుటచే జ్ఞానేంద్రియములు అనబడినవి. అట్లే వాక్కు,

పాణి, పాదము, గుదము (మలద్వారము), ఉపస్థము (మూత్రద్వారము) - అను నీ అయిదు కర్మ చేయగలవియైన కారణమున కర్మేంద్రియములు అనబడినవి.

## అంతఃకరణ చతుష్టయము

నిగద్యతేఽంతఃకరణం మనోధీ
రహంకృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః ।
మనస్తు సంకల్పవికల్పనాదిభిః
బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః ॥ 95

అత్రాభిమానాదహమిత్యహంకృతిః
స్వార్థానుసంధానగుణేన చిత్తమ్ ॥ 96

తన వేరువేరు వృత్తుల కారణముగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అని నాలుగు విధములుగా అంతఃకరణము పిలువబడుచున్నది. సంకల్ప వికల్పాలతో స్థిరముగా ఉండకున్న దశలో అది మనస్సు అనబడును. పదార్థ నిశ్చయము చేయుదశయందు బుద్ధియనబడును. 'అహమ్ అహమ్' నేను నేను అని యహంకరించిన దశలో అహంకారము అనబడును. తన యిష్టవస్తువును చింతనము చేయుదశలో చిత్తము అనబడును.

## పంచ ప్రాణములు

ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః ।
స్వయమేవ వృత్తిభేదాద్వికృతిభేదాత్సువర్ణసలిలాదివత్ ॥ 97

తన వికారముల మూలమున బంగారము, నీరము మొదలయిన వానివలె స్వయముగా ప్రాణమే వృత్తిభేదము కారణముగా ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అని అయిదు విధములుగా పేర్కొనబడుచున్నది. ("హృది ప్రాణోగుదే-పానస్సమానో నాభిసంస్థితః

. ఉదానః కంఠదేశే తు వ్యానస్సర్వశరీరగః" - అనగా ప్రాణవాయువునకు హృదయము, అపానవాయువునకు గుదము, సమానవాయువునకు నాభియు, ఉదానవాయువునకు కంఠము, వ్యానవాయువునకు సమస్త శరీరమును స్థానములు).

## సూక్ష్మశరీరము

వాగాది పంచ శ్రవణాది పంచ
ప్రాణాది పంచాభ్రముఖాని పంచ ।
బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః ॥ 98

వాక్కు మొదలైన కర్మేంద్రియాల పంచకము, శ్రవణము మొదలగు జ్ఞానేంద్రియాల పంచకము, ప్రాణాపానాది వాయువుల పంచకము, ఆకాశము మొదలయిన భూతముల పంచకము, బుద్ధి ఆదిగా గల అంతఃకరణ చతుష్టయము, అవిద్య, కామము, కర్మ - ఈ యెనిమిదింటిని పుర్యష్టకమందురు. ఈ పుర్యష్టకమే సూక్ష్మ శరీరమనబడును.

ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం
లింగం త్వపంచీకృతభూతసంభవమ్ ।
సవాసనం కర్మఫలానుభావకం
స్వాజ్ఞానతోఽనాదిరూపాధిరాత్మనః ॥ 99

ఇది సూక్ష్మశరీరము. దీనిని లింగశరీరమని కూడ అందురు. (స్థూలశరీరము పంచీకృతములైన భూతముల చేత నేర్పడినది కాగా) ఇది పంచీకృతములు కాని భూతముల చేత ఏర్పడినట్టిది. ఇది వాసనలతో కూడియుండి కర్మఫలమును అనుభవింపజేయును. స్వస్వరూప పరిజ్ఞానము లేని కారణముగా ఇది యాత్మకు అనాదియైన ఉపాధియైనది.

స్వప్నో భవత్యత్ర విభక్త్యవస్థా
స్వమాత్రశేషేణ విభాతి యత్ర ।
స్వప్నే తు బుద్ధిః స్వయమేవ జాగ్రత్
కాలీననానావిధవాసనాభిః ।
కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే
యత్ర స్వయంజ్యోతిరయం పరాత్మా ॥ 100

స్వప్నము దీనికి అభివ్యక్తి దశ. ఆ దశలో ఈ సూక్ష్మశరీరమే మిగిలి భాసించుచుండును. స్వయంప్రకాశము, పరాత్మయునగు శుద్ధచైతన్యమే (వేరు వేరు పదార్థాల రూపమున భాసించుచుండగా) బుద్ధి మాత్రము జాగ్రదవస్థలోని వివిధవాసనలతో కూడి కర్తృభావము మొదలగు భావములను పొంది భాసించుచుండును.

ధీమాత్రకోపాధిరశేష సాక్షీ
న లిప్యతే తత్కృతకర్మలేశైః ।
యస్మాదసంగస్తత ఏవ కర్మభిః
న లిప్యతే కించిదుపాధినా కృతైః ॥ 101

బుద్ధిమాత్రమే ఉపాధిగా గలిగిన ఆ సర్వసాక్షి, ఆ బుద్ధిచేత చేయబడిన కర్మలేశములను కూడ తాను అంటదు. కారణము ఏమనగా అది యసంగమైనది. (సంపర్కము లేనిది.) కావున ఉపాధికృతములైన కర్మలు ఈషణ్మాత్రమును దానిని అంటవు.

సర్వవ్యాపృతికరణం లింగమిదం స్యాచ్చిదాత్మనః పుంసః ।
వాస్యాదికమివ తక్ష్ణస్తేనైవాత్మా భవత్యసంగోఽయమ్ ॥ 102

ఈ లింగశరీరము చిదాత్మ రూపుడైన పురుషునకు సర్వవ్యాపారములను సాధించుటకు కరణము అగునట్టిది (సాధనము అన్నమాట) వడ్రంగికి బాడిస సాధనము అయిన విధముగా అన్నమాట. ఆ కారణముననే ఈ యాత్మ సంగరహితమైనది.

అంధత్వమందత్వపటుత్వధర్మాః
సౌగుణ్యవైగుణ్యవశాద్ధి చక్షుషః ।
బాధిర్యమూకత్వముఖాస్తథైవ
శ్రోత్రాదిధర్మా న తు వేత్తురాత్మనః ॥ 103

కన్నులు దోషయుక్తములై యున్న దశలో గ్రుడ్డితనమో, అస్పష్టముగా కానవచ్చుటయో సంభవించుటయు, నిర్దుష్టములైయున్న దశలో స్పష్టముగా చూడగలుగుటయు అనునది నేత్రములకే సంబంధించిన ధర్మములు. అట్లే చెవిటి తనము, మూగతనము మొదలైనవి శ్రోత్రాదులకే సంబంధించిన ధర్మములు. కాని వానితో సర్వసాక్షియైన ఆత్మకు సంబంధము లేదు.

## ప్రాణ ధర్మములు

ఉచ్ఛ్వాసనిశ్వాసవిజృంభణక్షుత్
ప్రస్పందనాద్యుత్క్రమణాదికాః క్రియాః ।
ప్రాణాదికర్మాణి వదంతి తజ్ఞాః
ప్రాణస్య ధర్మావశనాపిపాసే ॥ 104

ఉచ్ఛ్వాస నిశ్వాసములు, ఆవులింత, తుమ్ము, అదరుట, ఉత్క్రమించుట మొదలైనవి ప్రాణాదుల ధర్మములని తత్త్వవేత్తలు చెప్పుదురు. అట్లే క్షుత్పిపాసలు కూడ ప్రాణ ధర్మములే యగును.

## అహంకారము

అంతఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి ।
అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాసతేజసా ॥ 105

శరీరములో నేత్రాదులైన యింద్రియాదులందు అంతఃకరణము చిదాభాస తేజస్సుతో పరివ్యాప్తమై 'నేను నేను' అహంకారమును ప్రకటించుచు నెలకొనియుండును.

అహంకారస్స విజ్ఞేయః కర్తాభోక్తాఽభిమాన్యయమ్ ।
సత్త్వాదిగుణయోగేన చావస్థాత్రయమశ్నుతే ॥ 106

'కర్తను, భోక్తను, నేను-నేను' అను అభిమానమును ప్రకటించు వృత్తి యేదో అదియే అహంకారమనబడును. ఈ యహంకారమే సత్త్వాది గుణముల సంపర్కము వలన మూడు అవస్థలను పొందుచుండును (1. సాత్త్వికాహంకారము 2. రాజసాహంకారము, 3. తామసాహంకారము)

విషయాణామానుకూల్యే సుఖీ దుఃఖీ విపర్యయే ।
సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానందస్య నాత్మనః ॥ 107

ఈ యహంవృత్తి విషయములు అనుకూలించినప్పుడు సుఖమును, ప్రతికూలించినప్పుడు దుఃఖమును పొందుచుండును. సుఖదుఃఖాలు ఈ యహంకారమునకు సంబంధించిన ధర్మములే కాని నిత్యానంద స్వరూపమైన యాత్మకు సంబంధించినవి కావు.

## ఆత్మార్థమే ప్రేమ

ఆత్మార్థత్వేన హిప్రేయాన్ విషయో న స్వతఃప్రియః।
స్వత ఏవ హి సర్వేషామాత్మా ప్రియతమోయతః ॥ 108

విషయములు ఆత్మార్థములైనవి. అనగా ఆత్మ కొరకు ఉద్దిష్టములైనవి. కావుననే అవి ప్రియము అయినవి అగుచున్నవి. కాని సహజముగా వానికి ప్రియత్వము లేదు. కారణము ఏమనగా ఆత్మయే సహజముగా ఎల్లరకును ప్రియమైనది.

తత ఆత్మా సదానందో నాస్య దుఃఖం కదాచన ।
యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందోఽనుభూయతే ।
శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి ॥ 109

కాబట్టి ఆత్మ సదా ఆనందరూపమైనది. దానికి దుఃఖానుభవము ఎన్నడును లేదు. కావుననే సుషుప్తియందు విషయముల తోడ సంబంధము

లేకపోయినను ఆత్మానందము అనుభూతమగుచుండును. ఈ విషయమున శ్రుతిప్రమాణము, ప్రత్యక్షప్రమాణము, ఐతిహ్య (ఇతిహాస) ప్రమాణము, అనుమాన ప్రమాణమును ఉండనే యున్నవికదా!

## మాయా నిరూపణము

అవ్యక్తనామ్నీ పరమేశశక్తి
రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా ।
కార్యానుమేయా సుధియైవ మాయా
యయా జగత్సర్వమిదం ప్రసూయతే ॥ 110

అవ్యక్తము అనే పేరుతో వ్యవహరింపబడుచు, త్రిగుణాత్మికయై అనాది అవిద్యగా పరమేశ్వరుని పరాశక్తి యేది కలదో అదియే మాయ. దాని వలననే యీ జగత్తు అంతయు ఆవిర్భవించినది. బుద్ధిమంతులైనవారు దీని కార్యమును బట్టి దీనిని అనుమానించి గుర్తింపగలరు.

సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో ।
సాంగాప్యనంగాప్యుభయాత్మికా నో
మహాద్భుతానిర్వచనీయ రూపా ॥ 111

అది సత్తును కాదు. అసత్తును కాదు. సత్తు అసత్తులు రెండును కాదు. భిన్నమైనదియును గాదు. అభిన్నమైనదియును గాదు.భిన్నము అభిన్నము రెండును అయినదియును గాదు. అది అంగసహితమైనదియును గాదు. అంగరహితమైనదియును గాదు. అదియు, ఇదియు రెండును అయినదియును గాదు, అది పరమాద్భుతమైనది. అనిర్వచనీయమైనది. (ఇట్టిదియని చెప్పనలవికానిది)

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా
సర్పభ్రమో రజ్జువివేకతో యథా ।

రజస్తమస్సత్త్వమితి ప్రసిద్ధా
గుణాస్తదీయాః ప్రథితైస్స్వకార్యైః ॥ 112

త్రాటిని జూచి సర్పము అని భ్రమించిన సందర్భమందు అది సర్పము కాదు. త్రాడు అన్న పరిజ్ఞానము కలుగుటతోడనే ముందు కలిగిన సర్పభ్రాంతి నివృత్తమై పోవును. అట్లే అద్వయము, విశుద్ధమును అయిన బ్రహ్మ పదార్థము యొక్క పరిజ్ఞానము కలుగుటతోడనే ఆ మహామాయ తొలగిపోవును. దానికి తమతమ కార్యముల మూలమున ప్రసిద్ధిగన్న మూడు గుణములు ఉన్నవి. అవి 1.సత్త్వగుణము, 2. రజోగుణము, 3.తమోగుణము.

## రజోగుణము

విక్షేపశక్తి రజసః క్రియాత్మికా
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ।
రాగాదయోఽస్యాః ప్రభవంతి నిత్యం
దుఃఖాదయో యే మనసో వికారాః ॥ 113

క్రియారూపమైన విక్షేపశక్తి రజోగుణమునకు సంబంధించినది. దాని వలననే సనాతన కాలమునుండియు సమస్త క్రియలును సాగుచు వచ్చుచున్నవి. దానివలననే రాగాదులు, దుఃఖాదులును అగు మనోవికారములు ఉత్పన్నము లగుచుండును.

కామః క్రోధో లోభదంభాద్యసూయా
ఽహంకారేర్ష్యామత్సరాద్యాస్తు ఘోరాః ।
ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తిః
యస్మాదేషా తద్రజో బంధహేతుః ॥ 114

కామము, క్రోధము, లోభము, దంభము, అసూయ, అహంకారము, ఈర్ష్య, మత్సరము మొదలైన ఘోరలక్షణములు అన్నియు రజోగుణము యొక్క ధర్మములు. ఈ రజోగుణములు మూలముననే జీవుడు కర్మలలో

ప్రవృత్తుడు అగుచుండును. జీవునకు ఈ రజోగుణమే బంధనహేతువు అగును.

## తమోగుణము

ఏషావృతిర్నామ తమోగుణస్య
శక్తిర్యయా వస్త్వవభాసతేఽన్యథా ।
సైషా నిదానం పురుషస్య సంసృతేః
విక్షేపశక్తేః ప్రసరస్య హేతుః ॥ 115

ఒక వస్తువును మఱియొక వస్తువుగా ప్రతీతమగునట్లు చేయుశక్తి తమోగుణము యొక్క ఆవరణశక్తి. ఇదియే పురుషుని (జనన మరణ రూపమైన) సంసారమునకు ఆదికారణము. విక్షేపశక్తి యొక్క ప్రసారమునకు కారణమగునది కూడ ఇదియే.

ప్రజ్ఞావానపి పండితోఽపి చతురోఽప్యత్యంత సూక్ష్మార్థదృక్
వ్యాలీఢస్తమసా న వేత్తి బహుధా సంబోధితోఽపి స్ఫుటమ్ ।
భ్రాంత్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్
హంతాసౌ ప్రబలా దురంతతమసః శక్తిర్మహత్యావృతిః ॥ 116

ఎంతటి బుద్ధిమంతుడైనను, ఎంతటి పండితుడైనను, ఎంతటి చతురుడైనను, ఎంతటి సూక్ష్మార్థగ్రహణ సామర్థ్యము కలవాడైనను తమోగుణగ్రస్తుడైన పురుషుడు ఒక వస్తువును చూచి దానియందు తాను భ్రాంతిచేత కల్పించుకొన్న వస్తువునే సత్యమని తలచును. దాని గుణములనే ఆశ్రయించును. కాని 'నాయనా! అది కాదు సత్యము, ఇది' యని ఎన్ని విధముల బోధించినను అతడు చెవిని బెట్టడు. ఔరా! దురంతమైన తమోగుణమునకు సంబంధించిన యీ మహత్తరమైన ఆవరణశక్తి ఎంత ప్రబలమైనది!

అభావనా వా విపరీతభావనా
ఉసంభావనా విప్రతిపత్తిరస్యాః ।
సంసర్గయుక్తం న విముంచతిధ్రువం
విక్షేపశక్తిః క్షపయత్యజస్రమ్ ॥ 117

అభావన, విపరీతభావన, అసంభావన, దాని విప్రతిపత్తి - అనునవి యీ తమోగుణము యొక్క శక్తులు. ఇవి యీ గుణము యొక్క ఆవరణశక్తితో సంబంధము గల పురుషుని విడిచిపెట్టగలవు. విక్షేపశక్తి కూడ అతనిని నిరంతరము ఒకింత కూడ నిలుకడ కలుగనీయక విచలితుని జేసివేయుచునే యుండును.

(బ్రహ్మము లేదు అనుభావమును గలిగించునది అభావన. 'నేనే శరీరమును' అను భావన విపరీతభావన. ఏదైన ఉన్నది అనుటలో కలుగు సందేహవృత్తియే అసంభావన. ఉన్నదా? లేదా? అనునట్టి సంశయవృత్తియే విప్రతిపత్తి. ప్రపంచ వ్యవహారమే మాయయొక్క విక్షేపశక్తి.)

అజ్ఞానమాలస్యజడత్వనిద్రా
ప్రమాదమూఢత్వముఖాస్తమోగుణాః ।
ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించిత్
నిద్రాలువత్స్తంభవదేవ తిష్ఠతి ॥ 118

అజ్ఞానము, అలసత్వము, జడత్వము, నిద్ర, ప్రమత్తత, మూఢత్వము మొదలైనవి తమోగుణలక్షణములు. ఈ లక్షణములు గల పురుషుడు ఏమియు తెలిసికొనజాలడు. అతడు నిద్రామత్తుని వలెను, ఒక స్తంభము వలెను జడత్వము వహించివాడైయుండును.

## సత్త్వగుణము

సత్త్వం విశుద్ధం జలవత్తథాపి
తాభ్యాం మిళిత్వా సరణాయ కల్పతే ।

యత్రాత్మబింబః ప్రతిబింబితస్సన్
ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడమ్ ॥ 119

సత్త్వగుణము నీటివలె విశుద్ధమైనది. అయినను అది రజోగుణముతోను, తమోగుణముతోను గూడి పురుషుని సంసార బంధమునకు కారణము అగుచుండును. ఇందు ప్రతిబింబితమై ఆత్మబింబము సూర్యునివలె సమస్తజడ పదార్థములను ప్రకాశింపజేయు చుండును.

మిశ్రస్య సత్త్వస్య భవంతి ధర్మా-
స్త్వమానితాద్యా నియమా యమాద్యాః ।
శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ
దైవీ చ సంపత్తిరసన్నివృత్తిః ॥ 120

అమానిత్వాదులు, యమనియమాదులు, శ్రద్ధ, భక్తి మోక్షాపేక్ష, దైవీసంపద అసత్తు అయిన దానిని విడనాడుట 1 ఇవి మిశ్రమమైన సత్త్వగుణమునకు సంబంధించిన లక్షణములు (ధర్మాలు).

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః ।
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానందరసం సమృచ్ఛతి ॥ 121

ప్రసన్నత, ఆత్మానుభవము, పరమశాంతి, తృప్తి, ప్రహర్షము, పరమాత్మయందు నిష్ఠ - ఇవి విశుద్ధసత్త్వగుణము యొక్క లక్షణములు. ఈ గుణము వలన ముముక్షువు నిత్యానందరసమును పొందగలుగును.

## కారణ శరీరము

అవ్యక్తమేతత్ త్రిగుణైర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః ।

సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా
ప్రలీన సర్వేంద్రియ బుద్ధి వృత్తిః ॥ 122

ఈ విధముగా త్రిగుణాల నిరూపణము తోడ అవ్యక్తము వర్ణింపబడినది. ఇదియే ఆత్మయొక్క కారణ శరీరము. దీని అభివ్యక్తి దశ సుషుప్తి. అందు బుద్ధియొక్కయు, ఇంద్రియములు యొక్కయు వృత్తులు అన్నియు విలీనములై పోవును.

సర్వప్రకారప్రమితిప్రశాంతిః
బీజాత్మనావస్థితిరేవ బుద్ధేః ।
సుషుప్తిరేతస్య కిల ప్రతీతిః
కించిన్న వేద్మీతి జగత్ప్రసిద్ధేః ॥ 123

ఎందు సర్వవిధముల ప్రమ (జ్ఞానము) శాంతించిపోవునో, బీజరూపముగా బుద్ధి నిలిచిపోవునో అది సుషుప్త్యవస్థ. 'నాకు ఏమియు తెలియదు' అను ఉక్తి వలననే అది ప్రతీతమగును.

## అనాత్మనిరూపణము

దేహేంద్రియ ప్రాణమనోఽహమాదయః
సర్వే వికారా విషయాస్సుఖాదయః ।
వ్యోమాదిభూతాన్యఖిలం చ విశ్వం
అవ్యక్తపర్యంతమిదం హ్యనాత్మా ॥ 124

దేహము, ఇంద్రియాలు, ప్రాణములు, మనస్సు, అహంకారము మొదలైన వికారాలు అన్నియు, సుఖాదులైన సమస్త విషయములు, అకాశాదులైన సర్వభూతములు, అవ్యక్తపర్యంతముగా గల విశ్వమంతయు - ఇవి యన్నియు అనాత్మరూపములు.

మాయా మాయాకార్యం సర్వం మహదాదిదేహపర్యంతమ్ ।
అసదిదమనాత్మకం త్వం విద్ధిమరుమరీచికాకల్పమ్ ॥ 125

మాయయు, మహత్తత్త్వము మొదలు దేహము పర్యంతముగా నున్న మాయ యొక్క సమస్త కార్యములును మరుభూమిలోని యెండమావివలె అసత్తు, అనాత్మకమును అయినవి యనుటను మరువవలదు.

## ఆత్మ నిరూపణము

అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః ।
యద్విజ్ఞాయ నరో బంధాన్ముక్తః కైవల్య మశ్నుతే ॥ 126

ఇప్పుడు నీకు పరమాత్మ స్వరూపమును వివరించుచున్నాను. అది విన్న మనుజుడు బంధవిముక్తుడై కైవల్యపదమును పొందును.

అస్తి కశ్చిత్స్వయం నిత్యమహం ప్రత్యయలంబనః ।
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః ॥ 127

అహం ప్రత్యయానికి ఆలంబనముగా ఏదియో ఒక నిత్యపదార్థము ఉన్నది. అది యవస్థలు మూడింటికిని సాక్షియై యుండుచు పంచకోశములకు అతీతముగా నుండును.

యో విజానాతి సకలం జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।
బుద్ధితద్వృత్తి సద్భావ మభావమహమిత్యయమ్ ॥ 128

జాగ్రద్దశ, స్వప్నదశ, సుషుప్తిదశ - అను ఈ మూడు దశలయందును అహంభావముతో స్థితుడై బుద్ధియొక్కయు, దాని వృత్తులయొక్కయు భావమును, అభావమును (ఉండుటను, లేకపోవుటను) ఎవడు తెలిసికొనుచుండునో-

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతికశ్చన ।
యశ్చేతయతి బుద్ధ్యాదిం న తు యం చేతయత్యయమ్ ॥ 129

ఎవడు తాను స్వయముగా సర్వమును చూచుచుండునో, ఎవనిని ఎవ్వడును చూడజాలడో, ఎవడు బుద్ధ్యాదులను చైతన్యవంతములను జేయుచుండునో, ఆ బుద్ధ్యాదులు ఎవనికి చేతనను గలిగింపజాలవో -

యేన విశ్వమిదం వ్యాప్తం యన్న వ్యాప్నోతి కించన ।
అభారూపమిదం సర్వం యంభాంతమనుభాత్యయమ్ ॥ 130

ఎవని చేత ఈ సమస్తవిశ్వమును పరివ్యాప్తమయి యున్నదో, ఎవనిని ఏదియు పరివ్యాప్తము చేయజాలదో, ఎవడు భాసించిన మీదట ఆభాసరూపముగా సమస్తజగత్తును భాసించుచుండునో-

యస్య సన్నిధిమాత్రేణ దేహేంద్రియమనోధియః ।
విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ ॥ 131

ఎవని సన్నిధి మాత్రమున దేహము, ఇంద్రియములు మనస్సు, బుద్ధి, ప్రేరితములైనవానివలె తమ తమ విషయములందు ప్రవర్తిల్లుచుండునో-

అహంకారాది దేహాంతా విషయాశ్చ సుఖాదయః ।
వేద్యంతే ఘటవద్యేన నిత్యబోధస్వరూపిణా ॥ 132

అహంకారము మొదలు దేహము వరకును ఉన్న సమస్త సుఖాది విషయములను ఏ జ్ఞానస్వరూపముద్వారా ఘటతుల్యముగా తెలియవచ్చుచుండునో -

ఏషో-ంతరాత్మా పురుషః పురాణో
నిరంతరాఖండ సుఖానుభూతిః ।
సదైకరూపః ప్రతిబోధమాత్రో
యేనేషితా వాగసవశ్చరంతి ॥ 133

ఆ యీ ఆఖండానంద స్వరూపుడైన అంతరాత్మయే పురాణ పురుషుడు. అతడు సర్వదా యేకరూపుడు, బోధమాత్రుడు నగువాడు అతని ప్రేరణ చేతనే వాగాదులైన యింద్రియములు, ప్రాణములు, క్రియయులై చరించుచుండను.

అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయా
మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః ।
ఆకాశ ఉచ్చై రవివత్ప్రకాశతే
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్ ॥ 134

ఈ సత్త్వాత్మయందు అనగా బుద్ధిరూపమైన గుహయందు ఉన్న అవ్యక్తాకాశమందు ఒక పరమప్రకాశమయమైన యాకాశము సూర్యునివలె తన తేజస్సు చేత సమస్త జగత్తును ప్రకాశింపజేయుచు దేదీప్యమానముగా ప్రకాశించుచున్నది.

జ్ఞాతా మనోఽహంకృతివిక్రియాణాం
దేహేంద్రియప్రాణకృతక్రియాణామ్ ।
అయో-గ్నివత్తాననువర్తమానో
న చేష్టతే నో వికరోతి కించన ॥ 135

అది మనస్సంబంధమైన, అహంకారగతములైన వికారములను, శరీరము, ఇంద్రియ, ప్రాణముల క్రియలను ఎరుగగలదు. కాల్చబడిన యినుమును అనుసరించియుండు నగ్నివలె అది దానిని అనువర్తించు చుండియును కూడ ఇంచుకంతయు కర్మను చేయదు. ఎట్టి వికారమును పొందదు.

న జాయతే నో మ్రియతే న వర్ధతే
న క్షీయతే నో వికరోతి నిత్యః ।
విలీయమానేఽపి వపుష్యముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్ ॥ 136

అది పుట్టదు, గిట్టదు, పెరుగదు, తరుగదు, ఎట్టి వికారమును పొందదు. అది నిత్యమైనది. శరీరము లయమును పొందినను కడవ పగిలిన పిమ్మట తద్గతమైన యాకాశమువలె లయమును పొందకుండును.

ప్రకృతి వికృతి భిన్న శ్శుద్ధబోధస్వరూపః
సదసదిదమశేషం భాసయన్నిర్విశేషః ।
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్ సాక్షిరూపేణ బుద్ధేః ॥ 137

ప్రకృతి కంటెను, దాని వికారముల కంటెను భిన్నుడై, శుద్ధజ్ఞాన స్వరూపుడైయుండు ఆ నిర్విశేష పరమాత్మ సత్తును, అసత్తును సర్వమును ప్రకాశింపజేయుచు జాగ్రదాద్యవస్థలయందు 'నేను నేను' అను అహంభావముచేత సాక్షాత్తు బుద్ధికి సాక్షిగా విరాజిల్లు చుండును.

నియమితమనసా త్వం స్వమాత్మానమాత్మ
న్యహమహమితి సాక్షాద్విద్ధి బుద్ధిప్రసాదాత్ ।
జనిమరణతరంగాపారసంసారసింధుం
ప్రతర భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః ॥ 138

సంయతచిత్తుడవై నీవు ఈ యాత్మను బుద్ధి ప్రసన్నముగా నున్నవేళ 'ఇది నేను' అని నీ యంతఃకరణమునందు ప్రత్యక్షముగా అనుభవమునకు దెచ్చికొనుము. ఈవిధముగా జనన మరణరూపతరంగ సంకులమైన యీ యపార సంసారసముద్రమును తరించిపొమ్ము! బ్రహ్మ రూపమందు నెలకొనియుండి కృతార్థుడవు కమ్ము.

## అధ్యాసము

అత్రానాత్మన్యహమితి మతిర్బంధ ఏషో-స్య పుంసః
ప్రాప్తోఽజ్ఞానాజ్జననమరణ క్లేశసంపాతహేతుః ।
యేనైవాయం వపురిదమసత్సత్యమిత్యాత్మబుద్ధ్యా
పుష్యత్యుక్షత్యవతి విషయైస్తంతుభిః కోశకృద్వత్ ॥ 139

పురుషునకు ఆత్మ కాని వస్తువులయందు 'అహం= నేను' అను ఆత్మబుద్ధి కలుగుటయే జననమరణ రూపములగు క్లేశములను

గలిగించునదియు, అజ్ఞానము వలన ప్రాప్తమగునట్టిదియు నగు బంధనము. దీని మూలముగానే జీవుడు అసత్తగు ఈ శరీరమును సత్యమని యెంచి యిందు ఆత్మబుద్ధి కలుగగా తంతువులతోడి (దారాలు) పట్టుపురుగువలె దీనిని పోషించుటకు, మార్జనము చేయుటకు, రక్షించుటకును ఇచ్ఛగించుచున్నాడు.

ఆత్మస్మింస్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
 వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా ।
తతోఽనర్థవ్రాతో నిపతతి సమాదాతురధిక
 స్తతోయోఽసద్గ్రాహః స హి భవతి బంధః శృణు సఖే ॥ 140

విశేష మూఢత్వము గలవానికి తమోగుణము కారణముగానే, అది కాని దానియందు అది యను బుద్ధి కలుగును. వివేకము లేకపోవుటచేతనే రజ్జువునందు సర్పబుద్ధి కలుగుచున్నది. ఇట్టి బుద్ధి గలవానిని అనేక విధముల అనర్థములు చుట్టుముట్టును. కాబట్టి ఓమిత్రమా! ఈ అసద్గ్రాహమే (అసత్తును సత్యముగా భావించుటయే) బంధనము.

అఖండనిత్యాద్వయబోధశక్త్యా
 స్ఫురంతమాత్మానమనంతవైభవమ్ ।
సమావృణోత్యావృతిశక్తి రేషా
 తమోమయీ రాహురివార్కబింబమ్ ॥ 141

అఖండము, నిత్యము, అద్వయము నగు బోధశక్తివలన స్ఫురించునట్టి అఖండైశ్వర్య సంపన్నమైన యాత్మతత్త్వమును తమోమయమగు ఆవరణశక్తి సూర్యమండలమును రాహువు క్రమ్మివేయు విధముగా క్రమ్మివేయును.

తిరోభూతే స్వాత్మన్యమలతరతేజోవతి పుమా
 ననాత్మానం మోహాదహమితి శరీరం కలయతి ।
తతః కామక్రోధప్రభృతిభిరముం బంధనగుణైః
 పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తిర్వ్యథయతి ॥ 142

అత్యంత నిర్మలము, తేజోమయము నగు ఆత్మతత్త్వమును తిరోహితము (అదృశ్యము) కాగా పురుషుడు ఆత్మకంటె భిన్నమైన శరీరమును మోహవశమున 'నేను నేను' అని భావింప నారంభించును. అప్పుడు రజోగుణసంబంధమైన విక్షేపనామకమగు శక్తి కామక్రోధాదులను బంధహేతువులగు గుణములచేత దానిని వ్యథితుని జేయనారంభించును.

మహామోహగ్రాహ గ్రసన గలితాత్మావగమనో
ధియో నానావస్థాః స్వయమభినయంస్తద్గుణతయా ।
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మజ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః ॥ **143**

అప్పుడు ఈ జీవుడు కుమతియై, కుత్సితములైన గతులు కలవాడై విషయములను విషముతో నిండియున్న యీ మహాసంసార సముద్రమునందు మునుగుచు, తేలుచు మహామోహ మనెడు మొసలి బారికి జిక్కి ఆత్మజ్ఞానమంతరించిపోవగా బుద్ధి, గుణములను అభిమానించువాడై తదీయములైన వివిధావస్థలను అభినయించుచు పరిభ్రమించుచుండును.

భానుప్రభాసాజ్జనితాభ్రపంక్తిః
భానుం తిరోధాయ విజృంభతే యథా ।
ఆత్మోదితాహంకృతిరాత్మతత్త్వం
తథా తిరోధాయ విజృంభతే స్వయమ్ ॥ **144**

సూర్యుని తేజస్సువలన ఆవిర్భవించిన మేఘపంక్తి యా సూర్యుని క్రమ్మివేయును. అట్లే ఆత్మనుండి యావిర్భూతమైన యహంకారము ఆ యాత్మనే యాచ్ఛాదించుచుండును.

## ఆవరణశక్తి - విక్షేపశక్తి

కబళితదిననాథే దుర్దినే సాంద్రమేఘైః
వ్యథయతి హిమఝంఝూవాయురుగ్రో యథైతాన్ ।
అవిరతతమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతి బహుదుఃఖైస్తీవ్రవిక్షేపశక్తిః ॥ 145

దినమంతయు ఆకాశము మేఘావృతమై యున్నచో ఆ దినము దుర్దినమనబడును. అట్టి దుర్దినమందు దట్టమైన మేఘములచేత సూర్యుడు ఆచ్ఛాదితుడైపోయిన వేళ దుస్సహమైన చలితో కూడిన తుఫాను గాలి యెల్లరను పీడించును. అట్లే నిరంతరము బుద్ధి తమోగుణాచ్ఛన్నమైపోయిన వేళ మూఢ పురుషుని విక్షేపశక్తి వివిధములైన వ్యథలను గలిగించి పీడించును.

ఏతాభ్యామేవ శక్తిభ్యాం బంధః పుంసస్సమాగతః ।
యాభ్యాం విమోహితో దేహం మత్వాత్మానంభ్రమత్యయమ్ ॥ 146

ఆవరణశక్తి, విక్షేపశక్తి యనబడు ఈ రెండు శక్తుల వలననే మానవునకు బంధనము ప్రాప్తించుచుండును. వీనివలననే మోహితుడై యతడు ఈ శరీరమునే ఆత్మగా భావించుకొని సంసారచక్రమందు చిక్కుకొని పరిభ్రమించుచుండును.

## బంధ నిరూపణము

బీజం సంసృతిభూమిజస్య తు తమో దేహాత్మధీరంకురో
రాగః పల్లవమంబు కర్మ తు వపుః స్కంధోఽసవః శాఖికాః ।
అగ్రాణీంద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాఽత్ర జీవః ఖగః ॥ 147

ఈ సంసారమును ఒక మహావృక్షము అని భావించుకొన్నచో దానికి విత్తనము అజ్ఞానము. దేహమునే ఆత్మగా భావించుట అంకురము. అనగా మొలక. రాగము అనగా అనురక్తి ఆకులు. కర్మ నీరము.

శరీరము (మాను. (ప్రాణములు శాఖలు, ఇం(ద్రియములు అ(గభాగములు అనగా చివుళ్ళు. విషయములు పుష్పములు. దుఃఖమే ఫలము. అదియు నానావిధకర్మల వలన ఆవిర్భవించినది. జీవుడే ఆ ఫలము నారగించుపక్షి. (సంసార వృక్షము అజ్ఞానుల విషయమై యిట్లు వర్ణింపడినది. ఈ శ్లోకమందు (ప్రయోగింపబడిన తు శబ్దము వలన తత్త్వవేత్తలకు నిదియే సత్ఫల వృక్షముగా (క్రింది శ్లోకము వలన (గహింపదగును.)

"ఆనందమూల గుణపల్లవ తత్త్వశాకా
వేదాంత పుష్పఫలమోక్ష రసాది పూర్ణమ్,
చేతో విహంగ హరితుంగ తరుం విహాయ
సంసారశుష్కవిటపేవద కిం రతోఽసి." ।

అజ్ఞానమూలోఽయమనాత్మబంధో
నైసర్గికోఽనాదిరనంత ఈరితః
జన్మాప్యయవ్యాధిజరాదిదుఃఖ
(ప్రవాహపాతం జనయత్యముష్య ॥ 148

అజ్ఞానజనితమైన యీ అనాత్మబంధనము స్వాభావికము, అనాది, అనంతమునైనదని చెప్పబడినది. ఇదియే జీవునకు జనన-మరణ-జరా-వ్యాధిరూపమగు దుఃఖముల (ప్రవాహమును సృష్టించుచుండును.

## ఆత్మానాత్మ వివేకము

నా(స్త్రైర్న శ(స్త్రైరనిలేన వహ్నినా
ఛేత్తుం న శక్యో న చ కర్మకోటిభిః ।
వివేకవిజ్ఞానమహాసినా వినా
ధాతుః (ప్రసాదేన సితేన మంజునా ॥ 149

ఈ బంధనము విధాత యొక్క విశుద్ధమైన కృప వలన (ప్రాప్తించిన వివేకము, విజ్ఞానము అనెడు స్వచ్ఛము, మంజులమునగు మహాఖడ్గములచేత

గాక మఱియే యితర శస్త్రాస్త్రములచేత గాని, వాయువు చేతను, వహ్నిచేతను గాని కోటానుకోట్ల కర్మకలాపముల చేత గాని ఖండించుటకు గాని నివర్తింపజేయుటకు గాని సాధ్యము కాదు.

శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మ
నిష్ఠా తయైవాత్మవిశుద్ధిరస్య ।
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం
తేనైవ సంసారసమూలనాశనమ్ ॥ 150

ఎవనికి శ్రుతి ప్రామాణ్యమందు దృఢమైన నిశ్చయబుద్ధి యుండునో వానికే ధర్మ నిష్ఠ కలుగును. దాని వలననే వానికి చిత్తశుద్ధి ప్రాప్తించును. చిత్తము శుద్ధమై యున్నవానికే పరమాత్మ జ్ఞానము కలుగును. ఆ జ్ఞానము వలననే సంసారమను వృక్షము సమూలముగా నశించును.

కోశైరన్నమయాద్యైః పంచభిరాత్మా న సంవృతోభాతి ।
నిజశక్తిసముత్పన్నైః శైవాలపటలైరివాంబుఉవాపీస్థమ్ ॥ 151

అన్నమయకోశము మున్నగు కోశముల చేత నావరింపబడి యుండి యాత్మ, స్వశక్తిచేతనే ఆవిర్భవించిన నాచు మున్నగువాని సమూహము చేత కప్పబడిన నీటివలె పైకి భాసించకుండును.

తచ్ఛైవాలాపనయే సమ్యక్ సలిలం ప్రతీయతే శుద్ధమ్ ।
తృష్ణాసంతాపహరం సద్యః సౌఖ్యప్రదం పరంపుంసః ॥ 152

పంచానామపి కోశానామపవాదే విభాత్యయం శుద్ధః ।
నిత్యానందైకరసః ప్రత్యగ్రూపః పరస్స్వయంజ్యోతిః ॥ 153

ఆ నాచు మున్నగువానిని పూర్తిగా తొలగించుటతోడనే మానవుల దప్పిక సంబంధమగు తాపమును హరించి తత్కాలమందే పరమ సుఖమును గలిగింపగల నీరము స్పష్టముగా గోచరింపసాగును. అట్లే అయిదు కోశములును తొలగించబడిన మీదట ఆ శుద్ధము, నిత్యానందైకరస స్వరూపము, అంతర్యామి స్వయంప్రకాశమునగు పరమాత్మ భాసించ నారంభించును.

ఆత్మానాత్మవివేకః కర్తవ్యో బంధముక్తయే విదుషా ।
తేనైవానందీ భవతి స్వం విజ్ఞాయసచ్చిదానందమ్ ॥ 154

బంధవిముక్తిని కోరి విద్వాంసుడైనవాడు ఏది ఆత్మ? ఏది యనాత్మ? అను వివేచనము చేయవలెను. ఆ వివేకము వలననే తనను సచ్చిదానంద రూపునిగా దెలిసికొని యతడు ఆనందమును పొందును.

ముంజాదిషీకామివ దృశ్యవర్గాత్
ప్రత్యంచమాత్మానమసంగమక్రియమ్ ।
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి యస్స ముక్తః ॥ 155

ముంజుగడ్డి నుండి యీనెను వేర్పరచు విధముగా అసంగము, అక్రియము నగు ఆత్మను (ప్రత్యగాత్మను) దృశ్యవర్గమునుండి వేరుచేసి సర్వమును అందు లయమొనర్చి యెవడు ఆత్మ భావమునందు నెలకొని యుండునో అతడే ముక్తుడు.

## అన్నమయ కోశము

దేహోఽయమన్నభవనోఽన్నమయస్తు కోశః
చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః ।
త్వక్ చర్మమాంసరుధిరాస్థిపురీషరాశి
ర్నాయం స్వయం భవితుమర్హతి నిత్యశుద్ధః ॥ 156

అన్నము వలన ఆవిర్భవించినదగు ఈ శరీరమే అన్నమయకోశము. ఇది అన్నము వలననే జీవించును. అది లేకున్న నశించును. త్వక్కు, చర్మము, మాంసము, రుధిరము, ఎముకలు, మలము మున్నగువాని సమూహమగు నిది నిత్యశుద్ధమగు ఆత్మ కాజాలదు.

పూర్వం జనేరపి మృతేరపి నాయమస్తి
జాతః క్షణం క్షణగుణోఽనియతస్వభావః ।

**నైకో జడశ్చ ఘటవత్ పరిదృశ్యమానః**
**స్వాత్మాకథం భవతి భావవికారవేత్తా ॥ 157**

ఇది జననమునకు ముందును లేదు. మృత్యువునకు పరమందును ఉండదు. ఇది క్షణములో పుట్టుకొని వచ్చునట్టిది. క్షణికమైన గుణము గలట్టిది. అస్థిరమైన స్వభావము కలది. అనేక తత్త్వముల సంఘాతమిది. ఇది జడమగునది. ఘటము (కడవ) వలె కానవచ్చునది. ఇది భావవికారములను ఎరుగగల మన యాత్మ ఎట్లు కాగలదు?

**పాణిపాదాదిమాన్ దేహో నాత్మ వ్యంగేఽపి జీవనాత్ ।**
**తత్తచ్ఛక్తేరనాశాచ్చ న నియమ్యో నియామకః ॥ 158**

కాలుసేతులు గల యీ శరీరము ఆత్మ కాజాలదు. ఏలయనగా అంగభంగమైనను తన శక్తి నశింపక పురుషుడు సజీవుడుగనే యుండుచున్నాడు. అంతియే కాదు. ఈ శరీరము నియమింపబడునది (శాసింపబడునది) ఏది శాసింపబడునో అది శాసించునట్టిదగు ఆత్మ యెట్లు కాగలదు?

**దేహతద్ధర్మ తత్కర్మతదవస్థాదిసాక్షిణః ।**
**స్వత ఏవ స్వతస్సిద్ధం తద్వైలక్షణ్యమాత్మనః ॥ 159**

దేహమునకు, దాని ధర్మమునకు, కర్మమునకు, దాని యవస్థలకును సాక్షియై యుండునది యగు ఆత్మ దానికంటె (ఆ దేహముకంటె) భిన్నమై వేరుగా ఉండునది యని స్వయముగనే తెల్లమగుచున్నది.

**శల్యరాశిర్మాంసలిప్తో మలపూర్ణోఽతికశ్మలః ।**
**కథం భవేదయం వేత్తా స్వయమేతద్విలక్షణః ॥ 160**

ఎముకల ప్రోవై, మాంసపరిప్లుతమై, మలపూరితమై, యత్యంత కుత్సితమై యుండునట్టి యీ దేహము తనకంటె భిన్నమై తనను తెలిసికొనగలుగునట్టిది యెట్లు కాగలదు?

త్వఙ్మాంస మేదోఽస్థిపురీషరాశా
వహంమతిం మూఢజనః కరోతి ।
విలక్షణం వేత్తి విచారశీలః
నిజస్వరూపం పరమార్థభూతమ్ ॥ 161

త్వక్కు, మాంసము, మేదస్సు (క్రొవ్వు), ఎముకలు, మలము అనువాని ప్రోవైన యీ శరీరమునందు మూఢజనులు మాత్రమే నేను అను బుద్ధిని కల్పించుకొందురు. విచారణశీలుడైన పురుషుడు తన పారమార్థిక స్వరూపమును దీనికంటె భిన్నమైనదనియే భావించును.

దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధి
ర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః ।
వివేకవిజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాత్మని ॥ 162

జడులైన పురుషులకు దేహమందు 'ఈదేహమును నేను' అను అహంబుద్ధి కలుగును. ఆ యహం బుద్ధి విద్యావంతునకు జీవుని యందుండును. వివేకము, విజ్ఞానము గల మహాత్మునకు సత్యమైన ఆత్మయందే "నేను బ్రహ్మమును" అను అహంబుద్ధి యుండును.

అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే
త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ ।
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాంతిం పరమాం భజస్వ ॥ 163

ఓరి మూఢుడా! ఈ త్వక్కు, మాంసము, మేదస్సు (క్రొవ్వు), ఎముకలు, మలము మున్నగువాని సమూహమందు ఆత్మబుద్ధిని వీడి సర్వాత్ముడైన నిర్వికల్పబ్రహ్మమునందు మాత్రమే ఆత్మబుద్ధిని కలిగియుండి పరమశాంతిని పొందుము!

దేహేంద్రియాదావసతి భ్రమోదితాం
విద్వానహంతాం న జహాతి యావత్ ।
తావన్న తస్యాస్తి విముక్తివార్తా
ప్యస్త్యేష వేదాంతనయాంతదర్శీ ॥ 164

విద్వాంసుడైన పురుషుడు అసత్తు అయిన దేహేంద్రియాదికమందు భ్రాంతిమూలకముగా గల్గిన అహంకార బుద్ధిని వీడనంతవరకు అతడు ఎంత వేదాంత సిద్ధాంతముల పారమును జూచినవాడైనను, వానికి మోక్షము కలుగునన్న మాటయే లేదు.

ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే
యత్స్వప్నదేహే హృది కల్పితాంగే ।
యథాత్మబుద్ధిస్తవ నాస్తి కాచిత్
జీవచ్ఛరీరే చ తథైవ మాఽస్తు ॥ 165

ఛాయా (నీడ రూపంలో ఉన్న) శరరీమందు, ప్రతిబింబరూప శరీరమునందు, మనస్సులో కల్పించుకొన్న శరీరమునందును నీకు ఆత్మబుద్ధి ఎట్లు లేదో అట్లే సజీవ శరీరమందు కూడ ఉండరాదు.

దేహాత్మధీరేవ నృణామసిద్ధ్యాం
జన్మాదిదుఃఖ ప్రభవస్య బీజమ్ ।
యతస్తతస్త్వం జహి తాం ప్రయత్నాత్
త్యక్తే తు చిత్తే న పునర్భవాశా ॥ 166

ఏల యనగా దేహాత్మ బుద్ధియే అసద్బుద్ధి. అదియే మానవులకు జన్మాది దుఃఖములు గలుగుటకు కారణమగునది. కావున దానిని ప్రయత్నపూర్వకముగా వదలివేయుము. ఆ బుద్ధి అవగతమైనప్పుడు ఇక పునర్జన్మ కలుగునన్న శంకకు తావుండదు.

## ప్రాణమయకోశము

కర్మేంద్రియైః పంచభిరంచితో-యం
ప్రాణో భవేత్ ప్రాణమయస్తు కోశః ।
యేనాత్మవానన్నమయోఽన్నపూర్ణః
ప్రవర్తతేఽసౌ సకలక్రియాసు ॥167

కర్మేంద్రియములు అయిదింటితోడను కూడిన యీ ప్రాణమే ప్రాణమయకోశ మనబడును. దానితో కూడిన యీ అన్నమయకోశము అన్నపూరితమై తృప్తిజెంది సమస్త కార్యములందును ప్రవర్తిల్లును.

నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో
గంతాగంతా వాయువదంతర్బహిరేషః ।
యస్మాత్కించిత్ క్వాపి న వేత్తీష్టమనిష్టం
స్వం వాఽన్యం వా కించన నిత్యంపరతంత్రః ॥ 168

ఈ ప్రాణమయకోశము కూడ ఆత్మకాదు. ఏలయనగా ఇది వాయువికారమైనది. వాయువువలెనే వెలికిపోవుచు, లోపలకు వచ్చుచునుండునది. మఱియు నిత్యము పరతంత్రతమైనది. ఇది తన యిష్టమును, అనిష్టమును ఎరుగదు. స్వకీయమును ఎరుగదు. పరకీయమును ఎరుగదు.

## మనోమయకోశము

జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయస్స్యాత్
కోశో మమాహమితి వికల్పహేతుః ।
సంజ్ఞాదిభేదకలనాకలితో బలీయాం
స్తత్పూర్వకోశమభిపూర్య విజృంభతే యః ॥ 169

జ్ఞానేంద్రియములు, మనస్సును కూడి మనోమయకోశము అగును.

ఇది నేను, నాది యనునట్టి వస్తువికల్పములకు హేతుభూతమైనది. నామాది భేదముల వలన తెలియవచ్చును. ఇది బహు బలీయమైనది. పూర్వకోశములందు పరివ్యాప్తమై యుండును.

పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా ।
జాజ్వల్యమానో బహువాసనేంధనైః
మనోమయాగ్నిర్దహతి ప్రపంచమ్ ॥ 170

పంచేంద్రియములు అను అయిదుగురు హోతలచే, (హోమము చేయువారు) విషయములనెడు నేతి యాహుతుల చేత పెచ్చురిల్లజేయబడి వివిధములగు వాసనలు అను కట్టెలచేత ప్రజ్వరిల్లజేయబడునట్టి యీ మనోమయాగ్ని సమస్త ప్రపంచమును దగ్ధము జేసివేయును. (అనగా ఇంద్రియములు వాసనారూపమగు ఇంధనమును వెలిగించి ప్రకటించిన మనోమయాగ్ని యందు విషయములను ఎప్పుడు హోమము చేయునో అప్పుడు ఈ ప్రపంచము అంతయు లయమైపోవును.)

న హ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనోహ్యవిద్యా భవబంధహేతుః ।
తస్మిన్ వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మిన్ సకలం విజృంభతే ॥ 171

మనస్సు కంటె భిన్నమైన అవిద్య యేదియును లేదు. మనస్సే భవబంధమునకు హేతుభూతమైన అవిద్య. అది నశించినచో సర్వము నశించి పోవును. అది విజృంభించినచో సర్వము ప్రతీయమానము కాసాగును.

స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాదివిశ్వం మన ఏవ సర్వమ్ ।
తథైవ జాగ్రత్యపి నో విశేష
స్తత్సర్వ మేతన్మనసో విజృంభణమ్ ॥ 172

ఏ పదార్థమును లేని స్వప్నమందు మనస్సే స్వశక్తి చేత భోక్తృభోగ్యాది సమస్త వస్తు ప్రపంచమును రచించును. అట్లే జాగ్రద్దశయందు కూడ విశేషము ఏదియు నుండదు. కావున ఈ సర్వమును మనస్సు యొక్క విజృంభణమే.

**సుషుప్తికాలే మనసి ప్రలీనే**
**నైవాస్తి కించిత్సకలప్రసిద్ధేః ।**
**అతో మనఃకల్పిత ఏవ పుంసః**
**సంసార ఏతస్య న వస్తుతోఽస్తి ॥ 173**

సుషుప్తికాలమందు మనస్సు లీనమైపోవును. ఆకారణమున ఆ సమయమున ఏ ప్రపంచమును ఉండదు అన్న విషయము ఎల్లరును ఎఱిగినదే. కావున జీవునకు ఈ సంసారము మనస్సు యొక్క కల్పనా స్వరూపమే యగును. కాని వస్తుతః అది యున్నది కాదు.

**వాయునా నీయతే మేఘః పునస్తేనైవ నీయతే ।**
**మనసా కల్ప్యతే బంధో మోక్షస్తేనైవ కల్ప్యతే ॥ 174**

మేఘము వాయువుచేత కావించబడును. మరల ఆ వాయువు చేతనే కొనిపోబడును. అట్లే మనస్సు బంధమును గల్పించును ఆ మనస్సే మోక్షమును కలుగజేయును.

**దేహాది సర్వవిషయే పరికల్ప్య రాగం**
**బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన ।**
**వైరస్యమత్ర విషవత్సు విధాయ పశ్చాత్**
**ఏనం విమోచయతి తన్మన ఏవ బంధాత్ ॥ 175**

ఈ మనస్సే దేహాదులగు ఎల్ల విషయములందును రాగమును గల్పించి వాని మూలమున త్రాటితో పశువును వలె పురుషుని బంధించివేయును. పిమ్మట విషతుల్యములగు ఆ విషయములందు విరసత్వమును గలిగించి వానిని బంధవిముక్తుని గావించును.

తస్మాన్మనః కారణమస్య జంతోః
బంధస్య మోక్షస్య చ వా విధానే ।
బంధస్య హేతుర్మలినం రజోగుణైః
మోక్షస్య శుద్ధం విరజస్తమస్కమ్ ॥ 176

కాబట్టి జీవునకు బంధమును గాని, మోక్షమును గాని కలిగించుటకు కారణభూతమైనది మనస్సే. రజోగుణము చేత మలినమై యున్న దశలో ఇది బంధనమునకు కారణమగును. రజోగుణ, తమోగుణ విరహితమై శుద్ధసత్త్వ గుణమయమైయున్న దశలో మోక్షము గలిగించుటకు కారణభూతమగును.

వివేకవైరాగ్యగుణాతిరేకాః
శుద్ధత్వమాసాద్య మనోవిముక్త్యై ।
భవత్యతో బుద్ధిమతో ముముక్షో
స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే ॥ 177

వివేకము, వైరాగ్యము తీవ్రతరములు కాగా శుద్ధత్వమును పొందిన మనస్సు ముక్తికి కారణమగును. కాబట్టి మోక్షాపేక్ష గల బుద్ధిమంతుడు తొలుత ఈ రెండింటిని (జ్ఞానవైరాగ్యములను) బలపరచుకొనవలెను.

మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।
చరత్యత్ర న గచ్ఛంతు సాధవో యే ముముక్షవః ॥ 178

మనస్సు అను భయంకరమైన పెద్దపులి విషయముల అరణ్యమునందు సంచారము చేయుచున్నది. మోక్షము నపేక్షించు సాధుజనులారా! ఆ యెడకు వెడలకుడు!

మనః ప్రసూతే విషయానశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః ।
శరీరవర్ణాశ్రమజాతిభేదాన్
గుణక్రియాహేతుఫలాని నిత్యమ్ ॥ 179

మనస్సే భోక్త కొరకు నిత్యము స్థూలములు, సూక్ష్మములు నగు విషయములను, శరీరము, వర్ణము, జాతి మున్నగు భేదములను, గుణము,క్రియ, హేతువు, ఫలము మున్నగువానిని పరికల్పన చేయుచుండును.

అసంగచిద్రూపమముం విమోహ్య
దేహేంద్రియప్రాణగుణైర్నిబధ్య ।
అహం మమేతి భ్రమయత్యజస్రం
మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు ॥ 180

అసంగము, చిద్రూపమునగు ఆత్మను మోహింపజేసి, దీనిని దేహము, ఇంద్రియములు, ప్రాణములు మున్నగు గుణముల చేత బంధించి యామనస్సే వీనిని నేను, నాది యను భావమును గలిగించి స్వకీయములైన కర్మలందు వాని ఫలానుభవములందును తగుల్కొనజేసి (జనన మరణ రూప సంసార చక్రమందు) త్రిప్పుచుండును.

అధ్యాసదోషాత్పురుషస్య సంసృతిః
అధ్యాసబంధస్త్వమునైవ కల్పితః ।
రజస్తమోదోషవతోఽవివేకినో
జన్మాదిదుఃఖస్య నిదానమేతత్ ॥ 181

అధ్యాసదోషము కారణముగానే (అది కాని దానియందు అదియను భావన చేయుట అధ్యాస మనబడును) పురుషునకు జననమరణరూప సంసారము ప్రాప్తమగుచుండును. ఈయధ్యాస బంధము ఈ మనస్సు చేత కల్పించడబడినదే. రజోగుణ తమోగుణ దోషపూరితుడు, వివేకహీనుడునగు పురుషునకు ఈ అధ్యాసదోషమే జన్మాది దుఃఖములు కలుగుటకు మూల కారణము.

అతః ప్రాహుర్మనోఽవిద్యాం పండితాస్తత్త్వదర్శినః ।
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునేవాభ్రమండలమ్ ॥ 182

కావున తత్త్వద్రష్టలగు పండితులు మనస్సునే అవిద్యయని పేర్కొన్నారు. దాని మూలముననే వాయువుచేత మేఘమండలము వలె ఈ సమస్త విశ్వము త్రిప్పబడుచున్నది.

తన్మనశ్శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా ।
విశుద్ధే సతి చైతస్మిన్ముక్తిః కరఫలాయతే ॥ 183

మోక్షాపేక్ష గలవాడు ఆ మనస్సును ప్రయత్నపూర్వకముగా శోధించి పరిశుద్ధము గావించుకొనవలెను. అది పరిశుద్ధమైన మీదట పురుషునకు ముక్తి కరతలామలకమగును.

మోక్షైకసక్త్యా విషయేషు రాగం
నిర్మూల్య సంన్యస్య చ సర్వకర్మ ।
సచ్ఛ్రద్ధయా యః శ్రవణాదినిష్ఠో
రజస్స్వభావం స ధునోతి బుద్ధేః ॥ 184

మోక్షాపేక్ష గలిగియుండి విషయముల యందలి ప్రీతిని నిర్మూలించుకొని, సర్వకర్మ పరిత్యాగము గావించి శుద్ధమైన శ్రద్ధ వహించి శ్రవణాదుల యందు తత్పరుడై యుండువాడు తన బుద్ధిని పట్టియున్న రజోగుణమయమైన (చంచలమైన) స్వభావమును నశింపజేసికొన్న వాడగును.

మనోమయో నాపి భవేత్పరాత్మా
హ్యాద్యంతవత్త్వాత్పరిణామిభావాత్ ।
దుఃఖాత్మకత్వాద్విషయత్వహేతోః
ద్రష్టా హి దృశ్యాత్మతయా న దృష్టః ॥ 185

ఆది, అంతమును గలది, పరిణామలక్షణము గలది, దుఃఖాత్మకమైనది, విషయరూపమైనదియు అయిన కారణమున మనోమయకోశము కూడ పరాత్మ కాజాలదు. కారణము ఏమన ద్రష్ట(చూచువాడు) ఎన్నడును దృశ్యరూపమున చూడబడలేదు.

## విజ్ఞానమయకోశము

బుద్ధిర్బుద్ధీంద్రియైస్సార్థం సవృత్తిః కర్తృలక్షణః ।
విజ్ఞానమయకోశః స్యాత్పుంసః సంసారకారణమ్ ॥ 186

జ్ఞానేంద్రియములతోడ వృత్తియుక్తమై యున్న బుద్ధియే కర్తృ లక్షణముగల విజ్ఞానమయ కోశము. ఇది పురుషుని జననమరణరూప సంసారమునకు కారణమగునట్టిది.

అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తిః
విజ్ఞానసంజ్ఞః ప్రకృతేర్వికారః ।
జ్ఞానక్రియావానహమిత్యజస్రం
దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశమ్ ॥ 187

చిత్తమును, ఇంద్రియాదులను అనుగమించునట్టి చేతనము యొక్క ప్రతిబింబశక్తి విజ్ఞానమను పేరు గల ప్రకృతిసంబంధమగు వికారము. అది 'నేను జ్ఞానము కలవాడను, క్రియావంతుడను' అను నట్టి యభిమానమును దేహేంద్రియాదులయందు నిత్యము కలుగజేయుచుండును.

అనాదికాలోఽయమహం స్వభావో
జీవస్సమస్తవ్యవహారవోఢా ।
కరోతి కర్మాణ్యపి పూర్వవాసనః
పుణ్యాన్యపుణ్యాన్యపి తత్ఫలాని ॥ 188

భుంక్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజన్
ఆయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః ।
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్రత్
స్వప్నాద్యవస్థా సుఖదుఃఖభోగః ॥ 189

దేహాదినిష్ఠాశ్రమధర్మకర్మ
గుణాభిమానం సతతం మమేతి ।
విజ్ఞానకోశోఽయమతిప్రకాశః
ప్రకృష్టసాన్నిధ్యవశాత్పరాత్మనః ।
అతో భవత్యేష ఉపాధిరస్య
యదాత్మధీస్సంసరతి భ్రమేణ ॥ 190

నేను అనునట్టి స్వభావము కల యీ విజ్ఞానమయకోశమే అనాది కాలీనుడగు జీవుడు. ఇతడు లోకసంబంధమగు వ్యవహారములను నిర్వహించువాడు. తన పూర్వవాసనను అనుసరించి యితడు పుణ్యాపాపమయములైన కర్మలను ఎన్నిటినో ఆచరించుచు, వాని ఫలములను అనుభవించుచు విచిత్రములైన యోనులయందు పరిభ్రమించుచు ఒకప్పుడు క్రిందకు, మఱియొకప్పుడు మీదకు వచ్చుచు పోవుచు నుండును. జాగ్రదవస్థ, స్వప్నావస్థ మున్నగు అవస్థలు, సుఖదుఃఖాది భోగములు, దేహాదులందు ఆత్మాభిమానము, ఆశ్రమాదుల ధర్మకర్మములు, గుణములకు సంబంధించిన అభిమానము, మమకారము మున్నగునవి యన్నియు ఈ విజ్ఞానమయకోశమునందే యుండును. ఇది యాత్మకు బహు చేరువగా నున్నది అగుటచేత మిక్కిలి ప్రకాశమయమైనది. కావున ఇది దీని యుపాధి. ఇందు భ్రాంతి వశమున ఆత్మబుద్ధి వహించియే యితడు జననమరణ రూపసంసార చక్రమందు తగుల్కొనుచుండును.

## ఆత్మకు ఉపాధితోడ సంబంధము లేకుండుట

యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది స్ఫురత్స్వయంజ్యోతిః।
కూటస్థస్సన్నాత్మా కర్తా భోక్తా భవత్యుపాధిస్థః ॥ 191

స్వయం ప్రకాశము, విజ్ఞానమయమునై హృదయము లోపల ప్రాణములందు స్ఫురించునట్టి తత్త్వము యేది కలదో అది కూటస్థమైన (నిర్వికారమైన) యాత్మయై యుండి కూడ ఉపాధివశమున కర్తయు, భోక్తయునగుచున్నది.

స్వయం పరిచ్ఛేదముపేత్య బుద్ధే
స్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః ।
సర్వాత్మకస్సన్నపి వీక్షతే స్వయం
స్వతః పృథక్త్వేన మృదో ఘటానివ ॥ 192

ఆ పరాత్ముడు మిథ్యాబుద్ధిచేత పరిచ్ఛిన్నుడై దానితోడ ఏకీభవించుటయను దోషము కారణముగా తాను సర్వాత్మకుడై యుండి కూడ మట్టినుండి పుట్టిన కడవయు మట్టియు ఒక్కటియే యైనను భిన్నముగా చూడబడు విధమున తన రూపమే యగుదానిని తనకంటె భిన్నముగా చూచుచున్నాడు.

ఉపాధిసంబంధవశాత్పరాత్మా
హ్యుపాధిధర్మా ననుభాతి తద్గుణః ।
అయోవికారానవికారివహ్నివత్
సదైకరూపోఽపి పరస్స్వభావాత్ ॥ 193

ఆ పరాత్ముడు స్వరూపము చేత సర్వదా ఏకరూపుడు. అయినను ఉపాధితో గల సంబంధము కారణముగా దాని గుణములతోడ గూడియున్నవానివలె ఉండి దాని ధర్మములతోనే ప్రకాశించుచుండును. ఎట్లనగా ఇనుము యొక్క విభిన్న స్వరూపాలలో వ్యాపించిన అవికారియగు నగ్ని వానితో సమానముగనే ప్రకాశించుచుండును.

## ముక్తి యెట్లు కలుగును?

శిష్య ఉవాచ

భ్రమేణాప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః ।
తదుపాధేరనాదిత్వాన్నానాదేర్నాశ ఇష్యతే ॥ 194

శిష్యుడు ఇట్లు పలికెను - "గురుదేవా! భ్రాంతి చేత నగుడు లేక వేరు కారణము చేత నగుడు. ఎట్లయిన నేమి? పరమాత్మకు జీవభావము

ప్రాప్తించినది కదా! దాని యుపాధి యనాదియైనది కదా! అనాదియైన వస్తువునకు నాశము కలుగనేరదు కదా!

అతో౽స్య జీవభావో౽పి నిత్యో భవతి సంసృతిః ।
న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద ॥ 195

కాబట్టి యాత్మకు జీవభావము కూడ నిత్యమే యగును. అట్టి దశలో దీనికి జననమరణరూప సంసారచక్రము ఎన్నటికిని నివృత్తమగుట సంభవమే కాదు. అట్టి యెడ దీనికి మోక్షము ఎట్లు కలుగునో సెలవిండు!"

## ఆత్మ జ్ఞానమే ముక్తికి ఉపాయము

శ్రీగురురువాచ

సమ్యక్పృష్టం త్వయా విద్వన్ సావధానేన తచ్ఛృణు ।
ప్రామాణికీ న భవతి భ్రాంత్యా మోహితకల్పనా ॥ 196

గురువు ఇట్లు బదులు పలికెను - "వత్సా! నీవు బహుబుద్ధిమంతుడవు. మంచి విషయమును అడిగితివి. సావధానమనస్కుడవై యాలకింపుము. చూడుము! మోహగ్రస్తుడైన పురుషుడు భ్రాంతివశమున జేసికొన్న కల్పన యెన్నడును ప్రామాణికము గాజాలదు.

భ్రాంతిం వినా త్వసంగస్య నిష్క్రియస్యనిరాకృతేః ।
న ఘటేతార్థసంబంధో నభసో నీలతాదివత్ ॥ 197

ఆకాశమునకు నీలత్వాది లక్షణములతోడ సంబంధము భ్రాంతి మూలకమైనది గాక వాస్తవమైనది యెట్లు కాదో అట్లే సంగరహితము, క్రియారహితము, నిరాకారమునగు ఆత్మకు పదార్థములతోడ సంబంధము కూడ భ్రాంతిమూలకమైనది కాని వాస్తవికమైనది కాదు.

స్వస్య ద్రష్టుర్నిర్గుణస్యాక్రియస్య
ప్రత్యగ్బోధానందరూపస్య బుద్ధేః ।

భ్రాంత్యా ప్రాప్తో జీవభావో న సత్యో
మోహాపాయే నాస్త్యవస్తుస్వభావాత్ ॥ 198

సాక్షి, గుణరహితము, క్రియారహితము, ప్రత్యగ్ జ్ఞానానంద స్వరూపమునగు ఆత్మయందు బుద్ధియొక్క భ్రాంతిచేతనే జీవభావము ప్రాప్తమైనది. అది వాస్తవికమైనది కాదు. ఏలయనగా అది అవస్తురూప మగుటచేత మోహము తొలగిన మీదట స్వాభావికముగానే ఉండదు.

యావద్భ్రాంతిస్తావదేవాస్య సత్తా
మిథ్యాజ్ఞానోజ్జృంభితస్య ప్రమాదాత్ ।
రజ్జ్వాం సర్పో భ్రాంతికాలీన ఏవ
భ్రాంతేర్నాశే నైవ సర్పోఽపి తద్వత్ ॥ 199

భ్రాంతి యున్నంతవరకు మాత్రమే రజ్జువునందు సర్పము తోచుచుండును. భ్రాంతి తొలగిపోయిన మీదట ఇకసర్పము గోచరము కాదు. అట్లే భ్రాంతి యున్నంతవరకు మాత్రము ప్రమాదవశమున మిథ్యాజ్ఞానమువలన ప్రకటమైన యీ జీవభావము నిలిచియుండును.

అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే ।
ఉత్పన్నాయాం తు విద్యాయామావిద్యకమనాద్యపి ॥ 200
ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం వినశ్యతి ।

లోకములో అవిద్యయు, దాని కార్యము జీవభావమునకు అనాదిత్వముగా ఎన్నబడినది. కాని నిద్ర మేలుకొన్న మీదట స్వప్నప్రపంచ మంతయు సమూలముగా ఎట్లు లుప్తమైపోవునో అట్లే జ్ఞానోదయమైన మీదట అవిద్యాజనితమైన జీవభావము అంతరించిపోవును.

అనాద్యపీదం నో నిత్యం ప్రాగభావ ఇతిస్ఫుటమ్ ॥ 201
అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః ।

ఈ జీవభావము అనాదియైనను ప్రాగభావమువలె నిత్యము కాదు. ఏలయనగా అనాదియైన ప్రాగభావము కూడ ధ్వంసమగుట చూడబడినది.

యద్బుద్ధ్యుపాధిసంబంధాత్పరికల్పిత మాత్మని ॥ 202
జీవత్వం న తతోఽన్యత్తు స్వరూపేణ విలక్షణమ్ ।
సంబంధః స్వాత్మనో బుద్ధ్యా మిథ్యాజ్ఞానపురస్సరః ॥ 203

వినివృత్తిర్భవేత్తస్య సమ్యగ్జ్ఞానేన నాన్యథా ।
బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం సమ్యగ్ జ్ఞానం శ్రుతేర్మతమ్ ॥ 204

బుద్ధిరూపమైన యుపాధితోడి సంబంధము వలన ఆత్మయందు ఏ జీవభావము పరికల్పితమైనదో అది స్వరూపము (ఆత్మకంటె) కంటె విలక్షణమైనది కాదు. భిన్నమైనది కాదు. బుద్ధితోడ ఆత్మకు ఈ సంబంధము మిథ్యాజ్ఞాన మూలకమైనది. ఇది తగిన విధముగా జ్ఞానము కలిగినప్పుడే నివృత్తము కాగలదు. కాని మఱియొక విధముగా కాదు. బ్రహ్మము, ఆత్మయు ఒక్కటియే అనునట్టి జ్ఞానమే వాస్తవికమైన జ్ఞానము అన్నది శ్రుతి సిద్ధాంతము. (కాబట్టి బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలుగుట వలన జీవభావము అంతరించును.)

తదాత్మానాత్మనోస్సమ్యగ్వివేకేనైవ సిద్ధ్యతి ।
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మసదాత్మనోః ॥ 205

ఆత్మ ఏది? అనాత్మ యేది? అనునట్టి వివేకము తగిన విధముగా కలిగినప్పుడే ఆ బ్రహ్మాత్మైక్య జ్ఞానము సిద్ధించును. కావున ప్రత్యగాత్మ, మిథ్యాత్మలను గూర్చి చక్కగా వివేచనము చేయవలెను.

జలం పంకవదత్యంతం పంకాపాయే జలం స్ఫుటమ్ ।
యథా భ్యాతి తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః ॥ 206

మిక్కిలిగా బురదతో కూడిన నీరు ఆ బురద క్రిందకు దిగిపోవుటతో స్వచ్ఛముగా భాసించును. అట్లే దోషరహితమైనప్పుడు ఆత్మ కూడ స్పష్టముగా ప్రకాశింపనారంభించును.

అసన్నివృత్తౌ తు సదాత్మనా స్ఫుటం
ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః ।
తతో నిరాసః కరణీయ ఏవా
సదాత్మనః సాధ్వహమాదివస్తునః ॥ 207

సత్యమైన ఆత్మను గూర్చి విచారణ చేయగా అసత్తు నివృత్తమైన మీదట ఈ ప్రత్య (అంతరికమైన) గాత్మ స్పష్టముగా ప్రతీతము కాసాగును. కావున అహంకారము ఆదిగాగల అసదాత్మలను తగిన విధముగా నిరసించవలెను.

అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయశబ్దభాక్ ।
వికారిత్వాజ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వహేతుతః ।
దృశ్యత్వాద్వ్యభిచారిత్వాన్నానిత్యో నిత్య ఇష్యతే ॥ 208

కావున విజ్ఞానమయము అను శబ్దము చేత పేర్కొనబడునట్టి యీ విజ్ఞానమయకోశము కూడ వికారియు జడమును. పరిచ్ఛిన్నము, దృశ్యము, వ్యభిచారియు నైన కారణమున పరాత్మ కాజాలాదు. (ఏలయనగా ఇది అనిత్యమైనది.) అనిత్యవస్తువు ఎన్నడును నిత్యము కాజాలదు.

## ఆనందమయ కోశము

ఆనందప్రతిబింబచుంబితతనుర్వృత్తిస్తమోజృంభితా
స్యాదానందమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థలాభోదయః ।
పుణ్యాస్యానుభవే విభాతి కృతినామానందరూపస్స్వయం
భూత్వా నందతి యత్ర సాధు తనుభృన్మాత్రః ప్రయత్నం వినా ॥ 209

ఆనందస్వరూపమగు ఆత్మయొక్క ప్రతిబింబముచేత చుంబితమై తమోగుణము వలన ప్రకటమైన వృత్తి ఆనందమయకోశము. అది (ప్రియము, మోదము, ప్రమోదము) గుణములు మూడింటితోను కూడియున్నది. తన యభీష్టపదార్థము ప్రాప్తమైనప్పుడు ప్రకటమగును. పుణ్యకర్మలు పరిపక్వములు అయినప్పుడు దాని ఫలరూపమగు సుఖమును

అనుభవించు వేళ భాగ్యశాలులైన పురుషులకు స్వయముగనే యీ యానందమయకోశము అనుభూతమగును. తన్మూలమున దేహధారులయిన జీవులు అందరు అప్రయత్నముగనే అమితానందమును పొందుదురు.

**ఆనందమయ కోశస్య సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా ।**
**స్వప్నజాగరయోరీషదిష్టసందర్శనాదినా ॥ 210**

ఆనందమయకోశము యొక్క ఉత్కటమైన ప్రతీతి సుషుప్తి దశయందే ప్రాప్తించును. జాగ్రదవస్థయందు, స్వప్నదశయందును కూడ ఇష్టవస్తుదర్శనాదుల మూలమున దాని ప్రతీతి ఒకింత కలుగవచ్చును.

**నైవాయమానందమయః పరాత్మా**
**సోపాధికత్వాత్ ప్రకృతేర్వికారాత్ ।**
**కార్యత్వహేతోః సుకృతక్రియాయా**
**వికారసంఘాతసమాహితత్వాత్ ॥ 211**

ఈ ఆనందమయకోశము కూడ పరాత్మ కాజాలదు. కారణము ఏమనగా అది ఉపాధియుక్తమైనది. ప్రకృతి వికారమైనది. పుణ్యకర్మల క్రియాస్వరూపమగునది. ప్రకృతి వికారముల సమూహమును (శరీరమును) ఆశ్రయించియుండునది.

**పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః ।**
**తన్నిషేధావధిస్సాక్షీ బోధరూపోఽవశిష్యతే ॥ 212**

శ్రుతికి అనుకూలములైన యుక్తులతో 'ఇది ఆత్మకాదు. ఇదియు కాదు' అని పంచకోశములను నిషేధించుకొనుచు పోగా ఆ నిషేధముల అవధియందు సాక్షియు బోధరూపము నగు ఆత్మ మిగులును.

**యోఽయమాత్మా స్వయంజ్యోతిః పంచకోశవిలక్షణః ।**
**అవస్థాత్రయసాక్షీ సన్నిర్వికారో నిరంజనః ।**
**సదానంద స్స విజ్ఞేయః స్వాత్మత్వేన విపశ్చితా ॥ 213**

ఈ విధముగా స్వయంప్రకాశమై అన్నమయాది పంచకోశములకన్న భిన్నమై జాగ్రత్ స్వప్న సుషుప్తులనబడు మూడు అవస్థలకును సాక్షియైయుండి కూడ నిర్వికారముగా, నిర్మలముగా నిత్యానంద స్వరూపమై వెలుగొందు నాత్మ యేది కలదో దానినే విద్వాంసుడగువాడు తన వాస్తవికాత్మ యని యెరుగవలెను."

## ఆత్మ స్వరూప విషయకమగు ప్రశ్నము

శిష్య ఉవాచ

మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశేష్వేతేసు పంచసు ।
సర్వాభావం వినా కించిన్న పశ్యామ్యత్ర హే గురో ।
విజ్ఞేయం కిము వస్త్వస్తి స్వాత్మనాత్ర విపశ్చితా ॥ 214

శిష్యుడు ఇట్లు పలికెను - "ఓ గురుదేవా! ఈ పంచకోశములను ఇది మిథ్య. ఇది మిథ్యయని నిషేధించుచూ పోయిన మీదట సర్వాభావము తప్ప నాకు వేఱేదియు వ్యక్తమగుట లేదు. అట్టి యెడ బుద్ధిమంతుడు ఏ వస్తువును తన యాత్మ యని గుర్తింపగలుగును?"

## ఆత్మ స్వరూప నిరూపణము

శ్రీ గురురువాచ

సత్యముక్తం త్వయా విద్వన్ నిపుణోఽసి విచారణే ।
అహమాదివికారాస్తే తదభావోఽయమప్యను ॥ 215

గురువు ఇట్లు బదులు చెప్పెను - "ఓయి విద్యావంతుడా! నీవు నిజము చెప్పుచున్నావు? విచారణము చేయుటలో నిపుణుడవు. అహంకారాదులు ఎట్లు నీ వికారములో అట్లే వాని యభావము కూడ వికారమే.

సర్వే యేనానుభూయంతే యస్స్వయంనానుభూయతే।
తమాత్మానం వేదితారం విద్ధిబుద్ధ్యా సుసూక్ష్మయా ॥ 216

దేని చేత సర్వము అనుభవింపబడుచున్నదో, ఏది స్వయముగా తాను అనుభవింపబడదో ఆ సర్వసాక్షి యగుదానినే నీయాత్మ యని అతి సూక్ష్మమైన బుద్ధితో ఎరుగుము.

తత్సాక్షికం భవేత్తద్యద్యేనానుభూయతే ।
కస్యాప్యననుభూతార్థే సాక్షిత్వం నోపయుజ్యతే ॥ 217

ఏది యేది దేనిదేని చేత అనుభవింపబడునో అది యెల్ల దాని సాక్షిత్వమందే సాగుచుండును. అనుభూతము కాని పదార్థము విషయమున ఎవరి (దేని) సాక్షిత్వమునూ ఉపయుక్తము కాదు.

అసౌ స్వసాక్షికో భావో యతస్స్వేనానుభూయతే ।
అతః పరం స్వయం సాక్షాత్ ప్రత్యగాత్మా న చేతరః ॥ 218

ఈ ఆత్మ తనకు తానే సాక్షి. ఏలయనగా ఇది తనంత తానుగానే అనుభూతమగును. కావున దీనికి అతీతముగా సాక్షాత్తు స్వకీయమగు అంతరాత్మ వేరేదియు లేదు.

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృంభతే
ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యంతః స్ఫురన్నైకధా ।
నానాకారవికారభాగిన ఇమాన్ పశ్యన్నహంధీముఖాన్
నిత్యానందచిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది ॥ 219

జాగ్రత్స్వప్నసుషుప్తు లనబడు ఈ మూడు అవస్థలయందును ఏది అంతఃకరణము లోపల సర్వదా 'అహం అహం' (నేను) అను రూపమున అనేక విధముల స్ఫురించుచు ప్రత్యగ్రూపముగా స్పష్టముగా భాసించుచుండునో, అహంకారమాదిగా ప్రకృతికి సంబంధించిన నానావిధ వికారములను సాక్షిమాత్రముగా చూచుచు చిదానందరూపముగా స్ఫురించుచుండునో దానినే నీవు నీ యంతఃకరణమందు వెలుగొందు నీయాత్మయని యెఱుగుము.

ఘటోదకే బింబితమర్కబింబమ్
ఆలోక్య మూఢో రవిమేవ మన్యతే ।
తథా చిదాభాసముపాధిసంస్థం
భ్రాంత్యాహమిత్యేవ జడో౾భిమన్యతే ॥ 220

కడవలోని నీటియందు ప్రతిబింబితమైన సూర్యుని ప్రతిబింబమును గాంచి మూఢుడగు జనుడు అదియే సూర్యుడని భావించును. అట్లే ఉపాధిగతమైన చిదాభాసమును అజ్ఞానియగు పురుషుడు భ్రాంతివశమున అదియే తన యాత్మయని భావించును.

ఘటం జలం తద్గతమర్కబింబం
విహాయ సర్వం వినిరీక్ష్యతే౾ర్కః ।
తటస్థ ఏకస్త్రితయావభాసకః
స్వయంప్రకాశో విదుషా యథా తథా ॥ 221

దేహం ధియం చిత్ప్రతిబింబమేతం
విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయామ్ ।
ద్రష్టారమాత్మానమఖండబోధం
సర్వప్రకాశం సదసద్విలక్షణమ్ ॥ 222

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్
అంతర్బహిశ్శూన్యమనన్యమాత్మనః ।
విజ్ఞాయ సమ్యక్ నిజరూపమేతత్
పుమాన్ విపాప్మా విరజో విమృత్యుః ॥ 223

విద్వాంసుడైన పురుషుడు కడవ, జలము, అందలి ప్రతిబింబము - వీని నన్నిటిని కాదని వీనిని ప్రకాశింపజేయువాడు, వీనికంటె భిన్నముగా నున్నవాడు, స్వయంప్రకాశరూపుడు నగు సూర్యునే చూచును. అట్లే దేహము, బుద్ధి, చిదాభాసము - అను ఈ మూడింటిని వీడి బుద్ధిగుహలో నున్న సాక్షిరూపమగు ఈ యాత్మను అఖండబోధస్వరూపునిగా,

సర్వప్రకాశకునిగా, సత్తు, అసత్తులు రెండింటికంటెను భిన్నమైన వానినిగా, నిత్యునిగా, విభునిగా, సర్వగతునిగా, సూక్ష్మరూపునిగా, బాహ్యాభ్యంతర, భేదరహితునిగా, తనకంటె సర్వవిధముల అభిన్నునిగా, దీనినే (ఈ యాత్మనే) తన నిజరూపముగా నెఱిగి పురుషుడు పాపరహితుడు, నిర్మలుడు, అమరుడు అగును.

విశోక ఆనందఘనో విపశ్చిత్
స్వయం కుతశ్చిన్న బిభేతి కశ్చిత్ ।
నాన్యో-స్తి పంథా భవబంధముక్తేః
వినా స్వతత్త్వావగమం ముముక్షోః ॥ 224

అత్యంత బుద్ధిమంతుడగు ఆ పురుషుడు శోకరహితుడు, ఆనందమయస్వరూపుడు అయిన కారణమున ఎన్నడు దేనివలన భయము జెందడు. మోక్షాపేక్ష గల పురుషునకు ఆత్మతత్త్వజ్ఞానము తప్ప సంసారబంధ విముక్తికి వేఱు మార్గము లేదు.

బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవమోక్షస్య కారణమ్ ।
యేనాద్వితీయమానందం బ్రహ్మ సంపద్యతే బుధైః ॥ 225

బ్రహ్మకు, ఆత్మకు నడుమ అభేదజ్ఞానమే భవబంధ విముక్తికి కారణము. దానివలన బుద్ధిమంతుడైన పురుషుడు అద్వితీయానంద స్వరూపమగు బ్రహ్మపదమును పొందును.

బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః ।
విజ్ఞాతవ్యమతః సమ్యగ్బ్రహ్మాభిన్నత్వమాత్మనః ॥ 226

బ్రహ్మ భావమును పొందిన మీదట విద్వాంసుడైన పురుషుడు ఇక జననమరణరూపమగు సంసార చక్రములో పడడు. కాబట్టి ఆత్మకు బ్రహ్మము తోడనున్న అభేదమును చక్కగా తెలిసికొనవలెను.

సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ విశుద్ధపరంస్వతస్సిద్ధమ్ ।
నిత్యానందైకరసం ప్రత్యగభిన్నం నిరంతరంజయతి ॥ 227

బ్రహ్మ సత్యము, జ్ఞానస్వరూపము. అనంతమును అయినది. అది శుద్ధము, పరము, స్వతస్సిద్ధము, నిత్యము, కేవలమును ఆనంద స్వరూపము, ప్రత్యక్కు, (అంతరతమము) అభిన్నము, నిరంతరమును ఉన్నతిశాలియు నగునది.

## బ్రహ్మమునకు, జగత్తునకు ఏకత్వము

సదిదం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽభావాత్ ।
న హ్యన్యదస్తి కించిత్సమ్యక్పరమార్థతత్త్వబోధే హి ॥ 228

ఈ పరమాద్వైతమే ఒక సత్యపదార్థము. ఏలయనగా ఈ స్వాత్మ పదార్థము కంటె భిన్నమైన వస్తువేదియు లేదు. ఈ పరమార్థతత్త్వము సమగ్రముగా తెలియవచ్చిన మీదట ఇక అన్యపదార్థము ఏదియు నుండదు.

యదిదం సకలం విశ్వం నానారూపంప్రతీతమజ్ఞానాత్ ।
తత్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషాత్ ॥ 229

అజ్ఞాన కారణముగా నానావిధములుగా గోచరించుచున్న యీ విశ్వమంతయు సమస్తభావనాదోషరహితమైన బ్రహ్మమే. అనగా నిర్వికల్ప బ్రహ్మమే.

మృత్కార్యభూతోఽపి మృదో న భిన్నః
కుంభోఽస్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్ ।
న కుంభరూపం పృథగస్తి కుంభః
కుతో మృషాకల్పితనామమాత్రః ॥ 230

మట్టి యొక్క కార్యమైనను కడవ దానికంటె భిన్నమైనది కాదు. ఏలయనగా ఎల్ల వంకలనుండియు మృత్తికా స్వరూపమైన కారణముగా కడవ రూపము మృత్తికంటె భిన్నమైనది కాదు. కాబటి మట్టియందు కల్పితమైన నామమాత్రపు కడవకు వేరుగా సత్తా యెక్కడ ఉన్నది?

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సందర్శయితుం న శక్యతే ।
అతో ఘటః కల్పిత ఏవ మోహాత్
మృదేవ సత్యం పరమార్థభూతమ్ ॥ 231

మట్టికంటె భిన్నముగా కడవకు రూపమేదియు లేదు. కావున కడవ యొక్క రూపము అజ్ఞానము చేత కల్పితమైనది. నిజమరయగా సత్యమైనది తత్త్వస్వరూపమగునది మృత్తికయే.

సద్బ్రహ్మకార్యం సకలం సదైవ
తన్మాత్రమేతన్న తతోఽన్యదస్తి ।
అస్తీతి యో వక్తి న తస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః ॥ 232

(అట్లే) సద్బ్రహ్మము యొక్క కార్యమగు ఈ సమస్తప్రపంచము సత్స్వరూపమే యగును. ఏలయనగా ఇది యంతయు అదియే. దానికంటె భిన్నమైన దేదియును లేదు. దానికంటె భిన్నమైనది ఏదియో యున్నదను వాని మోహము తొలగలేదన వలయును. అట్టివాని మాట నిద్రపోవువాని ప్రేలాపన వంటిది.

బ్రహ్మైవేదం విశ్వమిత్యేవ వాణీ
శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా ।
తస్మాదేతద్బ్రహ్మమాత్రం హి విశ్వం
నాధిష్ఠానాద్భిన్నతారోపితస్య ॥ 233

ఈ విశ్వమంతయు బ్రహ్మ స్వరూపమే యని శ్రేష్ఠమైన యథర్వవేదము చెప్పుచున్నది. కాబట్టి యీ విశ్వము బ్రహ్మస్వరూపమాత్రమే. ఏలయనగా ఆరోపితమైన వస్తువునకు అధిష్ఠానము కంటె భిన్నమైన సత్తా ఉండనే ఉండదు.

సత్యం యది స్యాజ్జగదేతదాత్మనో
ఽనంతత్వహానిర్నిగమాప్రమాణతా ।
అసత్యవాదిత్వమపీశితుః స్యాత్
నైతత్త్రయం సాధు హితం మహాత్మనామ్ ॥ 234

ఈ జగత్తు సత్యమే యగుచో ఆత్మయొక్క అనంతత్వమునకు భంగముకలుగును. శ్రుతి వచనము అప్రామాణికమైపోవును. భగవానునకు (ఈశ్వరునకు) అసత్యావాదదోషము ప్రాప్తించును. ఈ మూడు విషయములును సత్పురుషులకు శుభకరములు, హితకరములును గావు.

ఈశ్వరో వస్తుతత్త్వజ్ఞో న చాహం తేష్వవస్థితః ।
న చ మత్స్థాని భూతాని న చాహంతేష్వవస్థితః ॥ 235

పరమార్థము నెఱిగిన పరమేశ్వరుడు 'నేను భూతములందును లేను. అవి నాయందును లేవు' అని నిశ్చయము చేసెను.

యది సత్యం భవేద్విశ్వంసుషుప్తావుపలభ్యతామ్ ।
యన్నోపలభ్యతే కించిదతోఽసత్స్వప్నవన్మృషా ॥ 236

విశ్వము సత్యమే యగుచో అది సుషుప్తియందు కూడ ప్రతీతము కావలయును. కాని ఆదశలో ఏమియు ప్రతీత మగుటలేదు. కాబట్టి యిది స్వప్నమువలె అసత్తు, మిథ్యయు నగును.

అతః పృథక్నాస్తి జగత్పరాత్మనః
పృథక్ప్రతీతిస్తు మృషా గుణాదివత్ ।
ఆరోపితస్యాస్తి కిమర్థవత్తా
ధిష్ఠానమాభాతి తథా భ్రమేణ ॥ 237

కావున పరమాత్మ కంటె భిన్నముగా జగత్తు లేనే లేదు. అది భిన్నముగా ప్రతీతమగుట యన్నది (గుణము కలవాడు, కలది) కంటె గుణము భిన్నముగా ప్రతీత మగుటవలె మిథ్యయే యగును. ఆరోపిత వస్తువునకు

వాస్తవికత్వము ఎట్లు ఉండును. అధిష్ఠానమే భ్రాంతి చేత ఆ విధముగా వాస్తవికమైనదానివలె భాసించుచుండును.

భ్రాంతస్య యద్యద్భ్రమతః ప్రణీతం
బ్రహ్మైవ తత్తద్రజతం హి శుక్తిః ।
ఇదంతయా బ్రహ్మ సదైవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్ ॥ 238

భ్రాంతచిత్తునకు (అజ్ఞానికి) అజ్ఞానవశమున ఏమేమి గోచరించినను అది యది యెల్ల బ్రహ్మస్వరూపమే. ముత్తెపు చిప్ప వెండివలె భాసించును కాని అది వెండికాదు. అందు భ్రాంతివశమున గోచరించు వెండి వెండికాదు. ముత్తెపుచిప్పయే. 'ఇదం జగత్' (ఇదిజగత్తు) - ఈ మాటలోని 'ఇదం (ఇది) రూపమున సదా బ్రహ్మమే పేర్కొనబడును. బ్రహ్మమునందు ఆరోపితమైన (జగత్తు) నామమాత్రమైనదే యగును.

## బ్రహ్మ నిరూపణము

అతః పరం బ్రహ్మ సదద్వితీయం
విశుద్ధవిజ్ఞానఘనం నిరంజనమ్ ।
ప్రశాంతమాద్యంతవిహీనమక్రియం
నిరంతరానందరసస్వరూపమ్ ॥ 239

కావున పరబ్రహ్మము సత్తు, అద్వితీయము, శుద్ధము, విజ్ఞానఘనము, నిర్మలము, శాంతము, అది అంతములు లేనిది, క్రియారహితము, సర్వదా ఆనందరస స్వరూపమును అగునది.

నిరస్తమాయాకృతసర్వభేదం
నిత్యం సుఖం నిష్కలమప్రమేయమ్ ।
అరూపమవ్యక్తమనాఖ్యమవ్యయం
జ్యోతిస్స్వయం కించిదిదం చకాస్తి ॥ 240

అది మాయాకృతములైన భేదము లేవియు లేనిది. నిత్యము, సుఖస్వరూపము, కలారహితము, ప్రమాణాదులకు అందనిది, అది యేదియో రూపరహితము, అవ్యక్తము, నామరహితము, అక్షయమునగు జ్యోతిస్స్వరూపము. అది స్వయంప్రకాశమాన మగునది.

జ్ఞాతృజ్ఞేయజ్ఞానశూన్యమనంతం నిర్వికల్పకమ్ ।
కేవలాఖండ చిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః ॥ 241

పండితులైనవారు ఆ పరతత్త్వమును జ్ఞాత,జ్ఞేయము, జ్ఞానము అను త్రిపుటి లేనిది, అనంతము, నిర్వికల్పము, కేవలము, అఖండ చైతన్యమాత్రముగా గుర్తింతురు

అహేయమనుపాదేయం మనోవాచామగోచరమ్ ।
అప్రమేయమనాద్యంతం బ్రహ్మ పూర్ణం మహన్మహః ॥ 242

ఆ బ్రహ్మము త్యజింపరానిది. గ్రహింపనూ రానిది. మనోవాక్కులకు అందనిది. అప్రమేయము, ఆద్యంతరహితము, పరిపూర్ణము, మహాతేజోమయమైనది.

## మహావాక్య విచారము

తత్త్వం పదాభ్యామభిధీయమానయోః
బ్రహ్మాత్మనోశ్శోధితయోర్యదీత్థమ్ ।
శ్రుత్వా తయోస్తత్త్వమసీతి సమ్య
గేకత్వమేవ ప్రతిపాద్యతే బుధైః ॥ 243

'తత్త్వమసి' (ఛాందోగ్య6/8) మున్నగు వాక్యములలోని 'తత్-త్వం' అను పదముల మూలమును శోధించి చెప్పబడిన బ్రహ్మము, ఆత్మ - రెండును ఒకటియే యని వేదములచేత పర్యాయముగా ఆ రెండింటికిని ఏకత్వమే ప్రతిపాదింపబడినది.

ఐక్యం యతోర్లక్షితయోర్న వాచ్యయోః
నిగద్యతేఽన్యోన్యవిరుద్ధధర్మిణోః ।
ఖద్యోతభాన్వోరివ రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః పరమాణుమేర్వోః ॥ 244

సూర్యుడు - మిణుగురు పురుగు, రాజు-సేవకుడు, సముద్రము-నూయి, సుమేరు పర్వతము - పరమాణువు వలె పరస్పర విరుద్ధ ధర్మములు కలవానికి ఏకత్వము లక్ష్యార్థమందే చెప్పబడినది. వాచ్యార్థ మందు చెప్పబడలేదు.

తయోర్విరోధోఽయముపాధికల్పితో
న వాస్తవః కశ్చిదుపాధిరేషః ।
ఈశస్య మాయా మహదాది కారణం
జీవస్య కార్యం శృణు పంచకోశమ్ ॥ 245

ఆ రెండింటియందును ఈ విరోధము ఉపాధిమూలమున గలిగినది. ఆ ఉపాధి వాస్తవికమైనది ఏమియును గాదు. ఈశ్వరుని ఉపాధి మహత్తత్త్వాదులకు కారణభూతమైన మాయ. జీవుని ఉపాధి కార్యరూపములగు పంచకోశములు.

ఏతావుపాధీ పరజీవయోస్తయోః
సమ్యఙ్నిరాసే న పరో న జీవః ।
రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటక
స్తయోరపోహే న భటో న రాజా ॥ 246

ఇవి పరమాత్మ జీవాత్మల ఉపాధులు. వీనిని (ఈరెండింటిని) నిరసించుచు పోయినచో పరమాత్మయు నుండదు. జీవాత్మయు నుండడు. ఎట్లనగా రాజ్యము రాజుయొక్క ఉపాధి. డాలు సైనికుని యుపాధి. ఈ రెండు ఉపాధులను లేనివాడు. ఒకడు రాజును గాడు. యోధుడును గాడు.

అథాత ఆదేశ ఇతి శ్రుతిస్స్వయం
నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయమ్ ।
శ్రుతి ప్రమాణానుగృహీతయుక్త్యా
తయోర్నిరాసః కరణీయ ఏవ ॥ 247

బ్రహ్మమందు కల్పితమైన ద్వైతమును 'అథాత ఆదేశో నేతి నేతి' (బృహ 2/3/6) అన్న వాక్యమాదిగా శ్రుతి స్వయముగా నిషేధించుచున్నది. కావున శ్రుతి ప్రమాణానుకూలమయిన యుక్తిచేత పైన పేర్కొనబడిన ఉపాధులను బాధింపవలసినదే. (కాదని త్రోసిపుచ్చవలసినదే).

నేదం నేదం కల్పితత్వాన్న సత్యం
రజ్జౌ దృష్టవ్యాలవత్స్వప్నవచ్చ ।
ఇత్థం దృశ్యం సాధుయుక్త్యా వ్యపోహ్య
జ్ఞేయః పశ్చాదేకభావస్తయోర్యః ॥ 248

రజ్జువునందు గోచరించు సర్పమువలెను, స్వప్నమందు భాసించు వివిధ పదార్థములవలెను ఈదృశ్యము కల్పితమైనదైన కారణమున సత్యముకాదు. ఇట్టి ప్రబలమైన యుక్తులతోనే దృశ్యమును నిషేధించుచు పోవగా కడపటి (జీవాత్మ పరమాత్మ సంబంధమగు) ఏకత్వము ఏది మిగిలియుండునో అదియే తెలియదగిన వస్తువు.

తతస్తు తౌ లక్షణయా సులక్ష్యౌ
తయోరఖండైకరసత్వసిద్ధయే ।
నాలం జహత్యా న తథాఽజహత్యా
కింతూభయార్థాత్మికయైవ భావ్యమ్ ॥ 249

జీవాత్మ పరమాత్మల యఖండైకరసత్వము సిద్ధింపవలెనన్న మహా వాక్యము నందు లక్షణావృత్తిని అనుసరింపవలెను. అప్పుడే వాని పరిజ్ఞానము కలుగును. వాని సమ్యక్పరిజ్ఞానము జహల్లక్షణా వృత్తివలన గాని అజహల్లక్షణా వృత్తి వలన గాని కలుగదు. కాబట్టి యీ యెడ జహల్లక్షణా వృత్తిని ప్రయోగింపవలెను.

స దేవదత్తో౽యమితీహ చైకతా
విరుద్ధధర్మాంశమపాస్య కథ్యతే ।
యథా తథా తత్త్వమసీతి వాక్యే
విరుద్ధధర్మానుభయత్ర హిత్వా ॥ 250

'ఆ దేవదత్తుడు వీడే' అన్న వాక్యములో ('ఆ' అనుటలో పరోక్షత్వము, 'వీడు' అనుటలో అపరోక్షత్వము అను రెండు పరస్పర విరుద్ధ ధర్మాలున్నవి కదా!) ఆ రెండు ధర్మాలను బాధించి దేవదత్తుడుగా ఏకత్వము ఎట్లు ప్రతిపాదింపబడినదో ఆ విధముగనే 'తత్త్వమసి' అను వాక్యములో ('తత్' పదవాచ్యుడైన యీశ్వరుని యుపాధి 'మాయ', 'త్వమ్' పదవాచ్యుడైన జీవుని యుపాధి 'అంతఃకరణము') ఈ రెండింటి యొక్క పరస్పరవిరుద్ధ ధర్మాలను బాధించి (శుద్ధచైతన్యాంశముగా) ఏకత్వము చెప్పబడుచున్నది.

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనోః
అఖండభావః పరిచీయతే బుధైః ।
ఏవం మహావాక్యశతేన కథ్యతే
బ్రహ్మాత్మనోరైక్యమఖండభావః ॥ 251

ఈ విధముగా లక్షణావృత్తి సాయమున జీవాత్మ పరమాత్మలకు సంబంధించిన చేతనాంశము ఒక్కటియే యని నిశ్చయము చేసికొని బుద్ధిమంతుడగువాడు ఆ రెండింటి యఖండభావమునకు సంబంధించిన పరిచయము (ఆ రెండును ఒక్కటియే యన్న జ్ఞానమును) పొందును. ఈ విధముగనే వందల కొలదిగా మహావాక్యముల చేత బ్రహ్మమునకు, ఆత్మకు ఆఖండభావము, ఏకత్వము స్పష్టముగా చెప్పబడినది.

## బ్రహ్మ భావన

అస్థూలమిత్యేతదసన్నిరస్య
సిద్ధం స్వతో వ్యోమవదప్రతర్క్యమ్ ।

యతో మృషామాత్ర మిదం ప్రతీతం
జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్ ।
బ్రహ్మా-హమిత్యేవ విశుద్ధబుద్ధ్యా
విద్ధి స్వమాత్మానమఖండబోధమ్ ॥ 252

'అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘమ్' అను నీ శ్రుతివాక్యమాదిగా గలవానిచే (బృహ. 3/8/7) అసత్తు, స్థూలత్వము మొదలైన వానిని నిరసించుచు పోవగా కడకు ఆకాశమువలె వ్యాపకమైన అతర్క్య(ఊహమున కందని) వస్తువు స్వయముగనే సిద్ధించును. కాబట్టి ఆత్మ రూపముగా గ్రహింపబడిన యీ దేహాదులు ఎల్ల మిథ్యగానే ప్రతీతములగును. వీనియందు ఆత్మభావమును వీడుము. 'నేను బ్రహ్మమును' అనునట్టి శుద్ధబుద్ధితో అఖండబోధ స్వరూపమగు నీ యాత్మను గుర్తింపుము.

మృత్కార్యం సకలం ఘటాది సతతం మృణ్మాత్రమేవాభితః
తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్ ।
యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం స ఆత్మా స్వయం
తస్మాత్తత్త్వమసి ప్రశాంతమమలం బ్రహ్మాద్వయంయత్పరమ్ ॥ 253

మృత్తికాకార్యములగు ఘటాదులన్నియు సర్వవిధముల మృత్తికాస్వరూపములే యగును. అట్లే సత్తు వలన ఆవిర్భవించి సత్తుయొక్క రూపమైన యీ జగత్తు అంతయు సత్తు మాత్రమే యగును. ఏలయనగా సత్తుకంటె భిన్నముగా, (దానికి అతీతముగా) నున్న వస్తువు ఏదియును లేనేలేదు. కావున అదియే సత్యము. అదియే ఆత్మ. కాబట్టి శాంతము, నిర్మలము, అద్వితీయము నగు పరబ్రహ్మము ఏది కలదో అది నీవే యగుదువు.

నిద్రాకల్పితదేశకాలవిషయజ్ఞాత్రాది సర్వం యథా
మిథ్యా తద్వదిహాపి జాగ్రతిజగత్స్వాజ్ఞానకార్యత్వతః ।
యస్మాదేవమిదం శరీరకరణ ప్రాణాహమాద్యప్యసత్
తస్మాత్తత్త్వమసి ప్రశాంతమమలం బ్రహ్మాద్వయం యత్పరమ్ ॥ 254

స్వప్నమందు నిద్రచే కల్పించబడిన దేశ-కాల-విషయములు, జ్ఞాత ఆదిగా గలది ఎల్ల మిథ్యయే యగును. ఆవిధముగనే జాగ్రదవస్థయందు కూడ అజ్ఞానముచేత కల్పించబడినది యగుట చేత జగత్తు కూడ మిథ్యయే యగును. ఈవిధముగనే శరీరము, ఇంద్రియములు, ప్రాణములు, అహంకారము ఆదిగా గలవన్నియు గూడ అసత్యములే. కాబట్టి శాంతము, నిర్మలము, అద్వితీయము నగు పరబ్రహ్మము నీవే.

(ఈ 254వ శ్లోకము తరువాత 'లక్ష్మీనారాయణ ప్రెస్సు, మురాదాబాదు' వారి ప్రతిలో అధికముగా క్రింది శ్లోకమున్నది.

యత్ర భ్రాంత్యా కల్పితం తద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్ ।
స్వప్నే నష్టే స్వప్నవిశ్వం విచిత్రం
స్వస్మాద్భిన్నం కిన్ను దృష్టం ప్రబోధే ॥

ఎందు ఒక వస్తువు భ్రాంతిచేత కల్పితమగునో అందు అది విచారణము చేసిన మీదట తద్రూపమైనదిగానే ప్రతీతమగును. కాని తద్భిన్నమైనదిగా ప్రతీతముగాదు. స్వప్నము సమాప్తమైన వేళ జాగ్రదవస్థయందు ఆ విచిత్రమైన స్వప్న ప్రపంచము తనకంటె భిన్నముగా గోచరించునా?

జాతినీతికులగోత్రదూరగం
నామరూపగుణదోషవర్జితమ్ ।
దేశకాలవిషయాతివర్తి యత్
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 255

జాతి, నీతి, కుల, గోత్రములకు అతీతముగా, నామరూప గుణ దోషరహితమై, దేశ-కాల-వస్తువుకంటె భిన్నముగా నుండు బ్రహ్మమవు నీవే యని నీ యంతఃకరణములో భావన చేయుచుండుము!

యత్పరం సకల వాగగోచరం
గోచరం విమలబోధచక్షుషః ।

శుద్ధచిద్ఘనమనాదివస్తు యత్
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 256

ప్రకృతికి అతీతమై, వాక్కునకు అందనిదై, నిర్మలమైన జ్ఞానదృష్టికి గోచరించునదియై, శుద్ధము, చిద్ఘనము, అనాదియు నగు బ్రహ్మ పదార్థము ఏది కలదో అది నీవే యని యంతఃకరణములో భావించుకొనుము!

షడ్భిరూర్మిభిరయోగియోగిహృత్
భావితం న కరణైర్విభావితమ్ ।
బుద్ధ్యవేద్యమనవద్యభూతి యత్
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 257

క్షుత్తు, పిపాస మున్నగు షడూర్ములు లేనిది, యోగిజనుల చేత హృదయములందు ధ్యానింపబడునది, ఇంద్రియముల చేత గ్రహింపబడజాలనిది, బుద్ధికి అందనిది, మహైశ్వర్యయుక్తమైనదియు నగు బ్రహ్మపదార్థమవు నీవే యని మనస్సులో భావించుకొనుము!

భ్రాంతికల్పితజగత్కలాశ్రయం
స్వాశ్రయం చ సదసద్విలక్షణమ్ ।
నిష్కలం నిరుపమాన మృద్ధిమత్
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 258

భ్రాంతిచేత కల్పితమైన యీ జగద్రూపమగు కళకు ఆధారమైనది, తనకు తానే యాశ్రయ మగునది, సత్తు, అసత్తు అను రెండింటికంటె భిన్నముగా నుండునది, అవయవరహితము, ఉపమానరహితము, పరమైశ్వర్యసంపన్నము నగు ఆ పరబ్రహ్మమవు నీవే యని చిత్తములో చింతనము చేయుము!

జన్మవృద్ధి పరిణత్యపక్షయ
వ్యాధినాశనవిహీనమవ్యయమ్ ।

విశ్వసృష్ట్యవనఘాతకారణం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని । 259

జన్మ, వృద్ధి, పరిణతి (మార్పు) అపక్షయము, వ్యాధి, నాశము నను షడ్వికారములు లేనిది, వినాశ మందనిది, విశ్వము యొక్క సృష్టి స్థితిలయమునకు కారణమైనదియు నగు బ్రహ్మమవు నీవే యని నీ మనసులో భావించుకొనుము!

అస్తభేదమనపాస్తలక్షణం
నిస్తరంగజలరాశినిశ్చలమ్ ।
నిత్యయుక్తమవిభక్తమూర్తి యత్
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 260

భేదరహితము, పరిణామరహితము, నిస్తరంగ సముద్రము వలె నిశ్చలము, నిత్యముక్తము, విభాగరహితమునగు బ్రహ్మమవు నీవే యని మనసులో భావన చేయుము!

ఏకమేవ సదనేకకారణం
కారణాంతరనిరాసకారణమ్
కార్యకారణవిలక్షణం స్వయం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని । 261

తాను ఒక్కటియే యైయుండియు అనేకములకు కారణమగునది, అన్యకారణముల నెల్ల నిషేధించుటకు కారణభూత మగునది, తాను మాత్రము కార్యకారణముల రెండింటి కంటెను భిన్నముగా నుండునదియు నగు బ్రహ్మ పదార్థమవు నీవేయని మనములో మననము చేసికొనుము!

నిర్వికల్పకమనల్పమక్షరం
యత్క్షరాక్షరవిలక్షణం పరమ్ ।
నిత్యమవ్యయసుఖం నిరంజనం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 262

నిర్వికల్పము, మహత్తరము, నాశరహితమునై క్షరాక్షరములు (శరీరము,జీవుడు) రెండింటికంటెను భిన్నమైనది, నిత్యమై, అవ్యయమై, ఆనందస్వరూపమై, నిష్కలంకమై యొప్పు బ్రహ్మమవు నీవేయని హృదయములో భావించుకొనుము!

యద్విభాతి సదనేకధా భ్రమా
న్నామరూపగుణ విక్రియాత్మనా ।
హేమవత్ స్వయమవిక్రియం సదా
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 263

ఏది సర్వదా సత్తు అయి సువర్ణమువలె నిర్వికారముగా నుండియు భ్రాంతి వశమున (ఆ సువర్ణవికారములగు కటక కుండలాదులవలె) నానావిధ నామరూపగుణ వికారముల రూపమున భాసిల్లుచుండునో ఆ బ్రహ్మమునే నీవు అని చిత్తములో చింతనము చేయుము!

యచ్చకాస్త్యనపరం పరాత్పరం
ప్రత్యగేకరసమాత్మలక్షణమ్ ।
సత్యచిత్సుఖమనంతమవ్యయం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని ॥ 264

తనకంటె పరమైనది ఏదియు లేనిదై, తానే పరము కంటెను (అవ్యక్తప్రకృతి కంటెను) పరమైనదై, ప్రత్యగ్రూపమై, ఏకరసమై, సర్వాంతరాత్మయై, సచ్చిదానంద స్వరూపమై, అనంతము, అవ్యయమునగు బ్రహ్మ పదార్థము నీవే యని నీ యంతఃకరణములో భావించుకొనుము!

ఉక్తమర్థమిమమాత్మని స్వయం
భావయ ప్రథితయుక్తిభిర్ధియా ।
సంశయాదిరహితం కరాంబువత్
తేన తత్త్వనిగమో భవిష్యతి ॥ 265

ముందు చెప్పిన యీ విషయమును నీ బుద్ధిచేత (వేదాంత

సంబంధమగు) ప్రసిద్ధిములగు యుక్తుల మూలమున స్వయముగా మనములో విచారణ మొనర్పుము! అట్లు చేసినచో హస్తగతమైన జలమువలె సంశయవిపర్యయరహితమైన తత్త్వబోధము కలుగును.

స్వం బోధమాత్రం పరిశుద్ధతత్త్వం
విజ్ఞాయ సంఘే నృపవచ్చ సైన్యే ।
తదాత్మనైవాత్మని సర్వదా స్థితో
విలాపయ బ్రహ్మణి దృశ్యజాతమ్ ॥ 266

సైన్యము నడుమనున్న మహారాజువలె భూతముల సంఘాతరూపమగు ఈ శరీరము మధ్యమందు ఉన్న స్వయంప్రకాశరూపమైన విశుద్ధ తత్త్వమును తెలిసికొని సర్వదా తన్మయభావముతో నుండుచు దృశ్యవర్గము నంతను ఆ బ్రహ్మమునందే విలీనము చేయుము!

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయమ్ ।
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం
పునర్న తస్యాంగగుహాప్రవేశః ॥ 267

సత్తు, అసత్తులకంటె విలక్షణమై, అద్వితీయమై, సత్యమైన యా పరబ్రహ్మము బుద్ధిరూపగుహయందు విరాజిల్లుచున్నది. ఈ గుహయందు ఆ పరబ్రహ్మము తోడ ఏకరూపుడై యుండువాడు మరల ఈ శరీర రూపమైన గుహలో ప్రవేశింపడు. (అనగా అతడు మరల జన్మను పొందడు)

## వాసనా పరిత్యాగము

జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనాఽనాదిరేషా
కర్తా భోక్తాప్యహమితి దృఢా యాస్య సంసారహేతుః ।
ప్రత్యగ్దృష్ట్యాత్మని నివసతా సాఽపనేయా ప్రయత్నాత్
ముక్తిం ప్రాహుస్తదిహ మునయో వాసనాతానవం యత్ ॥ 268

ఆత్మ వస్తు పరిజ్ఞానము కలిగినను 'నేను కర్తను, నేను భోక్తను' అనునట్టి రూపములో దృఢముగా నిలిచియుండి (జనన మరణ రూపమగు) సంసారమునకు కారణమైనట్టి ప్రబలమైన అనాదివాసన యేది కలదో దానిని ప్రత్యగ్దృష్టితో (ఆంతరిక దృష్టి) ఆత్మ స్వరూపమునందు స్థితుడై యుండి మానవుడు ప్రయత్నపూర్వకముగా తొలగించికొనవలయును. ఏలయనగా లోకములో వాసన క్షీణించుటనే మునులు ముక్తి యని తెలిపినారు.

**అహం మమేతి యో భావో దేహాక్షాదావనాత్మని ।**
**అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషాస్వాత్మనిష్ఠయా । 269**

దేహేంద్రియాదులయందు జీవునకు నేను, నాది యను అహంకార, మమకారభావములు ఏవి కలవో దానినే అధ్యాసము అందురు. పండితుడైనవాడు ఆత్మనిష్ఠ మూలమున ఈ యధ్యాసదోషమును తొలగించికొనవలయును.

**జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తిసాక్షిణమ్ ।**
**సోఽహమిత్యేవ సద్వృత్త్యాఽనాత్మన్యాత్మమతిం జహి । 270**

ప్రత్యగాత్మ స్వరూపుడైన తాను తనను బుద్ధికి, దాని వృత్తులకును సాక్షిగా నెఱిగి 'అది నేను' (ఆ బ్రహ్మ పదార్థమును నేను) అనునట్టి సమీచీనమైన వృత్తిని అవలంబించి దాని సాయమున అనాత్మవస్తువులందు విస్తరించిన యాత్మబుద్ధిని పరిహరింపవలెను.

**లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనమ్ ।**
**శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు ॥ 271**

లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన- ఈ మూడింటిని వీడి ఆత్మయందు ఏర్పడిన సంసారసంబంధమైన అధ్యాసమును వీడుము!

**లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాపి చ ।**
**దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే ॥ 272**

లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన - ఈ మూడింటి మూలముగానే జీవునకు కలుగవలసిన విధముగా జ్ఞానము కలుగకుండును.

సంసారకారాగృహమోక్షమిచ్ఛోః
అయోమయం పాదనిబద్ధశృంఖలమ్ ।
వదంతి తజ్ఞాం పటువాసనాత్రయం
యోఽస్మాద్విముక్తః సముపైతి ముక్తిమ్ ॥ 273

బ్రహ్మవేత్తలైన పురుషులు ప్రబలమైన యీ వాసనాత్రయమును సంసారమను కారాగారమునుండి విముక్తిని పొందగోరువాని పాదములందు తగిలియున్న యినుపసంకెల యని చెప్పియున్నారు. కాబట్టి దీనినుండి విముక్తి పొందినవాడు మాత్రమే మోక్షమును పొందును.

జలాదిసంపర్క వశాత్ప్రభూత
దుర్గంధధూతాగరు దివ్యవాసనా ।
సంఘర్షణేనైవ విభాతి సమ్యక్
విధూయమానే సతి బాహ్యగంధే ॥ 274

అంతశ్శ్రితానంతదురంతవాసనా
ధూళీవిలిప్తా పదమాత్మవాసనా ।
ప్రజ్ఞాతి సంఘర్షణతో విశుద్ధా
ప్రతీయతే చందనగంధవత్స్ఫుటా ॥ 275

జలాదుల సంపర్కము కారణముగా(ఏదియో అన్యమైన) దుర్గంధ భూయిష్టమైన పదార్థము చేత ఆచ్ఛాదితమై లోపల నణగియున్న అగరువు యొక్క దివ్య సుగంధము ఆ పదార్థమును అరుగదీసియో, తోమియో తొలగించిన మీదట మఱల ఎట్లు స్పష్టముగా బహిర్గతము కాసాగునో అట్లే యంతఃకరణమందు నెలకొన్న తదితరములైన దుష్టవాసనలు అనుధూళిచేత నాచ్ఛాదితమైయున్న పరమాత్మ వాసన బుద్ధియొక్క తీవ్రసంఘర్షము (ఒరవడి) చేత ఆ యాచ్ఛాదనము తొలగిపోవగా పరిశుద్ధమై చందనగంధమువలె స్పష్టముగా ప్రతీతము కాసాగును.

**అనాత్మవాసనాజాలైస్తిరోభూతాత్మవాసనా ।**
**నిత్యాత్మనిష్ఠయా తేషాం నాశే భాతి స్వయం స్ఫుటా॥ 276**

(ఆత్మ కాని వాని వాసనలు) అనాత్మ వాసనల చేత ఆత్మ వాసన తిరోహితమై యున్నది. కావున నిరంతరము ఆత్మనిష్ఠ వహించి యుండుట వలన ఆ యనాత్మవాసనలు నశించుటయు, అప్పుడు ఆత్మ వాసన స్పష్టముగా ప్రతీతమగుటయు సంభవమగును.

**యథా యథా ప్రత్యగవస్థితం మనః**
**తథా తథా ముంచతి బాహ్యవాసనాః ।**
**నిశ్శేషమోక్షే సతి వాసనానాం**
**ఆత్మానుభూతిప్రతిబంధశూన్యా ॥ 277**

మనస్సు ఎంత యెంతగా అంతర్ముఖమగుచుండునో అంతయంతగా బాహ్యవాసనలను విడనాడుచుండును. వాసనలు నిశ్శేషముగా ముక్తములైనప్పుడు ప్రతిబంధరహితమైన యాత్మానుభవము కలుగనారంభించును.

## అధ్యాస నిరాసము

**స్వాత్మన్యేవ సదా స్థిత్వా మనో నశ్యతి యోగినః ।**
**వాసనానాం క్షయశ్చాతః స్వాధ్యాసాపనయం కురు ॥ 278**

(చిత్తవృత్తులను నిరోధించుకొని) నిరంతరము ఆత్మ స్వరూపమునందే స్థితుడై యుండుట వలన యోగియైన వాని మనస్సు నశించును. వాసనలు క్షీణించును. కావున (ఓ సాధకుడా!) నీ యధ్యాస దోషమును నివృత్తమును జేసికొనుము!

**తమో ద్వాభ్యాం రజస్సత్త్వాత్సత్త్వం శుద్ధేననశ్యతి।**
**తస్మాత్సత్త్వమవష్టభ్య స్వాధ్యాసాపనయం కురు ॥ 279**

రజోగుణము, సత్త్వగుణము - ఈ రెండింటి చేత తమోగుణమును,

సత్త్వగుణము వలన రజోగుణమును, శుద్ధసత్త్వము వలన సత్త్వగుణమును నశించును. కావున శుద్ధసత్త్వము నాశ్రయించి నీ యధ్యాసమును విడనాడుము!

ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చలః ।
ధైర్యమాలంబ్య యత్నేన స్వాధ్యాసాపనయంకురు॥ 280

ప్రారబ్ధమే శరీరమును పోషించును అని నిశ్చయించికొని నిశ్చల భావముతో ధైర్యము వహించి సప్రయత్నముగా అధ్యాసమును వీడుము!

నాహం జీవః పరంబ్రహ్మేత్యతద్వ్యావృత్తిపూర్వకమ్ ।
వాసనావేగతః ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు ॥ 281

నేను జీవుడను కాను, పరబ్రహ్మను అని యీ విధముగా నీలో జీవభావమును నిషేధించికొనుచు వాసనాత్రయము యొక్క తీవ్రత వలన ప్రాప్తమైన జీవత్వమునకు సంబంధించిన అధ్యాసమును వీడుము!

శ్రుత్యా యుక్త్యా స్వానుభూత్యాజ్ఞాత్వా సార్వాత్మ్యమాత్మనః ।
క్వచిదాభాసతః ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు ॥ 282

శ్రుతి చేతను, యుక్తిచేతను, స్వానుభవము చేతను ఆత్మయొక్క సర్వాత్మకత్వమును గుర్తించి యెప్పుడో భ్రాంతి వశమున ప్రాప్తమైన నీ యధ్యాసమును వీడుము!

అనాదానవిసర్గాభ్యామీషన్నాస్తి క్రియా మునేః ।
తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయంకురు ॥ 283

బోధవంతుడైన మునికి ఒక వస్తువు గ్రాహ్యము, త్యాజ్యము కూడ కాని కారణమున కర్తవ్యము ఏదియు నుండదు. కావున నిరంతరముగా ఆత్మనిష్ఠ వహించి ఆత్మయందు కలిగిన యధ్యాసమును త్యజింపుము.

తత్త్వమస్యాది వాక్యోత్థబ్రహ్మాత్మైకత్వబోధతః ।
బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయం కురు ॥ 284

'తత్త్వమసి' (ఛాందోగ్య. 6/8) ఆదిగా గల మహావాక్యముల వలన గలిగిన బ్రహ్మము యొక్కయు, ఆత్మయొక్కయు ఏకత్వ పరిజ్ఞానముతో బ్రహ్మము నందు ఆత్మబుద్ధిని బలపఱచుకొనుటకై నీ యధ్యాసమును తొలగించికొనుము!

**అహంభావస్య దేహేఽస్మిన్ నిశ్శేషవిలయావధి ।**
**సావధానేన యుక్తాత్మా స్వాధ్యాసాపనయం కురు! ॥ 285**

ఈ శరీరమందు కలుగుచున్న 'నేను' అనునట్టి యహంభావము నిశ్శేషముగా సమసిపోవనంత వఱకు యుక్తమైన చిత్తముతో సావధానముగా నీ యధ్యాసమును తొలగించికొనుచుండుము!

**ప్రతీతిర్జీవజగతోః స్వప్నవద్భాతి యావతా ।**
**తావన్నిరంతరం విద్వన్ స్వాధ్యాసాపనయం కురు ॥ 286**

జీవుడు, జగత్తు - రెండును ఒక స్వప్నమువలె గోచరించునంతవఱకు ఓ విద్వాంసుడా! నీయాత్మలో ఏర్పడిన యీ యధ్యాసమును నిరంతమును తొలగించికొనుచునే యుండుము!

**నిద్రాయా లోకవార్తాయాశ్శబ్దాదేరపి విస్మృతేః ।**
**క్వచిన్నావసరం దత్వా చింతయాత్మానమాత్మని ॥ 287**

నిద్ర, లౌకిక సంభాషణము, శబ్దాదులు - వీనిలో దేనివలనను కూడ ఆత్మను విస్మరించుటకు అవకాశమును కల్పించక నిరంతరము నీయంతఃకరణమందు ఆత్మ చింతనము చేయుచుండుము!

**మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయంవపుః ।**
**త్యక్త్వా చాండాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీభవ ॥ 288**

తల్లిదండ్రుల మలము (రేతస్సు) వలన ప్రాదుర్భవించి మలమాంస భరితమైన యీ శరీరమును చండాలునితో సమానమైనదని యెంచి దూరముగా పరిత్యజించి బ్రహ్మభావమును పొంది కృతకృత్యుడవు కమ్ము!

ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని ।
విలాప్యాఖండభావేన తూష్ణీం భవ సదామునే ॥ 289

ఓ మునీ! (ఘటము నశింపగా) ఘటాకాశము మహాకాశములో కలిసిపోవును. అట్లే జీవాత్మను పరమాత్మయందు లయమొనర్చి సర్వదా అఖండ బ్రహ్మభావము దాల్చి మౌనముగా నుండుము!

స్వప్రకాశమధిష్ఠానం స్వయంభూయ సదాత్మనా ।
బ్రహ్మాండమపి పిండాండం త్యజతాం మలభాండవత్ ॥ 292

జగత్తునకు అధిష్ఠాతయైన పరబ్రహ్మస్వయంప్రకాశమానుడు. ఆ సత్స్వరూపమునందు ఆత్మను లయమొనర్చి, పిండ శరీరము, బ్రహ్మాండము అను ఉపాధులను మలపూరిత భాండమువలె త్యజించుము.

చిదాత్మని సదానందే దేహారూఢా మహంధియమ్ ।
నివేశ్య లింగముత్సృజ్య కేవలో భవ సర్వదా ॥ 291

దేహమందు వ్యాప్తమైయున్న అహంబుద్ధిని నిత్యానంద స్వరూపమగు చిదాత్మయందు ప్రవేశపెట్టి లింగశరీరముపై అభిమానమును వీడి సర్వదా కేవలుడవై (అద్వితీయుడవై) యుండుము!

యత్రైష జగదాభాసో దర్పణాంతఃపురం యథా ।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి ॥ 292

అద్దమందు ప్రతిబింబితమైన నగరమువలె ఈ జగత్తు యొక్క ఆభాసము ఎందు కలుగుచున్నదో ఆ బ్రహ్మమును నేనే యని తెలిసికొన్న మీదట నీవు కృతకృత్యుడవు కాగలవు.

యత్సత్యభూతం నిజరూపమాద్యం
చిదద్వయానందమరూపమక్రియమ్ ।
తదేత్య మిథ్యావపురుత్సృజైతత్
శైలూషవద్వేషముపాత్తమాత్మనః ॥ 293

చేతనము, అద్వితీయము, ఆనందస్వరూపము, నిష్క్రియమునగు బ్రహ్మము సత్యమైనది. నీయొక్క ఆద్య(మౌలిక) స్వరూపమైనది. దానిని పడసి నటునివలె నీవు ధరించిన యీ శరీరము అను వేషమును మిథ్యయని ఎఱిగి అందు ఆసక్తిని వీడుము!

## అహంపదార్థ నిరూపణము

సర్వాత్మనా దృశ్యమిదం మృషైవ
నైవాహమర్థః క్షణికత్వదర్శనాత్ ।
జానామ్యహం సర్వమితి ప్రతీతిః
కుతోఽహమాదేః క్షణికస్య సిద్ధ్యేత్ ॥294

ఈ దృశ్యజగత్తు సర్వవిధముల మిథ్య. దీని క్షణికత్వము కానవచ్చుచునే యున్నది. కావున ఇది అహంపదార్థము కాదు. కాబట్టి యీ క్షణికమైన అహంకారాదికమునకు 'సర్వము నేనెఱుగుదును' అనునట్టి ప్రతీతి ఎట్లు కలుగగలదు?

అహం పదార్థస్త్వహమాది సాక్షీ
నిత్యం సుషుప్తావపి భావదర్శనాత్ ।
బ్రూతే హ్యజో నిత్య ఇతి శ్రుతిస్స్వయం
తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః ॥ 295

అహం పదార్థము అహంకారాదులకు సాక్షి. ఏలయనగా దాని సత్తా (ఉనికి) సుషుప్తి దశలో కూడ గోచరించుచునే యుండును. స్వయముగా శ్రుతి కూడ దానిని 'అజో నిత్యః' అని చెప్పుచున్నది. కావున అది ప్రత్యగాత్మ. సత్తు, అసత్తులకంటె భిన్నమైనది. విలక్షణమైనది.

వికారిణాం సర్వవికారవేత్తా
నిత్యోఽవికారో భవితుం సమర్హతి ।

మనోరథస్వప్నసుషుప్తిషుస్ఫుటం
పునఃపునర్దృష్టమసత్త్వమేతయోః ॥ 296

అహంకారమాదిగా గల వస్తువుల సమస్త వికారములను ఎఱుగువాడు నిత్యము వికారరహితుడుగానే యుండవలయును. మనోరథము, స్వప్నము, సుషుప్తి - ఈ మూడింటియందును ఈ స్థూలసూక్ష్మ శరీరములు రెండింటియొక్క ఆభావము పర్యాయముగా స్పష్టముగా చూడబడినది. (కాబట్టి యివి 'అహం పదార్థమగు ఆత్మ' యెట్లు కాగలవు?)

అతోఽభిమానం త్యజ మాంసపిండే
పిండాభిమానిన్యపి బుద్ధికల్పితే ।
కాలత్రయాబాధ్యమఖండబోధం
జ్ఞాత్వా స్వమాత్మానముపైహి శాంతిమ్ ॥ 297

కావున ఈ మాంసపిండమునందు, ఈ బుద్ధిచేత కల్పింపబడి అభిమానవంతుడైన జీవునియందు అహంబుద్ధిని వీడుము! నీ యాత్మను త్రికాలాబాధితమైనదని అఖండజ్ఞానస్వరూపమని యెఱిగి శాంతిని పొందుము.

త్యజాభిమానం కులగోత్రనామ
రూపాశ్రమేష్వార్ద్రశవాశ్రితేషు ।
లింగస్య ధర్మానపి కర్తృతాదీన్
త్యక్త్వా భవాఖండసుఖస్వరూపః ॥ 298

కావున తడితడిగాను, జిడ్డుజిడ్డుగాను ఉండు మాంసపిండమును ఆశ్రయించియున్న కులము, గోత్రము, నామము, రూపము, ఆశ్రయము - వీనిపై అభిమానమును వీడుము! కర్తృత్వము, భోక్తృత్వము ఆదిగా లింగదేహమునకు సంబంధించిన ధర్మముల నన్నిటిని వీడి ఆఖండానంద స్వరూపుడవు కమ్ము!

## అహంకార నింద

సంత్యన్యే ప్రతిబంధాః పుంసఃసంసారహేతవోదృష్టాః।
తేషామేకం మూలం ప్రథమవికారో భవత్యహంకారః ॥ 299

పురుషునకు ఈ సంసారబంధనము ప్రాప్తించుటకు కారణభూతములైన ప్రతిబంధములు ఇంకను అనేకములు కలవు. కాని ఆ యన్నిటికిని మూలమైన ప్రథమ వికారము అహంకారమే. (ఏలయన అన్యములైన అనాత్మభావము లన్నియు దీనినుండియే పుట్టుకొని వచ్చును.)

యావత్స్యాత్స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా ।
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా ॥ 300

ఈ దుష్టమైన అహంకారముతోడ ఆత్మకు సంబంధముండునంత వఱకు ముక్తివంటి విలక్షణ విషయము మీద లేశమాత్రమును ఆశపెట్టుకొన నక్కఱలేదు.

అహంకారగ్రహాన్ముక్తః స్వరూపముపపద్యతే ।
చంద్రవద్విమలః పూర్ణః సదానందస్స్వయంప్రభః ॥ 301

అహంకారమను గ్రహమునుండి విముక్తుడైన మీదట ఆత్మ చంద్రునివలె నిర్మలము, పూర్ణము, స్వయంప్రకాశమునై స్వస్వరూపమును పొందును.

యో వా పురే సోఽహమితి ప్రతీతో
బుద్ధ్యాదిక్లుప్తస్తమసాతిమూఢయా ।
తస్యైవ నిశ్శేషతయా వినాశే
బ్రహ్మాత్మభావః ప్రతిబంధశూన్యః ॥ 302

అజ్ఞానవశమున అత్యంతము మోహితమైన బుద్ధిచేత కల్పితమై యీ శరీరమందు 'ఇదియే నేను' అనునట్టి ప్రతీతి యేది కలుగుచున్నదో అది పూర్తిగా నశించిపోయిన మీదట బ్రహ్మమందు బాధారహితముగా ఆత్మభావ మేర్పడును.

బ్రహ్మానందనిధిర్మహాబలవతాహంకారఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతేగుణమయైశ్చండైస్త్రిభిర్మస్తకైః ।
విజ్ఞానాఖ్యమహాసినా ద్యుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః ॥ 303

బ్రహ్మానందమను పరమధనమును, అహంకారమను మహాభయంకర సర్పము సత్త్వరజస్తమోగుణములను మూడు భయంకరములైన మస్తకములతో పరివేష్టించి మరుగుపరచి యుంచినది. వివేకవంతుడు అయిన పురుషుడు ఎవడైన, అనుభవజ్ఞానము అను తళతళ మెరయు ఖడ్గముతో ఆ మస్తకములను ఖండించివైచి యా సర్పమును నశింపజేయగలుగునేని అతడు పరమానందదాయకమగు ఆ సంపదను అనుభవించగలుగును.

యావద్వా యత్కించిద్విషదోషస్ఫూర్తిరస్తిచేద్దేహే ।
కథమారోగ్యాయ భవేత్తద్వదహంతాఽపి యోగినో ముక్త్యై ॥ 304

శరీరమందు విషదోషము ఏ కొంచెము మిగిలియున్నను అది యారోగ్యమునకు ప్రతిబంధకమే యగును. అట్లే యోగియందు అహంకారము ఏ కొంచెము మిగిలియున్నను అది యాతని ముక్తిమార్గమందు అవరోధమై నిలుచును.

అహమోఽత్యంతనివృత్త్యా తత్కృతనానావికల్పసంహృత్యా ।
ప్రత్యక్తత్త్వవివేకాదాయమహమస్మీతి విందతే తత్త్వమ్ ॥ 305

అహంకారము నిశ్శేషముగా నివృత్తము కాగా దానివలన ఉద్భవించు వికల్పము లన్నియు నశించిపోయిన మీదట ఆత్మతత్త్వ వివేకము కలుగుటయు, తన్మూలమున 'ఈ ఆత్మను నేను' యనునట్టి తత్త్వబోధము కలుగుటయు సంభవమగును.

అహంకర్తర్యస్మిన్నహమితి మతిం ముంచ సహసా
వికారాత్మన్యాత్మప్రతిఫలజుషి స్వస్థితిముషి ।

యదధ్యాసాత్ప్రాప్తా జనిమృతిజరాదుఃఖబహులా
ప్రతీచశ్చిన్మూర్తేస్తవ సుఖతనోః సంసృతిరియమ్ ॥ 306

వికారాత్మకమై ఆత్మప్రతిబింబయుక్తమై, స్వస్థితిని హరించునట్టి యీ అహంకారియగు దేహాదికమందు 'అహం' 'నేను' అను భావము వీడుము. దీనియందలి యీ అధ్యాసము కారణముగానే ఆనందమూర్తివి, చైతన్యరూపుడవు, ప్రత్యగాత్మవునగు నీకు జననమరణ వార్ధక్యాది నానావిధ దుఃఖములతో నిండియున్న యీ సంసారబంధనము ప్రాప్తమైనది.

సదైకరూపస్య చిదాత్మనో విభోః
ఆనందమూర్తేరనవద్యకీర్తేః ।
నైవాన్యథా క్వాప్యవికారిణస్తే
వినాఽహమధ్యాసమముష్య సంసృతిః ॥ 307

ఈ యహంకారరూపమగు అధ్యాసము లేనివాడు ఏకరూపుడవు, చిదాత్మవు, వ్యాపకుడవు, పవిత్రయశస్కుడవు, అవికారివి, ఆత్మ స్వరూపుడవునగు నీకు ఏవిధముగను కూడ సంసారబంధము ప్రాప్తించదు.

తస్మాదహంకారమిమం స్వశత్రుం
భోక్తుర్గలే కంటకవత్ప్రతీతమ్ ।
విచ్ఛిద్య విజ్ఞానమహాసినా స్ఫుటం
భుంక్ష్వాత్మ సామ్రాజ్యసుఖం యథేష్టమ్ ॥ 308

కావున ఓ పండితుడా! భోజనము చేయువాని కంఠములో ముల్లు ఎట్లు బాధించునో అట్లు బాధించునట్టి అహంకారమను నీ శత్రువును విజ్ఞానమను మహాఖడ్గముతో ఛేదించి యథేష్టముగా ఆత్మసామ్రాజ్యసుఖము ననుభవింపుము!

తతోఽహమాదేర్వినివర్త్య వృత్తిం
సంత్యక్తరాగః పరమార్థలాభాత్ ।

తూష్ణీం సమాస్స్వాత్మసుఖానుభూత్యా
పూర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః ॥ 309

పిమ్మట అహంకారాదులయందు కర్తృత్వభోక్తృత్వాది వృత్తులను తొలగించుకొని పరమాత్మతత్త్వమును పొందుట మూలమున రాగరహితుడవై ఆత్మానందానుభవ పూర్వకముగా పూర్తిగా బ్రహ్మభావమునందు స్థిరుడవై యుండి నిర్వికల్పుడవై మౌనము వహించి యూరకుండుము!

సమూలకృత్తోఽపి మహానహం పునః
వ్యుల్లేఖిత స్స్యాద్యది చేతసా క్షణమ్ ।
సంజీవ్య విక్షేపశతం కరోతి
నభస్వతా ప్రావృషి వారిదో యథా ॥ 310

ప్రబలమైన యీ అహంకారము మొదలంట నిర్మూలించి వేయబడినను, చిత్తముతోడ సంపర్కము ఒక్క క్షణకాలము ప్రాప్తమైనను చాలును. అది మఱల ప్రకటమై వందలాదిగా ఉత్పాతములను సృష్టించును. వానకాలమందు వాయుసంపర్కము నందిన మేఘమువలె ఉత్పాతములను తెచ్చిపెట్టును.

## క్రియా, చింతా, వాసనల పరిత్యాగము

నిగృహ్య శత్రోరహమోఽవకాశః
క్వచిన్నదేయో విషయానుచింతయా ।
స ఏవ సంజీవనహేతురస్య
ప్రక్షీణజంబీరతరోరివాంబు ॥ 311

ఈ అహంకారరూపశత్రువును నిగ్రహించివైచికొన్న మీదట విషయ చింతన మూలకముగా దీనికి మఱల తలయెత్తుటకు అవకాశమును ఎన్నడును కల్పింపరాదు. ఏలయనగా క్షీణదశకు చేరిన నిమ్మచెట్టునకు నీరు ఎట్లు పునరుజ్జీవన కారణముగనో అట్లే విషయ చింతనము అహంకారము యొక్క పునరుజ్జీవనమునకు కారణమగును.

దేహాత్మనా సంస్థిత ఏవ కామీ
విలక్షణః కామయితా కథం స్యాత్ ।
అతోఽర్థసంధానపరత్వమేవ
భేదప్రసక్త్యా భవబంధహేతుః ॥ 312

దేహాత్మబుద్ధి కలవాడు ఎవడో వాడే కామి. అనగా కోరికలు గలవాడు. ఆత్మ దేహముతో సంబంధము లేనిది. విలక్షణమైనది. అది కామనలు కలది యెట్లగును? కావున భేదాసక్తికి కారణమగుట చేత విషయచింతనమందు ప్రవర్తిల్లుటయే సంసారబంధమునకు హేతువగును.

కార్యప్రవర్ధనాద్బీజప్రవృద్ధిః పరిదృశ్యతే ।
కార్యనాశాద్బీజనాశస్తస్మాత్కార్యం నిరోధయేత్ ॥ 313

కార్యము పెరిగిన కొలదియు బీజము కూడ పెరుగుట కానవచ్చుచున్నది. కార్యము నశించిన బీజము కూడ నశించిపోవును. కావున కార్యమునే నశింపజేయవలెను.

వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా ।
వర్ధతే సర్వథా పుంసః సంసారో న నివర్తతే ॥ 314

వాసనావృద్ధివలన కార్యవృద్ధి, కార్యవృద్ధివలన వాసనావృద్ధియు సంభవించుచుండును. ఈ విధముగానే మానవుని సంసారబంధనము పెరుగుచునే యుండును. కాని ఎంత యత్నించినను తరుగుట కానరాదు.

సంసారబంధవిచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహేద్యతిః ।
వాసనావృద్ధిరేతాభ్యాం చింతయా క్రియయాబహిః ॥ 315

కావున సంసార బంధవిచ్ఛేదమును గోరు యతీశ్వరుడు ఈ రెండింటిని నశింపజేసికొనవలెను. విషయములను చింతించుచుండుట వలనను, బాహిరముగా (ప్రకటముగా) ఆచారములో పెట్టుచుండుట వలనను వాసన పెరుగుచుండును.

తాభ్యాం ప్రవర్తమానా సా సూతేసంసృతిమాత్మనః ।
త్రయాణాం చ క్షయోపాయః సర్వావస్థాసుసర్వదా ॥ 316

సర్వత్ర సర్వతస్సర్వం బ్రహ్మమాత్రావలోకనమ్ ।
సద్భావవాసనాదార్ఢ్యాత్తత్త్రయం లయమశ్నుతే ॥ 317

(చింతనము, బాహ్యక్రియ) ఈ రెండింటి వలననే పెరిగి వాసన ఆత్మకు సంసారరూపబంధమును గలిగించుచుండును. సర్వదా సర్వావస్థల యందును సర్వమును బ్రహ్మస్వరూపముగా చూచుటయే ఆ మూడును క్షయమును పొందుటకు ఉపాయము. ఈ బ్రహ్మమయవాసన బలపడినప్పుడు ఆ మూడును నశించిపోవును.

క్రియానాశే భవేచ్చింతానాశోఽస్మాద్వాసనాక్షయః ।
వాసనప్రక్షయో మోక్షః సా జీవన్ముక్తిరిష్యతే ॥ 318

క్రియ నశించిన చింత నశించును. చింత నశించిన వాసనలు క్షీణించును. ఈ వాసనాక్షయము పేరే మోక్షము. దీనినే జీవన్ముక్తి యందురు.

సద్వాసనాస్ఫూర్తి విజృంభణే సతి
హ్యసౌ వీలీనా త్వహమాదివాసనా ।
అతిప్రకృష్టాఽప్యరుణప్రభాయాం
విలీయతే సాధు యథా తమిస్రా ॥ 319

సూర్యప్రకాశ ముదయింపగా ఎంత యంధకారబంధురమైన రాత్రి యైనను సర్వథా నశించిపోవును. అట్లే బ్రహ్మవాసనా స్ఫూర్తి విజృంభించినప్పుడు ఈ యహంకారాదికములైన వాసనలు అన్నియు లయించిపోవును.

తమస్తమః కార్యమనర్థ జాలం
న దృశ్యతే సత్యుదితే దినేశే ।

తథాద్వయానందరసానుభూతౌ
నైవాస్తి బంధో న చ దుఃఖగంధః ॥ 320

సూర్యుడు ఉదయించినంతనే అంధకారము, అందు సాగిపోవు (చౌర్యము మున్నగు) అనర్థములును ఎందును కానరాకుండ పోవును. అట్లే యీ అద్వితీయమైన ఆత్మానందరసము అనుభూతమైన వేళ సంసారబంధమును ఉండదు. దుఃఖసంబంధమగు గంధము కూడ ఉండదు.

## ప్రమాద నింద

దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం
సన్మాత్రమానందఘనం విభావయన్ ।
సమాహితస్సన్ బహిరంతరం వా
కాలం నయేథాస్సతి కర్మబంధే ॥ 321

నీ కర్మబంధము ఇంకను అవశిష్టమై యుండెనేని ఈ కానవచ్చు దృశ్యమునంతను లయింపజేసికొనుచు బాహ్యాభ్యంతరముల జాగరూకుడవై యుండి, సత్తామాత్రమగు నీ యానందమయ స్వరూపమును చింతనము చేయుచు కాలక్షేపము చేయుము!

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన ।
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుతః ॥ 322

బ్రహ్మ విచారము విషయమున ప్రమాదము (అజాగరూకత) చేయరాదు. ఏలయన బ్రహ్మ కుమారుడు (సనత్కుమారుడు) ప్రమాదమును మృత్యువని చెప్పెను.

న ప్రమాదాదనర్థోఽన్యో జ్ఞానినస్స్వస్వరూపతః ।
తతో మోహస్తతోఽహంధీస్తతో బంధస్తతో వ్యథా ॥ 323

జ్ఞానియైన పురుషునకు స్వస్వరూపానుసంధానమునందు ప్రమత్తుడగుట కంటె మించిన అనర్థము వేఱొకటి లేదు. ఏలయనగా దీనివలననే

మోహము కలుగును. ఆ మోహము వలన అహంకారము, దానివలన బంధనము, ఆ బంధనము వలన వ్యథయు కలుగును.

**విషయాభిముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః ।**
**విక్షేపయతి ధీదోషైర్యోషా జారమివ ప్రియమ్ ॥ 324**

కులటయైన స్త్రీ తనను ప్రేమించు జారపురుషుని చూచి అతని బుద్ధిని భ్రష్టము చేసి అతనిని ఎట్లు పిచ్చివానిని చేసివేయునో అట్లే విషయములందు ప్రవర్తిల్లుచున్న విద్వాంసుని జూచి ఆత్మ విస్మృతి యనునది బుద్ధిదోషములను గలిగించి భ్రష్టుని జేసివేయును.

**యథాపకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి ।**
**ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాఽపిపరాఙ్ముఖమ్॥ 325**

నీటిలోని నాచును ఒకమాఱు ఇటునటు తొలగద్రోసినను అది క్షణమాత్రమైన నిలువక మఱల యథాప్రకారముగా ఎట్లు నీటిపై క్రమ్మివేయునో అట్లే ఆత్మ విచారము చేయని పండితుని కూడ మాయ మఱల క్రమ్మివేయును.

**లక్ష్యచ్యుతం సద్యది చిత్తమీషత్**
**బహిర్ముఖం సన్నిపతేత్తతస్తతః ।**
**ప్రమాదతః ప్రచ్యుతకేళి కందుకః**
**సోపానపంక్తౌ పతితో యథా తథా ॥ 326**

అజాగరూకత కారణముగా లక్ష్యము దప్పి (చేతినుండి విడివడి) మెట్లమీద పడిన క్రీడాకందుకము(బంతి) మెట్టుమెట్టుగా క్రిందివంకకే పతితమగుచు ఎట్లుపోవునో అట్లే చిత్తము తన లక్ష్యమును (బ్రహ్మమును) దొలగి ఏ కొంచెము బహిర్ముఖమైనను అది యవిరామముగా క్రింది దెసకే పడిపోవసాగును.

**విషయేష్వావిశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్ ।**
**సమ్యక్సంకల్పనాత్కామః కామాత్పుంసఃప్రవర్తనమ్ ॥ 327**

విషయములందు తగులుకొన్న చిత్తము వాని గుణములను చింతనము చేయసాగును. ఆ చింతనము నిరంతరముగా సాగినప్పుడు వానియందు కోరిక జనించును. ఆ కోరిక వలన పురుషునకు విషయములందు ప్రవృత్తి గలుగును.

**తతస్స్వరూపవిభ్రంశో విభ్రష్టస్తు పతత్యధః ।**
**పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే ।**
**సంకల్పం వర్జయేత్తస్మాత్సర్వానర్థస్య కారణమ్ ॥ 328**

విషయములందలి ప్రవృత్తి వలన మానవుడు ఆత్మస్వరూప స్థితి నుండి దిగజాఱిపోవును. ఒకమాఱు అట్లు పతనము గన్న మీదట అవిరతముగా అధఃపతనము సంభవమగును. అట్లు పతితుడైన పురుషునకు నాశమే కాని ఉత్థానస్థితి ఎందును చూడబడలేదు. కాబట్టి సర్వానర్థములకును కారణమైన సంకల్పవృత్తిని విడిచిపెట్టవలెను.

**అతః ప్రమాదాన్న పరోఽస్తి మృత్యుః**
**వివేకినో బ్రహ్మవిదస్సమాధౌ ।**
**సమాహితస్సిద్ధిముపైతి సమ్యక్**
**సమాహితాత్మా భవ సావధానః ॥ 329**

కాబట్టి వివేకవంతుడు, బ్రహ్మవేత్తయు నగు పురుషునకు సమాధి యందు ప్రమత్తుడగుటను మించిన మృత్యువు మఱియొకటి లేదు. సమాహితచిత్తుడైన పురుషుడే పరిపూర్ణమైన యాత్మసిద్ధిని పొందగలుగును. కావున జాగరూకత వహించి చిత్తమును సమాహితము (స్థిరము) గావించికొనుము.

## అసత్తును పరిహరించుట

**జీవతో యస్య కైవల్యం విదేహే స చ కేవలః ।**
**యత్కించిత్పశ్యతో భేదం భయం బ్రూతేయజుశ్శ్రుతిః॥ 330**

జీవించి యుండగనే కైవల్యపదము నందిన పురుషునకు

దేహత్యాగానంతరము కూడ ఆ కైవల్యముక్తియే కలుగును. (కాని భేదదృష్టి గలవానికి కలుగదు). ఏలయనగా ఏ కొంచెము భేదదృష్టి కలవాడైనను ఆ పురుషునకు యజుర్వేదము భయమునే చెప్పుచున్నది.

యదా కదా వాపి విపశ్చిదేష
బ్రహ్మణ్యనంతేఽప్యణుమాత్రభేదమ్ ।
పశ్యత్యథాముష్య భయం తదైవ
యద్వీక్షితం భిన్నతయా ప్రమాదాత్ ॥ 331

ఎప్పుడైనను ఈ విద్వాంసుడు అనంతమైన బ్రహ్మమునందు అణుమాత్రపు భేదదృష్టి వహించినను ఆ క్షణమందే అతనికి భయము ప్రాప్తించును. ఏలయన స్వరూప సంబంధమగు ప్రమాదము కారణముగానే అఖండమైన ఆత్మయందు భేదము ప్రతీతమైనది.

శ్రుతిస్మృతిన్యాయశతైర్నిషిద్ధే
దృశ్యేఽత్ర యస్స్వాత్మమతిం కరోతి ।
ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం
నిషిద్ధకర్తా స మలిమ్లుచో యథా ॥ 332

శ్రుతులచేతను, స్మృతులచేతను, ఎన్నియో యుక్తుల చేతను (ఇది యాత్మకాదు, ఇది యాత్మకాదు అని) నిషేధింపబడిన యీ దృశ్యమానములగు దేహాదులయందు ఎవడు ఆత్మబుద్ధి చేయునో ఆ నిషిద్ధకర్మకు కర్తయైనవాడు చోరునివలె దుఃఖము మీద దుఃఖమును అనుభవించును.

సత్యాభిసంధానరతో విముక్తో
మహత్త్వమాత్మీయముపైతి నిత్యమ్ ।
మిథ్యాఽభిసంధానరతస్తు నశ్యేత్
దృష్టం తదేతద్యచోరచోరయోః ॥ 333

అద్వితీయ బ్రహ్మ రూపమైన సత్యపదార్థమును అన్వేషించువాడు

ముక్తుడై తన నిత్యమైన మహత్త్వమును పొందును. ఇందులకు భిన్నముగా మిథ్యయైన దృశ్యపదార్థముల వెంటబడువాడు నాశమును పొందును. ఈ స్థితి ఒక సాధుజనుని, చోరుని విషయమునందు చూడబడినది కూడ.

(సాధుజనుని, చోరుని ప్రసంగము ఛాందోగ్యోపనిషత్తులో (6/16/1-2) ఇట్లు వర్ణింపబడియున్నది. ఇతడు చోరుడు అని అనుమానింపబడిన వ్యక్తిని రాజపురుషులు తప్తమైన (కాల్చబడిన) పరశువుతో (గండ్రగొడ్డలి) ప్రహరింతురు. ఆ వ్యక్తి చౌర్యము చేసి చేయలేదని బొంకుచున్నవాడైనచో ఆ పరశువు చేత అతడు దగ్ధుడు ఆగుటయు, పిమ్మట వానిని రాజపురుషులు చంపివేయుటయు సంభవమగును. ఆవ్యక్తి నిజముగానే చౌర్యము చేయక చేయలేదనుచున్నవాడైనచో ఆ పరశువు సత్యముచే సురక్షితుడైయున్న కారణమున వానిని దగ్ధము చేయజాలదు. అప్పుడు రాజపురుషులు కూడ వానిని వదిలివేయుదురు.)

**యతిరసదనుసంధిం బంధహేతుం విహాయ**
**స్వయమయమహమస్మీత్యాత్మదృష్ట్యైవ తిష్ఠేత్ ।**
**సుఖయతి నను నిష్ఠా బ్రహ్మణి స్వానుభూత్యా**
**హరతి పరమవిద్యా కార్యదుఃఖం ప్రతీతమ్ ॥ 334**

బంధహేతువులైన అసత్తు పదార్థముల వెంటబడుట మాని యతి యగువాడు 'ఈ సాక్షాద్బ్రహ్మ పదార్థమును నేనే' అనునట్టి యాత్మ దృష్టియందు స్థిరుడై యుండవలెను. స్వానుభవపూర్వకముగా నుత్పన్నమైన బ్రహ్మనిష్ఠయే అవిద్యాకార్యముగా ప్రతీయమానమగుచున్న ప్రపంచమునకు సంబంధించిన దుఃఖమును హరించి పరమసుఖమును ప్రసాదించును.

**బాహ్యానుసంధిః పరివర్ధయేత్ఫలం**
**దుర్వాసనామేవ తతస్తతోఽధికామ్ ।**
**జ్ఞాత్వా వివేకైః పరిహృత్య బాహ్యం**
**స్వాత్మానుసంధిం విదధీత నిత్యమ్ ॥ 335**

సుప్తస్య నో జాగరణం న జాగ్రతః
స్వప్నస్తయోర్భిన్నగుణాశ్రయత్వాత్ ॥ 338

దేహాదులగు అనాత్మవస్తువులందు ఆసక్తి గలవానికి ముక్తిరాదు. ముక్తుడైనవానికి దేహాదులయందు అభిమాన ముండదు. నిదురించినవానికి జాగ్రదవస్థానుభవముండదు. జాగ్రద్దశయందు ఉన్నవానికి నిద్రానుభవముండదు. ఈ రెండు అవస్థలును వేఱు వేఱు గుణముల నాశ్రయించి యుండును.

## ఆత్మనిష్ఠా విధానము

అంతర్బహిః స్థిరజంగమేషు
జ్ఞానాత్మనాధారతయా విలోక్య ।
త్యక్తాఖిలోపాధిరఖండరూపః
పూర్ణాత్మనా యః స్థితి ఏష ముక్తః ॥ 339

స్థావరజంగమ పదార్థములు ఎన్నికలవో ఆయన్నింటిలోపల వెలుపల వానికి జ్ఞానస్వరూపము చేత తననే ఆధారభూతునిగా చూచికొని ఉపాధులనన్నిటిని వీడి అఖండ పరిపూర్ణరూపమున నిలచియుండువాడు ఎవడో అతడు ముక్తుడు.

సర్వాత్మనా బంధవిముక్తిహేతుః
సర్వాత్మభావన్న పరోఽస్తి కశ్చిత్ ।
దృశ్యాఽగ్రహే సత్యుపపద్యతేఽసౌ
సర్వాత్మభావోఽస్య సదాత్మనిష్ఠయా ॥ 340

సర్వ విధముల సంసారబంధ విముక్తి పొందుటకు సర్వాత్మభావము (సర్వమును ఆత్మరూపముగా చూచునట్టి భావము) కన్న మిన్నయని యెన్నదగు హేతువు వేఱుగా ఏదియును లేదు. నిరంతరము ఆత్మ నిష్ఠయందు నిలిచియుండుట వలన దృశ్యము గ్రహింపబడకున్నప్పుడు (బాధితమైనప్పుడు) ఈ సర్వాత్మభావము సిద్ధించును.

దృశ్యాఽగ్రహణం కథం ను ఘటతే దేహాత్మనా తిష్ఠతో
బాహ్యార్థానుభవ ప్రసక్తమనసస్తత్త త్క్రియాం కుర్వతః ।
సన్న్యస్తాఖిల ధర్మకర్మ విషయైర్నిత్యాత్మనిష్ఠాపరై
స్తత్త్వజ్ఞైః కరణీయమాత్మని సదానందేచ్ఛుభిర్యత్నతః ॥ 341

దేహాత్మబుద్ధి కలిగియుండి, మనస్సులో బాహ్యపదార్థములందు ఆసక్తి కలిగియుండి, వాని కొఱకే నిరంతరము పాటుపడుచుండువారికి దృశ్యము గోచరింపకుండుట ఎట్లు సంభవమగును? కాబట్టి నిత్యానందమును కోరు తత్త్వవేత్త ఆ సమస్త ధర్మకర్మములను, విషయములను పరిత్యజించి నిరంతరము ఆత్మనిష్ఠయందు తత్పరుడై యుండి తన యాత్మయందు ప్రతీతమగుచున్న యీ దృశ్య ప్రపంచమును ప్రయత్నపూర్వకముగా తొలగించుకొనవలెను.

సార్వాత్మ్యసిద్ధయే భిక్షోః కృతశ్రవణకర్మణః ।
సమాధిం విదధాత్యేషా శాంతోదాంత ఇతిశ్రుతిః ॥ 342

“శాంతోదాంత ఉపరతస్తితిక్షుః” (బృహ.4/4/23) అన్న యీ శ్రుతి యతీశ్వరునకు వేదాంతశ్రవణానంతరము సార్వాత్మ్యభావము సిద్ధించుటకు సమాధిస్థితిని విధించుచున్నది.

ఆరూఢశక్తే రహమో వినాశః
కర్తుం న శక్యః సహసాఽపి పండితైః ।
యే నిర్వికల్పాఖ్యసమాధినిశ్చలా
స్తానంతరానంతభవా హి వాసనాః ॥ 343

అహంకారశక్తి అత్యంత ప్రబలమై యుండునంతవరకు ఏ పండితుడును దానిని ఒక్కసారిగా నశింపజేయజాలడు. ఏలయనగా నిర్వికల్ప సమాధి స్థితిని పొందినవారియందు కూడ వాసనలు ఉండుట చూడబడినది.

అహంబుద్ధ్యైవ మోహిన్యా యోజయిత్వాఽఽవృతేర్బలాత్ ।
విక్షేపశక్తిః పురుషం విక్షేపయతి తద్గుణైః ॥ 344

మోహింపజేయగల శక్తి గలది అహంబుద్ధి. విక్షేపశక్తి తన యావరణ శక్తిని ఆ యహంబుద్ధితోడ అనుసంధింపజేసి దాని (అహంబుద్ధియొక్క) గుణములచేత మానవుని విక్షిప్తుని (స్థిరత్వములేని వానినిగా) జేసివేయును.

విక్షేపశక్తివిజయో విషమో విధాతుం
నిశ్శేషమావరణ శక్తి నివృత్త్యభావే ।
దృగ్దృశ్యయోః స్ఫుటపయోజలవద్విభాగే
నశ్యేత్తదావరణ మాత్మని చ స్వభావాత్ ॥
నిస్సంశయేన భవతి ప్రతిబంధశూన్యో
విక్షేపణం న హి తథా యది చేన్మృషార్థే ॥ **345**

సమ్యగ్వివేకః స్ఫుటబోధజన్యో
విభజ్య దృగ్దృశ్యపదార్థతత్త్వమ్ ।
ఛినత్తి మాయాకృతమోహబంధం
యస్మాద్విముక్తస్య పునర్న సంసృతిః ॥ **346**

ఆవరణశక్తిని పూర్తిగా నివృత్తము చేసికొనక ముందు విక్షేపశక్తి మీద విజయము సాధింపగలుగుట చాలా కష్టము. పాలు, నీరును వలె ద్రష్టయు, దృశ్యమును వేఱుపడిపోయినట్టి జ్ఞానము స్పష్టముగా కలిగినప్పుడు ఆత్మయందు ఆవరించియున్న ఆవరణశక్తి తనంతతానే నశించిపోవును. మిథ్యగా కానవచ్చు (ఈ బుద్ధి మున్నగు) పదార్థములందు ద్రష్ట యొక్కయు, దృశ్యపదార్థముల యొక్కయు స్వరూపములను వేఱుపఱచి, స్పష్టమైన బోధమునకు కారణమగునట్టిదియు, నిస్సందేహముగా అవరోధ మేదియు లేనట్టిదియునగు వివేకము కలిగెనేని యిక విక్షేపమన్నది యుండదు. ఆ వివేకము మాయాజనితమైన మోహమును కూడ ఖండించి వేయగలదు. ఆ కారణమున ముక్తుడైన పురుషునకు మఱల (జనన మరణ రూపమైన)సంసారము ప్రాప్తింపనేరదు.

పరావరైకత్వ వివేకవహ్ని
ర్దహత్యవిద్యాగహనం హ్యశేషమ్ ।
కిం స్యాత్పునస్సంసరణస్య బీజ
మద్వైతభావం సముపేయుషోఽస్య ॥ 347

బ్రహ్మము యొక్కయు, ఆత్మయొక్కయు ఏకత్వజ్ఞానరూపమగు అగ్ని అవిద్యా (అజ్ఞాన) రూపవనమునంతను కాల్చి భస్మము జేసివేయును. (ఆ అవిద్య పూర్తిగా నశింపగా) జీవునకు అద్వైతభావము సిద్ధించినపుడు మఱల సంసారము ప్రాప్తించుటకు కారణము ఏముండును?

ఆవరణస్య నివృత్తి ర్భవతి చసమ్యక్పదార్థదర్శనతః ।
మిథ్యాజ్ఞానవినాశ స్తద్విక్షేపజనిత దుఃఖనివృత్తిః ॥ 348

సమ్యగ్రీతిగా ఆత్మవస్తు సాక్షాత్కార మయ్యేనేని ఆవరణము తొలగిపోవును. మిథ్యాజ్ఞానము నశించును. విక్షేపజనితమైన దుఃఖము నివృత్తమైపోవును.

## అధిష్ఠాన నిరూపణము

ఏతత్త్రితయం దృష్టం సమ్యగ్రజ్జు స్వరూపవిజ్ఞానాత్ ।
తస్మాద్వస్తు సతత్త్వం జ్ఞాతవ్యం బంధముక్తయేవిదుషా॥ 349

రజ్జువునందు భ్రాంతిచేత సర్పము ప్రతీతమగును. ఆ మిథ్యాప్రతీతి వలననే భయము, కంపము మున్నగు దుఃఖములు కలుగును. దీపాదుల ద్వారా రజ్జుస్వరూపము యొక్క యథార్థ పరిజ్ఞానము కలగటంతోనే (రజ్జువునందు ఏర్పడిన అజ్ఞానము (ఆవరణము), అజ్ఞానము వలన గలిగిన సర్పము (మలము) సర్పప్రతీతి వలన కలిగిన భయకంపాదులు (విక్షేపము) అను నీ మూడును ఒక్కసారిగా నివృత్తములగుట కానవచ్చుచుండును. అట్లే ఆత్మ స్వరూప జ్ఞానము కలిగిన మీదట ఆత్మయందు ఏర్పడిన అజ్ఞానము, ఆ యజ్ఞానము వలన గలుగు ప్రపంచప్రతీతి, దానివలన గలుగు దుఃఖము ఒక్కసారిగా నివృత్తములు

అయిపోవును. కాబట్టి సంసారబంధవిముక్తికై పండితుడు తత్త్వసమేతముగా ఆత్మపదార్థజ్ఞానమును పొందవలెను.

అయోఽగ్నియోగాదివ సత్త్వమన్వయా
న్మాత్రాదిరూపేణ విజృంభతే ధీః ।
తత్కార్యమేతద్ద్వితయం యతో మృషా
దృష్టం భ్రమస్వప్నమనోరథేషు ॥ 350

అగ్నితోడి సంపర్కము వలన ఇనుము (త్రవ్వుగోల, పార మున్నగు) వివిధరూపములను దాల్చుచుండును. అట్లే ఆత్మతోడి సంపర్కము వలన బుద్ధి (శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములాదిగా) వివిధ విషయములందు ప్రకాశించును. ఈ ద్వైతప్రపంచము ఆ బుద్ధి యొక్క కార్యమే. కావున ఇది మిథ్యయగును. ఏలయనగా భ్రాంతియందు, స్వప్నమందు, మనోరథమునందును దీని ప్రతీతి మిథ్యయనుట తెల్లమగును.

తతో వికారాః ప్రకృతే రహంముఖా
దేహావసానా విషయాశ్చ సర్వే ।
క్షణే-న్యథా భావితయా హ్యమీషా
మసత్త్వమాత్మా తు కదాపి నాన్యథా ॥ 351

కావున అహంకారాదిదేహపర్యంతముగా ఎన్ని వికారములు, లేక యెన్ని విషయములున్నవో అవియన్నియు క్షణక్షణపరివర్తన లక్షణము కలవియైన కారణమున అసత్యములైనవి. కాని యాత్మ (ఆవిధముగా) ఎన్నడును మార్పుచెందదు. అది సర్వదా ఏకరసమై యుండును.

నిత్యాద్వయాఖండ చిదేకరూపో
బుద్ధ్యాదిసాక్షీ సదసద్విలక్షణః ।
అహంపదప్రత్యయలక్షితార్థః
ప్రత్యక్సదానందఘనః పరాత్మా ॥ 352

అహం పదముయొక్క ప్రతీతిచేత లక్షితమగునట్టి యా నిత్యానంద ఘనుడగు పరమాత్మ సర్వదా అద్వితీయుడు. అఖండరూపుడు. చైతన్యస్వరూపుడు. బుద్ధ్యాదులకు సాక్షియగువాడు. సత్తు, అసత్తులకంటె భిన్నమైనవాడు. ప్రత్యగ్రూపుడు. అనగా అంతరతముడు.

ఇత్థం విపశ్చిత్సదసద్విభజ్య
నిశ్చిత్య తత్త్వం నిజబోధదృష్ట్యా ।
జ్ఞాత్వా స్వమాత్మానమఖండబోధం
తేభ్యో విముక్తః స్వయమేవ శామ్యతి ॥ 353

విద్యావంతుడైనవాడు ఈవిధముగా సత్తు, అసత్తులను విభజించి తన జ్ఞానదృష్టిచేత తత్త్వనిశ్చయము జేసికొని అఖండబోధ స్వరూపమగు ఆత్మను గుర్తించి అసత్తు పదార్థముల నుండి విముక్తుడై స్వయముగనే శాంతించును.

## సమాధి నిరూపణము

అజ్ఞానవిషయగ్రంథేర్నిశ్శేషవిలయస్తదా
సమాధినాఽవికల్పేన యదాఽద్వైతాత్మదర్శనమ్ ॥ 354

నిర్వికల్ప సమాధి ద్వారా అద్వైతాత్మ స్వరూపము ఎప్పుడు సాక్షాత్కరించికొనబడునో అప్పుడే అజ్ఞానరూపమగు హృదయగ్రంథి సర్వవిధముల నశించిపోవగలుగును.

త్వమహమిదమితీయం కల్పనా బుద్ధిదోషాత్
ప్రభవతి పరమాత్మన్యద్వయే నిర్విశేషే ।
ప్రవిలసతి సమాధావస్య సర్వో వికల్పో
విలయనముపగచ్ఛేద్వస్తుతత్త్వావధృత్యా ॥ 355

అద్వితీయుడు, నిర్విశేషుడు అగు పరమాత్మయందు నీవు నేను అనునట్టి కల్పన బుద్ధిదోషము వలననే కలుగుచున్నది. ఆ కల్పనయే

సంపూర్ణ వికల్ప సమాధియందు అవరోధముగా స్ఫురించును. కాని తత్త్వవస్తువును యథారూపముగా గ్రహించినప్పుడు అది యంతయు లయించిపోవును.

**శాంతో దాంతః పరముపరతః క్షాంతియుక్తః సమాధిం**
**కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మభావమ్ ।**
**తేనావిద్యాతిమిరజనితాన్ సాధు దగ్ధ్వావికల్పాన్**
**బ్రహ్మాకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః ॥ 356**

యోగియైన పురుషుడు చిత్తశాంతి, ఇంద్రియనిగ్రహము, విషయ విరమణము, క్షమాగుణమును కలిగియుండి నిరంతరము సమాధిదశను అభ్యసించును తన సర్వాత్మభావమును అనుభవములోనికి తెచ్చికొనును. తన్మూలమున అవిద్యారూపమైన యంధకారము వలన ఆవిర్భవించిన సమస్త వికల్పములను ధ్వస్తమొనర్చికొని నిష్క్రియుడు, నిర్వికల్పుడునై ఆనంద పూర్వకముగా బ్రహ్మాకారవృత్తి వహించియుండును.

**సమాహితా యే ప్రవిలాప్య బాహ్యం**
**శ్రోత్రాది చేతః స్వమహం చిదాత్మని ।**
**త ఏవ ముక్తా భవపాశబంధై**
**ర్నాన్యే తు పారోక్ష్యకథాభిధాయినః ॥ 357**

శ్రోత్రాదులగు నింద్రియముల సముదాయమును, చిత్తము, అహంకారము అను బాహ్యవస్తువులను ఆత్మయందు లయమొనర్చి సమాధియందు స్థితులై యుండువారే సంసారబంధ విముక్తి గన్నవారు. కేవలము పరోక్ష బ్రహ్మ జ్ఞాన ప్రసంగములు గావించువారు ఎన్నడును విముక్తులు గాజాలరు.

**ఉపాధి భేదాత్స్వయమేవ భిద్యతే**
**చోపాధ్యపోహే స్వయమేవ కేవలః ।**
**తస్మాదుపాధేర్విలయాయ విద్వాన్**
**వసేత్సదాఽకల్పసమాధినిష్ఠయా ॥ 358**

ఉపాధిభేదము వలననే ఆత్మయందు, భేదము ప్రతీతమగుచుండును. ఉపాధి లయమైపోయిన మీదట ఆ యాత్మ కేవలము తానే నిలిచి యుండును. కావున ఉపాధిని లయింపజేయుటకు విచారశీలుడైన పురుషుడు సర్వదా నిర్వికల్పసమాధియందు నిలిచియుండవలెను.

సతి సక్తో నరో యాతి సద్భావం హ్యేకనిష్ఠయా ।
కీటకో భ్రమరం ధ్యాయన్ భ్రమరత్వాయ కల్పతే ॥ 359

ఏకాగ్ర చిత్తముతో నిరంతరము సత్స్వరూపబ్రహ్మమునందు స్థితుడై యుండుట వలన మానవుడు బ్రహ్మస్వరూపుడే అయిపోవును. ఎట్లనగా భయముతో భ్రమరమును ధ్యానించి, కీటకము భ్రమరమే యగుచున్నది.

క్రియాంతరాసక్తి మపాస్య కీటకో
ధ్యాయన్ యథాళిం హ్యాళిభావమృచ్ఛతి ।
తథైవ యోగీ పరమాత్మతత్త్వం
ధ్యాత్వా సమాయాతి తదేకనిష్ఠయా ॥ 360

కీటకము అన్యములైన సమస్తక్రియలందలి ఆసక్తిని వీడి, కేవలమొక్క భ్రమరరూపమునే ధ్యానించుచు భ్రమరరూపమును దాల్చుచున్నది. అట్లే యోగి యగువాడు ఏకనిష్ఠ వహించియుండి పరమాత్మ చింతనము చేయుచునే పరమాత్మ భావమును పొందును.

అతీవసూక్ష్మం పరమాత్మతత్త్వం
న స్థూలదృష్ట్యా ప్రతిపత్తుమర్హతి
సమాధినాఽత్యంతసుసూక్ష్మవృత్త్యా
జ్ఞాతవ్యమార్యైరతిశుద్ధబుద్ధిభిః ॥ 361

పరమాత్మతత్త్వము అత్యంత సూక్ష్మమైనది. దానిని స్థూలదృష్టిచేత ఎవ్వడును పడయలేడు. కావున విశుద్ధమైన బుద్ధి కలవారు, సత్పురుషులునగువారు దానిని సమాధివలనను, అతిసూక్ష్మవృత్తితోను తెలిసికొనవలసి యున్నది.

యథా సువర్ణం పుటపాకశోధితం
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి ।
తథా మనస్సత్త్వ రజస్తమోమలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్ ॥ 362

(అగ్నియందు) పుటము వెట్టి శోధింపబడిన బంగారము తనయందు పేరుకొనియున్న మలమును వీడి తన నిజరూపమును పొందును. అట్లే మనస్సు ధ్యానము మూలమున సత్త్వరజస్తమోగుణముల రూపమున ఉన్న మాలిన్యమును బాసి యాత్మతత్త్వమును పొందును.

నిరంతరాభ్యాసవశాత్తదిత్థం
పక్వం మనో బ్రహ్మణి లీయతే యదా ।
తదా సమాధిస్స వికల్పవర్జితః
స్వతోఽద్వయానందరసానుభావుకః ॥ 363

రేయనక, పగలనక నిరంతరముగా అభ్యాసము చేయుట వలన పరిపక్వదశ నంది మనస్సు బ్రహ్మమునందు ఎప్పుడు లయమందునో అప్పుడు అద్వితీయమైన బ్రహ్మానందరసమును అనుభవింపజేయునట్టి నిర్వికల్ప సమాధి స్వయముగనే సిద్ధించును.

సమాధినానేన సమస్తవాసనా
గ్రంథేర్వినాశోఽఖిల కర్మనాశః ।
అంతర్బహిస్సర్వత ఏవ సర్వదా
స్వరూపవిస్ఫూర్తిరయత్నతః స్యాత్ ॥ 364

ఈ నిర్వికల్ప సమాధి వలన సమస్త వాసనాగ్రంథులు నశించిపోవును. వాసనలు నశించుటలో సమస్తకర్మలు నశించును. అప్పుడు లోపల వెలుపల సర్వత్ర నిరంతరము అప్రయత్నముగా స్వరూపస్ఫూర్తి కలుగ నారంభించును.

శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి ।
నిదిధ్యాసం లక్షగుణమనంతం నిర్వికల్పకమ్ ॥ 365

వేదాంత విషయములను కేవలము శ్రవణము చేసి యూరకుండుట కంటె దానిని మననము చేయుట నూఱురెట్లు మేలు. ఆ మననము కంటెను నిదిధ్యాసనము అనగా తన చిత్తమునందు ఆత్మభావనము స్థిరపఱచికొనుట లక్షరెట్లు మేలు. ఆ నిదిధ్యాసనము కంటెను నిర్వికల్ప సమాధికి అనంతగుణితమైన మహత్త్వమున్నది. (దానివలన చిత్తమునందు ఏర్పడిన ఆత్మస్వరూప భావము ఎన్నడును చలింపదు.)

నిర్వికల్పక సమాధినా స్ఫుటం
బ్రహ్మతత్త్వమవగమ్యతే ధ్రువమ్ ।
నాన్యథా చలతయా మనోగతేః
ప్రత్యయాంతరవిమిశ్రితం భవేత్ ॥ 366

నిర్వికల్ప సమాధి వలన నిశ్చయముగా బ్రహ్మతత్త్వజ్ఞానము స్పష్టముగా గలుగును. అది మఱియే విధమునను ప్రాప్తించదు. ఏలయనగా ఇతర పరిస్థితులందు మనస్సు చంచలమైనదైన కారణమున అందు ఇతరేతరములైన జ్ఞానములు మిళితములగుట సంభవమగును.

అతః సమాధత్స్వ యతేంద్రియస్సదా
నిరంతరం శాంతమనాః ప్రతీచి ।
విధ్వంసయ ధ్వాంతమనాద్యవిద్యయా
కృతం సదేకత్వవిలోకనేన ॥ 367

కావున సర్వదా ఇంద్రియములను అదుపులో నిలిపికొని శాంతమనస్కుడవై ప్రత్యగాత్మయగు బ్రహ్మమునందు చిత్తమును స్థిరపఱచికొనుము. సచ్చిదానంద బ్రహ్మముతోడ నీయేకత్వమును కనుగొనుచు అనాదిగా సాగివచ్చు నవిద్యవలన నుత్పన్నమైన అజ్ఞానాంధకారమును నశింపజేసికొనుము.

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధో-పరిగ్రహః ।
నిరాశా చ నిరీహా చ నిత్యమేకాంతశీలతా ॥ 368

వాక్సంయమము, ద్రవ్యమును కూడబెట్టకుండుట, లౌకిక పదార్థములను ఆశింపకుండుట, కోరికలను వీడుట, నిత్యము ఏకాంత వాసము చేయుట - ఇవి యన్నియు యోగమునకు ప్రథమద్వారములు.

ఏకాంతస్థితిరింద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః
సంరోధే కరణం శమేన విలయం యాయాదహంవాసనా ।
తేనానందరసానుభూతిరచలా బ్రాహ్మీ సదా యోగిన
స్తస్మా చ్చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః ॥ 369

ఏకాంతమున ఉండుట ఇంద్రియదమనమునకు కారణము. ఇంద్రియ దమనము చిత్తనిరోధమునకు కారణము. చిత్తనిరోధము వలన వాసనానాశనమగును. వాసనానాశము వలన యోగి యగువానికి అచంచలమైన బ్రహ్మానందరసానుభూతి కలుగును. కాబట్టి మునియగువాడు సర్వదా ప్రయత్నపూర్వకముగా చిత్తనిరోధము చేసికొనవలయును.

వాచం నియచ్ఛాత్మని తం నియచ్ఛ
బుద్ధౌ ధియం యచ్ఛ చ బుద్ధిసాక్షిణి ।
తం చాపి పూర్ణాత్మని నిర్వికల్పే
విలాప్య శాంతిం పరమాం భజస్వ ॥ 370

వాక్కును మనస్సునందు లయింపజేయుము! మనస్సును బుద్ధియందు లయింపజేయుము! బుద్ధిని బుద్ధిసాక్షియగు ఆత్మయందు, బుద్ధిసాక్షిని (కూటస్థుని) నిర్వికల్పపూర్ణ బ్రహ్మమునందును లయింపజేసి పరమ శాంతిని అనుభవింపుము!

దేహప్రాణేంద్రియమనోబుద్ధ్యాదిభిరుపాధిభిః ।
యైర్యైర్వృత్తేః సమాయోగస్తత్తద్భావోఽస్య యోగినః ॥ 371

దేహము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు బుద్ధి - అను నీయుపాధులలో దేని దేనితో యోగియొక్క చిత్తవృత్తి సంయోగమును పొందునో దానిదాని భావమునే అతడు పొందును.

**తన్నివృత్త్యా మునే స్సమ్యక్సర్వోపరమణం సుఖమ్ ।**
**సందృశ్యతే సదానందరసానుభవవిప్లవః ॥ 372**

మునియగువాని చిత్తము ఈ యెల్ల యుపాధులనుండియు నివృత్తమైనప్పుడు అతనికి పూర్తిగా ఉపరమణ సుఖము స్పష్టముగా గోచరింపనారంభించును. దానివలన అతని చిత్తమందు సచ్చిదానంద రసానుభవము వెల్లివిరియును.

## వైరాగ్య నిరూపణము

**అంతస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే ।**
**త్యజత్యంతర్బహిస్సంగం విరక్తస్తు ముముక్షయా ॥ 373**

విరక్తుడైన పురుషుడు బాహ్యముగాను, అంతరికముగాను కూడ త్యాగము చేయుట యుక్తము. విరక్తుడైనవాడు మోక్షమును పొందు కోరికతో సంగమును బాహ్యముగాను, అంతరికముగాను కూడ త్యజించివేయును.

**బహిస్తు విషయై స్సంగం తథాంతరహమాదిభిః ।**
**విరక్త ఏవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః ॥ 374**

ఇంద్రియములకు విషయములతోడి బాహ్య సంపర్కమును, అహంకారము మున్నగువానితోడ ఆంతరిక సంపర్కమును - ఈ రెండింటిని బ్రహ్మనిష్ఠ గల విరక్త పురుషుడు మాత్రమే త్యజింపగలడు.

**వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్**
**పక్షౌ విజానీహి విచక్షణ త్వమ్ ।**

విముక్తిసౌధాగ్రతలాధిరోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి ॥ 375

ఓ పండితుడా! వైరాగ్యము, జ్ఞానము అనునవి పక్షికి రెండు ఱెక్కలవలె మోక్షమును కాంక్షించువానికి రెండు ఱెక్కలగును. ఆ రెండింటిలోను ఏ ఒక్కటి లేకపోయినను మిగిలిన ఒక్క ఱెక్కతో మోక్షసౌధపుటట్టాలిక మీదకు అధిరోహింపగలుగుట సంభవము కాదు. (అనగా మోక్షమును పొందవలెనన్న జ్ఞానవైరాగ్యములు రెండును అపేక్షితములే యగును.)

అత్యంత వైరాగ్యవత స్సమాధిః
సమాహితస్యైవ దృఢప్రబోధః ।
ప్రబుద్ధతత్త్వస్య హి బంధముక్తిః
ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః ॥ 376

మీదు మిక్కిలి వైరాగ్యము గలవానికే సమాధిస్థితి ప్రాప్తించును. ఆ స్థితిని పొందినవానికే దృఢమైన జ్ఞానము కలుగును. దృఢమైన జ్ఞానము గలవానికే సంసారబంధ విముక్తి కలుగును. అట్లు సంసారబంధవిముక్తిని గన్నవానికే నిత్యానందానుభవము ప్రాప్తించును.

వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మనః
తచ్చేచ్ఛుద్ధతరాత్మబోధసహితం స్వారాజ్యసామ్రాజ్యధుక్ ।
ఏతద్ద్వారమజస్రముక్తియువతేర్యస్మాత్త్వమస్మాత్పరం
సర్వత్రాస్పృహయా సదాత్మని సదా ప్రజ్ఞాం కురు శ్రేయసే ॥ 377

జితేంద్రియుడైన పురుషునకు వైరాగ్యముకన్న మించి సుఖము నివ్వగలది యేదియు నాకు గానరాదు. ఆ వైరాగ్యము విశుద్ధమైన యాత్మ జ్ఞానముతో కూడినది అయ్యేనేని విద్యసామ్రాజ్య సుఖమును ఈయగలది యగును. ఇది నిరంతరమును తెఱచి యుంచబడు ముక్తికాంతయొక్క ద్వారము. కావున ఓ వత్సా! నీవు నీ కల్యాణము కొఱకు ఎల్లవంకలనుండియు ఇచ్ఛారహితుడవై సర్వదా సచ్చిదానందపరబ్రహ్మమునందే బుద్ధిని స్థిరపఱచుకొనుము!

**ఆశాం ఛింధి విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః సృతి**
**స్త్యక్త్వా జాతికులా శ్రమేష్వభిమతిం ముంచాతిదూరాత్క్రియాః ।**
**దేహాదావసతి త్యజాత్మధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని**
**త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ద్వయపరం బ్రహ్మాఽసి యద్వస్తుతః ॥ 378**

విషయములు విషమువంటివి. వానిమీద ఆశను వీడుము! ఏలయనగా ఇది (స్వరూప విస్మృతి రూపమగు) మృత్యువునకు మార్గము. జాతి, కులము, ఆశ్రమము మున్నగువానిమీద అభిమానమును వీడి దూరమునుండియే కర్మలకు ఒక నమస్కారము చేయుము! దేహాదులగు అసత్తు పదార్థములందు ఆత్మబుద్ధిని మానుము! ఆ యాత్మయందు అహంబుద్ధి గలిగియుండుము! ఏలయనగా నీవు సర్వద్రష్టవు. మలరహితుడువు. ద్వైతరహితుడవు నగు పరబ్రహ్మవు.

## ధ్యానవిధి

**లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేంద్రియం**
**స్వస్థానే వినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితిమ్ ।**
**బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖండవృత్త్యాఽనిశం**
**బ్రహ్మానందరసం పిబాత్మని ముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః ॥ 379**

చిత్తమును దృఢముగా నిజలక్ష్యమైన బ్రహ్మమునందు నిలిపి, బాహ్యేంద్రియములను వాని విషయములనుండి మఱలించి, వానివాని స్థానములందు స్థిరపఱచికొనుము! శరీరమును నిశ్చలముగా నిలిపికొనుము! దాని స్థితిని గూర్చి తలపవలదు. ఈవిధముగా బ్రహ్మమును ఆత్మను ఏకము గావించి తన్మయత్వము వహించి అఖండముగా అహర్నిశమును మానసికముగా ఆనందపూర్వకముగా బ్రహ్మానందరసమును గ్రోలుము! పొల్లు విషయముల వలన ప్రయోజనమేమి?

**అనాత్మచింతనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్ ।**
**చింతయాత్మానమానందరూపం యన్ముక్తికారణమ్ ॥ 380**

దుఃఖమునకు కారణభూత మగునదియు, మోహరూపమైనదియునగు అనాత్మ చింతనమును మాని ఆనందస్వరూపమైన యాత్మ చింతనము చేయుము! అది సాక్షాత్తు ముక్తికి హేతువైనది.

ఏష స్వయంజ్యోతిరశేష సాక్షీ
విజ్ఞానకోశే విలసత్యజస్రమ్ ।
లక్ష్యం విధాయైనమసద్విలక్షణ
మఖండవృత్త్యాత్మతయానుభావయ ॥ 381

స్వయంప్రకాశమై, సర్వసాక్షియై, అనిత్యపదార్థము లన్నిటికన్న భిన్నమైనదై నిరంతరము విజ్ఞానమయకోశమునందు విరాజిల్లుచుండు నీ పరమాత్మనే లక్ష్యముగా చేసికొని దీనినే అఖండవృత్తితో (తైలధారవలె) ఆత్మభావముతోడ చింతనము చేయుము!

ఏతమచ్ఛిన్నయా వృత్త్యా ప్రత్యయాంతరశూన్యయా ।
ఉల్లేఖయన్ విజానీయాత్ స్వస్వరూపతయాస్ఫుటమ్ ॥ 382

ఇతర ప్రతీతులు ఏవియు లేని విధమును అఖండవృత్తితో ఈ ఒక్క దానినే చింతనము చేయుచు యోగి యగువాడు దీనినే స్వస్వరూపమగా స్పష్టముగా గుర్తింపవలెను.

అత్రాత్మత్వం దృఢీకుర్వన్నహమాదిషు సంత్యజన్ ।
ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ఘటపటాదివత్ ॥ 383

ఈ విధముగా ఈ పరమాత్మయందు ఆత్మభావమును బలపఱచి కొనుచు అహంకారాదులందు ఆత్మబుద్ధిని మానుచు, వాని యెడల శరీరముకంటె భిన్నములైన ఘటపటాదుల యెడటను వలె ఉదాసీనత వహించియుండవలెను.

## ఆత్మదృష్టి

విశుద్ధమంతఃకరణం స్వరూపే
నివేశ్య సాక్షిణ్యవబోధమాత్రే ।
శనైశ్శనైర్నిశ్చలతాముపానయన్
పూర్ణం స్వమేవానువిలోకయేత్తతః ॥ 384

సర్వసాక్షి, జ్ఞానస్వరూపము నగు ఆత్మయందు తన శుద్ధ చిత్తమును లగ్నమొనర్చి క్రమక్రమముగా నిశ్చలత్వమును సాధించుకొనుచు కడపట సర్వత్ర తననే నిండియున్నట్లు దర్శింపవలెను.

దేహేంద్రియప్రాణమనోఽహమాదిభిః
స్వాజ్ఞానక్లుప్తైరఖిలైరుపాధిభిః ।
విముక్తమాత్మానమఖండరూపం
పూర్ణం మహాకాశమివావలోకయేత్ ॥ 385

తన యజ్ఞానము చేత కల్పితములైన దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, అహంకారము ఆదిగా గల యెల్ల యుపాధులను లేనిదై యఖండమైనదిగ ఆత్మను మహాకాశమువలె సర్వత్ర నిండియున్నట్లు చూడవలెను.

ఘటకలశకుసూలసూచిముఖ్యై
ర్గగనముపాధిశతైర్విముక్తమేకమ్ ।
భవతి న వివిధం తథైవ శుద్ధం
పరమహమాది విముక్తమేకమేవ ॥ 386

ఘటము, కలశము, ధాన్యపు గాదె, సూది మున్నగు వందల కొలది ఉపాధులు ఏవియులేనిదై ఆకాశము సర్వదా ఒక్కటిగనే యుండును. ఉపాధులు అనేకములైన కారణమున అది యనేకము కాదు. అట్లే అహంకారాదులగు ఉపాధులు ఏవియు లేక పరమాత్మ ఒక్కడే అయి ఉండును.

**బ్రహ్మాదిస్తంబపర్యంతా మృషామాత్రా ఉపాధయః ।**
**తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్ ॥ 387**

బ్రహ్మము మొదలు స్తంబము (తృణము) వఱకును గల ఉపాధులెల్ల మిథ్యయే. కావున తనను సర్వదా ఒక్కటియై యుండు పరిపూర్ణమైన ఆత్మ స్వరూపముగా చూచికొనవలెను.

**యత్ర భ్రాంత్యా కల్పితం యద్వివేకే**
**తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్ ।**
**భ్రాంతేర్నాశే భ్రాంతిదృష్టాహితత్త్వం**
**రజ్జుస్తద్వద్విశ్వమాత్మ స్వరూపమ్ ॥ 388**

ఎక్కడ అనగా ఏ యాధారమునందు ఏ వస్తువు భ్రాంతి చేత కల్పితమగునో ఆ యాధారమునకు సంబంధించిన సమ్యగ్జ్ఞానము కలిగిన మీదట ఆ కల్పితవస్తువు తద్రూపమైనదిగా నిశ్చితమగును. అది దానికంటె భిన్నమైనది కానేకాదు. భ్రాంతివశమున రజ్జువునందు ప్రతీతమైన సర్పము ఆ భ్రాంతి యంతరించిన మీదట రజ్జురూపముగానే ప్రత్యక్షమగును. అట్లే అజ్ఞాన మంతరించిన మీదట సమస్త విశ్వము ఆత్మ స్వరూపముగానే తెలియవచ్చును.

**స్వయం బ్రహ్మ స్వయం విష్ణుః స్వయమింద్రః స్వయంశివః ।**
**స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన ॥ 389**

స్వయముగా ఆత్మయే బ్రహ్మ. అదియేవిష్ణువు. అదియే యింద్రుడు. అదియే శివుడు. ఈ సమస్త విశ్వమును అదియే. ఆత్మకన్న భిన్నమైనది ఏదియును లేదు.

**అంతః స్వయం చాపి బహిః స్వయం చ**
**స్వయం పురస్తాత్ స్వయమేవ పశ్చాత్ ।**
**స్వయం హ్యవాచ్యాం స్వయమప్యుదీచ్యాం**
**తథోపరిష్టాత్ స్వయమప్యధస్తాత్ ॥ 390**

లోపల నున్నదియు తానే. వెలుపల న్నునదియు తానే. ముందు ఉన్నదియు తానే. వెనుక నున్నదియు తానే. కుడివంక నున్నదియు తానే. ఎడమవంక నున్నదియు తానే. ఉపరిభాగమున ఉన్నదియు తానే. క్రింది భాగమున ఉన్నదియు తానే.

తరంగఫేనభ్రమబుద్బుదాది
సర్వం స్వరూపేణ జలం యథా తథా ।
చిదేవ దేహాద్యహమంతమేతత్
సర్వం చిదేవైకరసం విశుద్ధమ్ ॥ 391

కెరటము, నురుగు, సుడి, బుడగ మొదలైనవాని రూపమున ఉన్నది యెల్ల ఎట్లు జలమే యగునో అట్లే దేహము మొదలు అహంకారపర్యంతముగా ఉన్న యీ విశ్వమంతయు అఖండశుద్ధ చైతన్యమగు ఆత్మయే యగును.

సదేవేదం సర్వం జగదవగతం వాఙ్మనసయోః
సతోఽన్యన్నాస్త్యేవ ప్రకృతిపరసీమ్ని స్థితవతః ।
పృథక్ కిం మృత్స్నాయాః కలశఘటకుంభాద్యవగతం
వదత్యేష భ్రాంతస్త్వమహమితి మాయామదిరయా ॥ 392

మనస్సు ద్వారా, వాక్కు ద్వారా ప్రతీతమగుచున్న యీ జగత్తు అంతయు సత్తుయొక్క స్వరూపమే. ప్రకృతికి అతీతమై యుండు ఆత్మస్వరూపమందు స్థిరపడియుండువాడు ఎవడో వాని దృష్టిలో సత్తుకంటె భిన్నమైనది ఏదియును లేదు. ఘటము, కలశము, కుంభము మున్నగునవి యెల్ల మృత్తిక కన్న భిన్నమైనది యగునా? మాయ యను మదిరచేత నున్మత్తుడైన కారణముననే మానవుడు 'నీవు-నేను' అను భేదబుద్ధి పూర్వకములైన పలుకులు పలుకుచున్నాడు.

క్రియాసమభిహారేణ యత్ర నాన్యదితి శ్రుతిః ।
బ్రవీతి ద్వైతరాహిత్యం మిథ్యాధ్యాసనివృత్తయే ॥ 393

కార్యరూపమగు ద్వైతమును ఉపసంహరించుచు "ఎందు మఱి యేదియును చూడడో" అనునట్టి యద్వైతపరమైన శ్రుతి. మిథ్యా అధ్యాసనివృత్తి కొఱకు పర్యాయముగా ద్వైతము యొక్క అభావమునే తెలుపుచున్నది.

('యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా' (ఛాందోగ్య. 7/24/1) ఇది అద్వైతపరమైన శ్రుతి.)

ఆకాశవన్నిర్మల నిర్వికల్ప
నిస్సీమ నిష్పందన నిర్వికారమ్ ।
అంతర్బహిశ్శూన్య మనన్యమద్వయం
స్వయం పరంబ్రహ్మ కిమస్తి బోధ్యమ్ ॥ 394

ఏ పరబ్రహ్మము స్వయముగా ఆకాశమువలె నిర్మలము, నిర్వికల్పము, నిస్సీమము, నిశ్చలము, నిర్వికారము, లోపల, వెలుపల, ఎల్లవంకల శూన్యము, అనన్యము, అద్వితీయము నైనదో అది జ్ఞానమునకు విషయమగునా? (తెలిసికొన సాధ్యమగునా?)

వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవస్స్వయం
బ్రహ్మైతజ్జగదాతతం ను సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః ।
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్తబాహ్యాః స్ఫుటమ్
బ్రహ్మీభూయ వసంతి సంతతచిదానందాత్మనైవ ధ్రువమ్ ॥ 395

ఈ విషయమునందు అధికముగా చెప్పవలసినది ఏమున్నది? జీవుడు స్వయముగా బ్రహ్మమే. బ్రహ్మమే యీ సమస్త జగద్రూపమున విస్తరించియున్నది. ఏలయనగా బ్రహ్మము అద్వితీయమైనదని శ్రుతి చెప్పుచున్నది. 'నేను బ్రహ్మమునే' అనునటి బోధము గలవారు బాహ్యవిషయములను సర్వవిధముల పరిత్యజించి సర్వదా బ్రహ్మభావముతోను, సచ్చిదానంద స్వరూపముతోనే స్థితులై యుందురనుట నిశ్చయము.

జహి మలమయకోశేఽ హంధియోత్థాపితాశాం
ప్రసభమనిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్ ।
నిగమగదితకీర్తిం నిత్యమానందమూర్తిం
స్వయమితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ ॥ 396

ఈ మలమయమైన కోశమునందు అహంబుద్ధి వలన గలిగిన యాసక్తిని వీడుము. అటుమీదట వాయురూపమైన లింగదేహమునందు కూడ దానిని దృఢముగా విడనాడుము. వేదముల చేత వర్ణింపబడు కీర్తి గలదగు ఆ యానందస్వరూపబ్రహ్మమునే స్వస్వరూపముగా నెఱిగి సర్వదా బ్రహ్మరూపమైన స్థిరుడవై యుండుము.

శవాకారం యావద్భజతి మనుజస్తావదశుచిః
పరేభ్యః స్యాత్క్లేశో జననమరణవ్యాధినిలయః ।
యదాత్మానం శుద్ధం కలయతి శివాకారమచలం
తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి ॥ 397

మానవుడు ఈ శవతుల్యమైన శరీరమునందు ఎంతవఱకు ఆసక్తుడై యుండునో అంతవఱకు అతడు అత్యంతము అపవిత్రుడై యుండును అంతవఱకు జననమరణ వ్యాధులకు ఆశ్రయస్థానమై యతడు పరులవలన అత్యంత క్లేశమును భరింపవలసిన వాడగును. కాని యతడు కల్యాణ స్వరూపము, అచలము, శుద్ధమునగు తన యాత్మను ఎప్పుడు సాక్షాత్కరించికొనుచో అప్పుడు సమస్తక్లేశముల నుండియు విముక్తిని పొందును.

## ప్రపంచ నివారణము

స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తునిరాసతః ।
స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయమక్రియమ్ ॥ 398

తన యాత్మయందు ఆరోపింపబడిన సమస్తకల్పిత వస్తువులను నిరసించివైచిన మీదట మనుష్యుడు స్వయముగా అద్వితీయుడు, క్రియారహితుడు నగు పరబ్రహ్మమే అగును.

సమాహితాయాం సతి చిత్తవృత్తౌ
పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే ।
న దృశ్యతే కశ్చిదయం వికల్పః
ప్రజల్పమాత్రః పరిశిష్యతే తతః ॥ 399

నిర్వికల్పపరమాత్మ యగు పరబ్రహ్మమునందు చిత్తము స్థిరపడిపోయిన మీదట ఈ దృశ్యమైన వికల్పము ఎందును కానరాదు. అప్పుడు ఇది ప్రజల్పమాత్రముగా (వాగాడంబరముగా) నుండిపోవును.

అసత్కల్పో వికల్పోఽయం విశ్వమిత్యేకవస్తుని ।
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః ॥ 400

ఆ ఒకవస్తువగు బ్రహ్మమునందు ఈ ప్రపంచము మిథ్యావస్తువుగా కల్పితమైనది మాత్రమే. కాకున్న నిర్వికారము, నిర్విశేషము అగు వస్తువునందు భేదమెటనుండి వచ్చినది?

ద్రష్టృదర్శనదృశ్యాది భావశూన్యైకవస్తుని ।
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః ॥ 401

ద్రష్ట దృశ్యము, దర్శనము అను బేధములు ఏవియు లేనిదై, నిర్వికారమై, నిరాకారమై, నిర్విశేషమైన ఏకవస్తువునందు భేదము ఎచ్చటనుండి వచ్చినది?

కల్పార్ణవ ఇవాత్యంత పరిపూర్ణైకవస్తుని ।
అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః ॥ 402

నిర్వికారము, నిరాకారము, నిర్విశేషము, ప్రళయకాలసముద్రమువలె అత్యంత పరిపూర్ణమైన యేకపదార్థమందు భేదమెటనుండి వచ్చినది?

తేజసీవ తమో యత్ర ప్రలీనం భ్రాంతికారణమ్ ।
అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః ॥ 403

ప్రకాశమందు అధికారము లయించిపోవు విధముగా దేనియందు భ్రాంతిమూలకమైన అజ్ఞానము లయించిపోవునో ఆ యద్వితీయము, నిర్విశేషమునైన పరతత్త్వమునందు భేదము ఏ యెడనుండి వచ్చునది?

ఏకాత్మకే పరే తత్త్వే భేదవార్తా కథం భవేత్ ।
సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః ॥ 404

ఏకాత్మకము, అద్వితీయము నగు పరతత్త్వమందు భేదప్రసంగము ఎట్లు పొసగును? కేవలము సుఖరూపమగు సుషుప్తియందు భేదమును గన్నవాడు ఎవడు?

న హ్యస్తి విశ్వం పరతత్త్వబోధాత్
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే ।
కాలత్రయే నాప్యహిరీక్షితో గుణే
న హ్యంబుబిందుర్మృగతృష్ణికాయామ్ ॥ 405

పరతత్త్వము బోధపడిన మీదట సత్తు స్వరూపముగా గల నిర్వికల్ప పరబ్రహ్మమునందు విశ్వమన్నది యెందును కానరాదు. త్రికాలములందు ఎందైన ఎవ్వడైన ఎన్నడైన రజ్జువునందు సర్పమును, ఎండమావియందు నీటి బిందువులు జూచెనా? లేదు.

మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః ।
ఇతి బ్రూతే శ్రుతిస్సాక్షాత్సుషుప్తావనుభూయతే ॥ 406

ద్వైతమన్నది మాయామాత్రమైనది. నిజరూపముగా ఉన్నది అద్వైతమే. ఇట్టిదే సుషుప్తియందు కలుగునట్టి యనుభవము కూడ అని సాక్షాత్తు శ్రుతి చెప్పుచున్నది.

అనన్యత్వమధిష్ఠానాదారోప్యస్య నిరీక్షితమ్ ।
పండితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాంతిజీవనః ॥ 407

రజ్జు - సర్పములు మున్నగువానియందు బుద్ధిమంతులైన పురుషులు ఆరోపింపబడిన వస్తువునకు అధిష్ఠానముతోడ అభేదమును స్పష్టముగా గాంచిరి. కావుననే (బ్రహ్మమునందు ఆధ్యాసితమైన యీ ప్రపంచ రూపమగు) వికల్పము అజ్ఞానజన్యమైన భ్రాంతి కారణముననే జీవించియున్నది.

## ఆత్మ చింతన విధానము

చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావే న కశ్చన ।
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని ॥ 408

ఈ వికల్పము చిత్తమూలకమైనది. చిత్తము లేనప్పుడు దీని నామ రూపములు కూడ ఉండవు. కాబట్టి చిత్తమును ప్రత్యక్చైతన్యరూపమైన ఆత్మయందు స్థిరపఱచికొనుము!

కిమపి సతతబోధం కేవలానందరూపం
నిరుపమమతివేలం నిత్యముక్తం నిరీహమ్ ।
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ ॥ 409

నిత్యబోధ స్వరూపము, కేవలానందరూపము, ఉపమానరహితము, కాలాతీతము, నిత్యముక్తము, ఇచ్ఛారహితము, గగనమువలె అనవధికము, కలారహితము, నిర్వికల్పము నగు ఏదియో (అనిర్వచనీయమైన) పూర్ణపరబ్రహ్మమును పండితులైనవారు సమాధిదశయందు తమ యంతః కరణములో సాక్షాత్తు అనుభవములోనికి తెచ్చికొందురు.

ప్రకృతివికృతిశూన్యం భావనాతీతభావం
సమరసమసమానం మానసంబంధదూరమ్ ।
నిగమవచనసిద్ధం నిత్యమస్మత్ప్రసిద్ధం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ ॥ 410

కార్యకారణ రహితము, మానవుల భావనకు అందనిది, సమరసమైనది, ఉపమానరహితమైనది, ప్రమాణములకు అతీతమైనది, వేద వాక్యములచేత సిద్ధించునది, నిత్యమైనది, అస్మద్ (నేను అను) రూపమున ప్రసిద్ధమైనదియు నగు పూర్ణబ్రహ్మమును పండితులు సమాధి దశయందు తమ యంతః కరణములో అనుభవమునకు దెచ్చికొందురు.

అజరమమరమస్తాభాస వస్తుస్వరూపం
స్తిమిత సలిలరాశి ప్రఖ్యమాఖ్యా విహీనమ్ ।
శమితగుణవికారం శాశ్వతం శాంతమేకం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ ॥ 411

జరామరణాలు లేనిది, ఆభాసము లేనిది, వస్తుస్వరూపమగునది, అలలులేని ప్రశాంత సముద్రము వంటిది, నామరూపరహితమైనది, గుణవికారములు లేనిది, నిత్యము, శాంతము, అద్వితీయము నైనదియు నగు పూర్ణబ్రహ్మమును పండితులు సమాధ్యవస్థలో హృదయమునందు ప్రత్యక్షముగా అనుభవింతురు.

సమాహితాంతఃకరణః స్వరూపే
విలోకయాత్మానమఖండవైభవమ్ ।
విచ్ఛింధి బంధం భవగంధగంధితం
యత్నేన పుంస్త్వం సఫలీకురుష్వ ॥ 412

స్వస్వరూపమందు చిత్తమును స్థిరపఱచికొని అఖండైశ్వర్యసంపన్నమైన యాత్మను సాక్షాత్కరించికొనుము. సంసారపు వాసనలు గల బంధనమును ఖండించివేయుము! ప్రయత్నపూర్వకముగా నీమానవజన్మమును సఫలమొనర్చికొనుము!

సర్వోపాధివినిర్ముక్తం సచ్చిదానందమద్వయమ్
భావయాత్మానమాత్మస్థం న భూయః కల్పసే-ధ్వనే ॥ 413

ఏ యుపాధులనను లేనిదై, అద్వితీయమై, సచ్చిదానంద స్వరూపమై నీ యంతఃకరణమందు నెలకొని యున్న యాత్మను చింతనము చేయుచుండుము! అట్లయిన సంసారచక్రమందు పడకుందువు.

## దృశ్యమును ఉపేక్షించుట

ఛాయేవ పుంసః పరిదృశ్యమాన
మాభాసరూపేణ ఫలానుభూత్యా ।

శరీరమారాచ్ఛవవన్నిరస్తం
పునర్న సంధత్త ఇదం మహాత్మా ॥ 414

మానవుని యొక్క నీడవలె కేవలము ఆభాసరూపముగా గానవచ్చు ఈ శరీరమును, దీని ఫలమును గూర్చి ఆలోచించి శవమునువలె నిరసించివైచిన మీదట, మహాత్ములైనవారు దీనిని మరల స్వీకరింపరు.

సతతవిమలబోధానందరూపం సమేత్య
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే ।
అథ పునరపి నైష స్మర్యతాం వాంతవస్తు
స్మరణ విషయభూతం కల్పతే కుత్సవాయ ॥ 415

నిత్యము, నిర్మలము, చిదానందమయమునగు నీ స్వరూపమును పడసి ఈ మలరూపము, జడమునగు ఉపాధిని దూరము నుండియే సర్వవిధముల పరిత్యజించివేయుము! ఇక మఱల దానిని ఎన్నడును తలపనైన తలపవలదు. ఏలయనగా వమనము చేయబడిన పదార్థమును తలచికొన్న, జుగుప్సను గలిగించి మనస్సును పాడుచేయును.

సమూల మేతత్పరిదహ్య వహ్నౌ
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే ।
తతః స్వయం నిత్యవిశుద్ధబోధా
నందాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః ॥ 416

విచారణ చేయువారిలో శ్రేష్ఠులగు మహాత్ములు ఈ స్థూలము, సూక్ష్మమునగు ప్రపంచము నెల్ల దీనికి మూలకారణమగు మాయతో సహితముగా నిర్వికల్పము, సత్తురూపమునగు బ్రహ్మాగ్నియందు భస్మము గావించి తాము నిత్యము, విశుద్ధమునగు బోధానందస్వరూపముతో స్థిరత్వము నందియుందురు.

ప్రారబ్ధసూత్రగ్రథితం శరీరం
ప్రయాతు వా తిష్ఠతు గోరివ స్రక్ ।

న తత్పునః పశ్యతి తత్త్వవేత్తా
ఉఽఽనందాత్మని బ్రహ్మణి లీనవృత్తిః ॥ **417**

గోవు తన మెడలో నున్న దండ ఉన్నదా? పడిపోయినదా? అన్న విషయము మీద తలపును నిలుపనైన నిలుపదు. ఆ విధముగనే ప్రారబ్ధపు సూత్రమందు కూర్చబడిన యీ శరీరము నిలచుగాక! నిలువకుండుగాక! ఆనంద స్వరూపమగు బ్రహ్మమునందు లీనమైన చిత్తవృత్తి గల తత్త్వవేత్త యిక దీని వంకకు చూడనైన చూడడు.

అఖండానందమాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః ।
కిమిచ్ఛన్ కస్య వా హేతోర్దేహం పుష్ణాతితత్త్వవిత్ ॥ **418**

ఆఖండానంద స్వరూపమగు ఆత్మయే స్వస్వరూపమని తెలిపికొన్న మీదట తత్త్వవేత్త యగువాడు ఇక ఏ కోరికతో, ఏ కారణమున ఈ శరీరమును పోషించును?

## ఆత్మజ్ఞానమునకు ఫలము

సంసిద్ధస్య ఫలం త్వేతజ్జీవన్ముక్తస్య యోగినః ।
బహిరంతస్సదానందరసాస్వాదనమాత్మని ॥ **419**

తగిన విధముగా ఆత్మజ్ఞానమందు సిద్ధినిగన్న జీవన్ముక్తుడైన యోగికి తన యాత్మకు చెందిన నిత్యానందరసమును లోపల, వెలుపల నిరంతరము ఆస్వాదించుచుండుటయే ఫలము.

వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్ ।
స్వానందానుభవాచ్ఛాంతిరేషైవోపరతేః ఫలమ్ ॥ **420**

వైరాగ్యమునకు ఫలము బోధము. బోధమునకు ఫలము ఉపరతి. అనగా విషయముల యెడల ఔదాసీన్యము. ఆ యుపరతికి ఆత్మానందానుభవముతో చిత్తశాంతిని పొందుటయే ఫలము.

యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వం తునిష్ఫలమ్।
నివృత్తిః పరమాతృప్తిరానందోఽనుపమః స్మృతః ॥ 421

వెనుక వెనుక వస్తువులు ప్రాప్తింపకున్న ముందు ముందు ఎనయదగిన విషయములు నిరర్థకములగును. అనగా ఆత్మశాంతి లేక యుపరతియు, ఉపరతి లేక బోధము, బోధము లేక వైరాగ్యము నిష్ఫలములని భావము. విషయముల నుండి నివర్తిల్లుటయే పరమతృప్తి. అదియే సాక్షాత్తు అనుపమానమైన యానందము.

దృష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాః ప్రస్తుతంఫలమ్ ।
యత్కృతం భ్రాంతివేలాయాం నానాకర్మజుగుప్సితమ్ ।
పశ్చాన్నరో వివేకేన తత్కథం కర్తుమర్హతి ॥ 422

ప్రారబ్ధవశమున ప్రాప్తించిన దుఃఖముల చేత విచలితుడు కాకుండుటయే ఆత్మజ్ఞానమునకు మొదటి ఫలము. భ్రాంతి కాలమందు మనుజుడు జుగుప్సాకరములైన పనులు ఎన్నియో చేయును. కాని జ్ఞానము కలిగిన పిదప అతడు అట్టి పనులను వివేక పూర్వకముగా ఎట్లు చేయ గలుగును?

విద్యాఫలం స్యాదసతో నివృత్తిః
ప్రవృత్తిరజ్ఞానఫలం తదీక్షితమ్ ।
తజ్జ్ఞాజ్ఞయోర్యన్మృగతృష్ణికాదౌ
నో చేద్విదో దృష్టఫలం కిమస్మాత్ ॥ 423

విద్యకు అసత్తునుండి నివర్తిల్లుట ఫలము. అవిద్యకు అసత్తుయందు ప్రవర్తిల్లుట ఫలము. ఈ రెండు ఫలములు జ్ఞానికి, అజ్ఞానికి మృగ తృష్ణాదులయందు కలుగు ప్రతీతులయందు దానిని తెలిసికొన్న లేక తెలిసికొనని వారలయందు చూడబడినవి. అట్లు కానివాడు (మూఢునకు వలె పండితునకు కూడ అసత్తు పదార్థములందు ప్రవృత్తి యున్నచో) ఇక విద్యకు ప్రత్యక్ష ఫలము ఏమి కలిగినది?

అజ్ఞానహృదయగ్రంథేర్వినాశో యద్యశేషతః ।
అనిచ్ఛోర్విషయః కిన్ను ప్రవృత్తేః కారణం స్వతః ॥ **424**

అజ్ఞాన హృదయగ్రంథి సర్వవిధముల నశించిన మీదట ఆ ఇచ్ఛా రహితుడైన పురుషునకు సాంసారిక విషయములు స్వతఃప్రవృత్తికి కారణభూతములగునా?

వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య పరోఽవధిః ।
అహంభావోదయాభావో బోధస్య పరమోఽవధిః ।
లీనవృత్తేరనుత్పత్తిర్మర్యాదోపరతేస్తు సా ॥ **425**

భోగ్య వస్తువుల యెడల వాసన కలుగకుండుటయే వైరాగ్యమునకు పరమావధి. చిత్తమునందు ఏ విధముగను అహంకారము ఉదయింప కుండుటయే బోధమునకు పరమావధి. లీనమైపోయిన వృత్తులు మఱల తల యెత్తకుండుటయే బోధమునకు పరమావధి. లీనమైపోయిన వృత్తులు మఱల తల యెత్తకుండుటయే ఉపరతికి చరమసీమ.

## జీవన్ముక్తుని లక్షణములు

బ్రహ్మాకారతయా సదా స్థితతయా నిర్ముక్తబాహ్యార్థధీ
రన్యావేదిత భోగ్యభోగకలనో నిద్రాళువద్బాలవత్ ।
స్వప్నాలోకితలోకవజ్జగదిదం పశ్యన్ క్వ చిల్లబ్ధధీ
రాస్తే కశ్చిదనంతపుణ్యఫలభుగ్ధన్యః స మాన్యోభువి ॥ **426**

బ్రహ్మాకార వృత్తితో స్థితుడైయున్న కారణమున ఎవని బుద్ధి విషయముల దిక్కునుండి నివర్తిల్లిపోయినదో, ఎవడు నిద్రాగతునివలెను, బాలకునివలెను అన్యులు నివేదించిన భోగ్యపదార్థములనే సేవించునో, ఎవడు తన బుద్ధి విషయముల మీదకు పోయినప్పుడు ఈ ప్రపంచమును స్వప్నతుల్యముగా జూచునో ఆ యనంత పుణ్యఫలమును అనుభవించునట్టి యే జ్ఞానియగు మహాపురుషుడో ఈ పుడమిపై ధన్యుడు, మాననీయుడు నగును.

స్థితప్రజ్ఞో యతిరయం యస్సదాఽఽనందమశ్నుతే ।
బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః ॥ 427

పరబ్రహ్మమునందు చిత్తమును లయింపజేసి వికారాదులను, క్రియలను వీడి సర్వదా ఆనందరూపపరబ్రహ్మమునందు నిమగ్నుడై యుండువాడు స్థితప్రజ్ఞుడనబడును.

బ్రహ్మాత్మనోః శోధితయోరేకభావావగాహినీ ।
నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే ।
సుస్థితా సా భవేద్యస్య జీవన్ముక్తః స ఉచ్యతే ॥ 428

('తత్త్వమసి' ఆదిగా గల మహావాక్యముల చేత) శోధింపబడి బ్రహ్మమునకు, ఆత్మకును గల యేకత్వమును స్వీకరించునట్టి వికల్పరహితమైన చిత్తవృత్తిని ప్రజ్ఞ యందురు. ఎవనియందు ఈ చిన్మాత్రవృత్తి స్థిరపడిపోవునో అతడే జీవన్ముక్తుడనబడును.

యస్య స్థితా భవేత్ప్రజ్ఞా యస్యానందో నిరంతరః ।
ప్రపంచో విస్మృతప్రాయః స జీవన్ముక్త ఇష్యతే ॥ 429

స్థిరమైన ప్రజ్ఞ గలవాడు, నిరంతరమును ఆత్మానందము ననుభవించుచున్నవాడు, ప్రపంచమును విస్మృతప్రాయము గావించికొన్నవాడును అగు పురుషుడు జీవన్ముక్తుడనబడును.

లీనధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మవర్జితః ।
బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే ॥ 430

చిత్తవృత్తులు లయించియున్నను ఎవడు జాగృతుడై యుండుచూ, జాగ్రద్దశకు సంబంధించిన ధర్మములు లేనివాడై యుండునో, ఎవని బోధము సర్వవిధముల వాసనావిరహితము అయిపోయెనో ఆ పురుషుడు జీవన్ముక్తుడనబడును.

('చిత్తవృత్తులు లయించి యున్నను జాగృతుడై యుండువాడు' అన్నదాని భావము ఇది - సమస్తదృశ్య పదార్థములను నిషేధించి అతని చిత్తము

నిరంతరమును బ్రహ్మమునందు లీనమై యున్నను అతడు నిద్రించినవానివలె సంజ్ఞాశూన్యుడు కాజాలడు. ఎల్ల కార్యములను యథాపూర్వకముగా నిర్వర్తించుచునే యుండును. కాని యట్లు అతడుసర్వవ్యవహారసాధన చేయుచున్నను వానిని స్వప్నతుల్యములని యెంచికొన్నవాడగుటచేత అతనికి ఇతర పురుషులకు వలె దృశ్యపదార్థములందు ఆసక్తి యుండదు. కాబట్టి వస్తుస్థితిని అరయగా అతడు జాగ్రద్దశా ధర్మములు లేనివాడేయగును.)

**శాంతసంసారకలనః కలావానపి నిష్కలః ।**
**యస్స్వచిత్తోఽపి నిశ్చింతః స జీవన్ముక్త ఉచ్యతే ॥ 431**

ఎవని సంసారవాసన శాంతించిపోయెనో, ఎవడు కలావంతుడై యుండియు కలారహితుడో అనగా వ్యవహారదృష్టిలో పైకి వికారములు కలవాడుగా కానవచ్చుచున్నను ఎవడు సర్వదా నిర్వికారస్వరూపుడై యుండునో, ఎవడు చిత్తము గలిగియుండియు చింతలు లేనివాడై యుండునో అట్టి పురుషుడు జీవన్ముక్తుడనబడును.

**వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయావదనువర్తిని ।**
**అహంతామమతాఽభావో జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 432**

ప్రారబ్ధము సమాప్తమగునంత వఱకు నీడవలె సర్వదా వెంట నుండునట్టి యీ శరీరము ఉన్నను కూడా ఇందు అహంకార మమకారములు లేక యుండుట జీవన్ముక్తుని లక్షణము.

**అతీతాననుసంధానం భవిష్యదవిచారణమ్ ।**
**ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 433**

గతించిన విషయములను తలపకుండుట, భావిని గూర్చి ఆలోచించకుండుట యీ గుణదోషమయమైన ప్రపంచమందు సర్వత్ర సమదృష్టి గలిగియుండుట జీవన్ముక్తుని లక్షణము.

**గుణదోషవిశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే ।**
**సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 434**

తన యాత్మ స్వరూపమునకన్న భిన్నముగా నున్న యీ గుణదోష మయమైన ప్రపంచమందు సర్వత్ర సమదృష్టి గలిగియుండుట జీవన్ముక్తుని లక్షణము.

**ఇష్టానిష్టార్థసంప్రాప్తౌ సమదర్శితయాత్మని ।**
**ఉభయత్రావికారిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 435**

ఇష్టవస్తువు, అనిష్టవస్తువు - ఏది ప్రాప్తించినను సమానభావము కలిగియున్న కారణమున ఆ రెండు దశలయందును చిత్తములో ఎట్టి వికారమును కలుగకయుండుట జీవన్ముక్త పురుషుని లక్షణము.

**బ్రహ్మానందరసాస్వాదాసక్త చిత్తతయా యతేః ।**
**అంతర్బహిరవిజ్ఞానం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 436**

బ్రహ్మానందరసాస్వాదమునందు చిత్తము ఆసక్తిగొనియున్న కారణమున బాహ్యవస్తువులయొక్క, ఆంతరిక వస్తువులయొక్క పరిజ్ఞానము ఏమియు లేకుండుట జీవన్ముక్తుడైన యతి లక్షణము.

**దేహేంద్రియాదౌ కర్తవ్యే మమాహంభావవర్జితః ।**
**ఔదాసీన్యేన యస్తిష్ఠేత్స జీవన్ముక్తలక్షణః ॥ 437**

దేహము, ఇంద్రియములు మున్నగువానియందును, కర్తవ్యమందును ఎవడు మమకారమును, అహంకారమును లేకయుండునో, ఉదాసీనత వహించునో ఆ పురుషుడు జీవన్ముక్త లక్షణము గలవాడగును.

**విజ్ఞాత ఆత్మనో యస్య బ్రహ్మభావః శ్రుతేర్బలాత్ ।**
**భవబంధవినిర్ముక్తస్స జీవన్ముక్తలక్షణః ॥ 438**

ఎవడు శ్రుతి ప్రమాణముల మూలమున తన యాత్మయొక్క బ్రహ్మత్వమును తెలిసికొనెనో, ఎవడు సంసారబంధరహితుడై యుండునో ఆ పురుషుడు జీవన్ముక్త లక్షణము గలవాడు.

**దేహేంద్రియేష్వహంభావ ఇదం భావస్తదన్యకే ।**
**యస్య నో భవతః క్వాపి స జీవన్ముక్త ఇష్యతే ॥ 439**

ఎవనికి దేహేంద్రియాదులయందు అహంభావమును, అన్యవస్తువులందు ఇదం (ఇది యను) భావమును లేవో అతడు జీవన్ముక్తుడని తలపబడును.

న ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాఽపి బ్రహ్మసర్గయోః ।
ప్రజ్ఞయా యో విజానాతి స జీవన్ముక్త ఇష్యతే ॥ 440

గంభీరముగా తత్త్వపరిశీలనము చేయగల తన బుద్ధిచేత ఆత్మకు, బ్రహ్మమునకు నడుమ, బ్రహ్మకు సృష్టికి (సంసారము లేక ప్రపంచము) నడుమ ఎవడు భేదమును చూడడో ఆ పురుషుడు జీవన్ముక్తుడు అనబడును.

సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానేఽపి దుర్జనైః ।
సమభావో భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే ॥ 441

సజ్జనులచేత ఈ శరీరము సత్కరింపబడినప్పుడు, దుర్జనుల చేత పీడింపబడినప్పుడు - రెండు దశలయందును ఎవని చిత్తము సమభావము వహించియుండునో అతడు జీవన్ముక్తుడని తలపబడును.

యత్ర ప్రవిష్టా విషయాః పరేరితా
నదీప్రవాహా ఇవ వారిరాశౌ ।
లీనంతి సన్మాత్రతయా న విక్రియా
ముత్పాదయంత్యేష యతిర్విముక్తః ॥ 442

సముద్రములో కలిసిపోయిన నదీప్రవాహములు సముద్రరూపమునే ధరించును. అట్లే యితరులచేత సిద్ధము చేయబడిన విషయములు ఆత్మస్వరూపములుగా ప్రతీతములు అగుట మూలమున ఎవని చిత్తమునందు ఎట్టి క్షోభమును ఉదయింపకుండునో ఆ యతిశ్రేష్ఠుడు జీవన్ముక్తుడు.

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః ।
అస్తిచేన్న స విజ్ఞాత బ్రహ్మభావో బహిర్ముఖః ॥ 443

బ్రహ్మ తత్త్వమును ఎఱిగిన పండితునకు పూర్వమందువలె సంసారమునందు ఆసక్తియుండదు. అట్లు గాక యింకను ఆసక్తి యుండెనేని వానిని సంసారియే యనియు, వానికి బ్రహ్మతత్త్వజ్ఞానము కలుగలేదనియు భావింపవలెను.

ప్రాచీనవాసనావేగాదసౌ సంసరతీతి చేత్ ।
న సదేకత్వ విజ్ఞానాన్మందీ భవతి వాసనా ॥ 444

పూర్వవాసనా ప్రాబల్యము కారణముగా మరల అతనికి సంసారమునందు ప్రవృత్తి కలుగవచ్చునందువా? అట్టి విషయము ఏదియును లేదు. ఏలయన్న బ్రహ్మముయొక్క ఏకత్వ పరిజ్ఞానము వలన వానిలోని వాసన క్షీణించిపోవగలదు.

అత్యంత కాముకస్యాపి వృత్తిః కుంఠతిమాతరి ।
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః ॥ 445

అత్యంతకాముకుడైనవాని కామప్రవృత్తి కూడ తల్లిని జాడగా నశించిపోవును. అట్లే పూర్ణానంద స్వరూపుడైన బ్రహ్మమును తెలిసికొన్న మీదట పండితుడైనవానికి సంసారమునందు ప్రవృత్తి కలుగనేరదు.

## ప్రారబ్ధ విచారణము

నిదిధ్యాసనశీలస్య బాహ్యప్రత్యయ ఈక్ష్యతే ।
బ్రవీతి శ్రుతిరేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్ ॥ 446

నిదిధ్యాసనమందు అనగా ఆత్మ చింతనమందు నిమగ్నుడైన పురుషునకు బాహ్యపదార్థముల ప్రతీతి కలుగుచుండుట చూడబడినది. ఫలభోగము కానవచ్చుటచేత శ్రుతి దానిని అతని ప్రారబ్ధమని చెప్పుచున్నది.

సుఖాద్యనుభవో యావత్తావత్ప్రారబ్ధమిష్యతే ।
ఫలోదయః క్రియాపూర్వో నిష్క్రియో న హికుత్రచిత్॥ 447

(యుక్తిచేత గూడ) సుఖదుఃఖాదుల అనుభవము ఫలభోగము

ఉండునంతవఱకు ప్రారబ్ధము ఉన్నదని భావింపబడును. ఏలయనగా ఫలభోగము క్రియాపూర్వకమై యుండును. ముందు కర్మలేనిచో ఫలము గలుగదు.

అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితమ్ ।
సంచితం విలయం యాతిప్రబోధాత్స్వప్నకర్మవత్ ॥ **448**

మేలుకొన్న మీదట స్వప్నగతములైన కర్మలు అంతరించిపోవు విధముగా 'నేను బ్రహ్మమును' అన్న జ్ఞానము కలిగినంతనే శతకోటికల్పముల నుండియు కూడబెట్టబడిన కర్మలు అన్నియు అంతరించిపోవును.

యత్కృతం స్వప్నవేలాయాం పుణ్యంవా పాపముల్బణమ్ ।
సుప్తోత్థితస్య కిం తత్స్యాత్ స్వర్గాయ నరకాయవా॥ **449**

స్వప్నదశయందు చేయబడిన మహామహాపుణ్యములు గాని, పాపములు గాని మేలుకొన్నమీదట స్వర్గప్రాప్తికి గాని, నరకప్రాప్తికి గాని కారణభూతములుగాగలవా?

స్వమసంగముదాసీనం పరిజ్ఞాయ నభో యథా ।
న శ్లిష్యతే యతిః కించిత్ కదాచిద్భావికర్మభిః ॥ **450**

ఆకాశమువలె తనను సంగరహితునిగాను, ఉదాసీనునిగాను (అనుభవపూర్వకముగా) తెలిసికొన్న యతీశ్వరుడు రాబోవునట్టి యే కర్మముచేతను ఒకింతయు లిప్తుడు కాడు.

న నభో ఘటయోగేన సురాగంధేన లిప్యతే ।
తథాత్మోపాధియోగేన తద్ధర్మైర్నైవ లిప్యతే ॥ **451**

కడవతోడి సంపర్కము వలన అందున్న మద్యము యొక్క గంధముచేత ఆకాశము లిప్తము గాదు.అట్లే ఉపాధి సంబంధముచేత ఆత్మ కూడ ఉపాధి ధర్మములను అంటకుండును.

జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి ।
అదత్వా సఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్ ॥ 452
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తుగోమతౌ ।
న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్ ॥ 453

లక్ష్యము వంకకు విడువడిన బాణమువలె జ్ఞానము కలుగుటకు పూర్వమందు ఆరంభించబడిన కర్మ ఫలమును ఈయక మానదు. అది జ్ఞానము వలన నశింపదు. వ్యాఘ్రమని భ్రమించి గోవు దిక్కుగా ప్రయోగింపబడిన బాణము పిమ్మట అది పులి కాదు గోవు అన్న జ్ఞానము కలిగినను మధ్యలో నిలిపివేయబడజాలదు. వెంటనే లక్ష్యమును ఛేదించి తీరును.

ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః
సమ్యగ్ జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినామ్ ।
బ్రహ్మాత్మైక్యమవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా
స్తేషాం తత్త్రితయం న హి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్ ॥ 454

పండితుడైనవాని ప్రారబ్ధము అవశ్యము ప్రబలమైనది యగును. అనుభవించుట వలననే అది క్షయము నందును. పూర్వసంచితములైనవి, ముందు జరగనున్నవియు నగు కర్మలు మాత్రము తత్త్వజ్ఞానాగ్నిచే క్షయమునొందును. కాని బ్రహ్మమునకు, ఆత్మకును సంబంధించిన ఏకత్వమును దెలిసికొని సర్వదా ఆ భావమునందే నిలిచియుండువారి దృష్టిలో అవి అనగా ఆగామి, సంచితము, ప్రారబ్ధము రూపమున ఉన్న మూడు విధముల కర్మలును కూడ లేనివే యగును. అట్టివారు సాక్షాత్తు నిర్గుణ పరబ్రహ్మములా? యని యెన్నదగినవారు.

ఉపాధితాదాత్మ్య విహీన కేవల
బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో మునేః ।
ప్రారబ్ధసద్భావకథా న యుక్తా
స్వప్నార్థసంబంధకథేవ జాగ్రతః ॥ 455

ఉపాధి సంబంధమును వీడి కేవలము బ్రహ్మాత్మభావముతో స్వస్వరూపమునందు స్థితుడై యుండు మునిశ్రేష్ఠుని ప్రారబ్ధ కర్మముల స్థితి స్వప్నదృష్టములైన పదార్థములతోడ మేలుకొన్న మీదట పురుషునకు ఎట్టి సంబంధము ఉండునో అట్టిది యని యెన్నదగును.

న హి ప్రబుద్ధః ప్రతిభాసదేహే
దేహోపయోగిన్యపి చ ప్రపంచే ।
కరోత్యహంతా మమతామిదంతాం
కింతు స్వయం తిష్ఠతి జాగరేణ ॥ 456

స్వప్నదశనుండి మేలుకొన్న పురుషుడు ఆ స్వప్నమందలి ప్రాతిభాసిక దేహము, ఆ దేహమునకు ఉపయుక్తమైన స్వప్న ప్రపంచములయందు అహంకారమును (నేను అను కర్తృభావమును), మమకారమును (నాదియును భావము) ఇదంభావమును (ఇది యను భావమును) పాటించడు. అతడు కేవలము జాగ్రద్భావమునే వహించి యుండును.

న తస్య మిథ్యార్థసమర్థనేచ్ఛా
న సంగ్రహస్తజ్జగతోఽపి దృష్టః
తత్రానువృత్తిర్యది చేన్మృషార్థే
న నిద్రయా ముక్త ఇతీష్యతే ధ్రువమ్ ॥ 457

అతనికి మిథ్యా పదార్థములను సమర్థింపవలె నన్న యిచ్ఛయునుండదు. అతని కడ సాంసారిక పదార్థముల సంగ్రహమును ఉండదు. (కానరాదు.) అట్లు కాక అతనికి ఇంకను మిథ్యాపదార్థములందు ప్రవృత్తి మిగిలియుండెనేని నిశ్చయముగా వాని మోహనిద్ర తొలగలేదనియే తలపవలయును.

తద్వత్పరే బ్రహ్మణి వర్తమానః
సదాత్మనా తిష్ఠతి నాన్యదీక్షతే ।
స్మృతిర్యథా స్వప్నవిలోకితార్థే
తథా విదః ప్రాశనమోచనాదౌ ॥ 458

ఆ విధముగానే సర్వదా బ్రహ్మభావమందు నిలిచియుండువాడు ఆ బ్రహ్మరూపముతోనే స్థితుడై యుండును. అతడు బ్రహ్మమును దక్క అన్యము ఏదియును చూడడు. స్వప్నదృష్టములైన పదార్థములు తలపునకు వచ్చువిధముగా పండితుడైనవాని భోజనము చేయుట, వీడుట మున్నగు క్రియలు స్వాభావికముగా వానియంతటఅవి సాగిపోవును.

**కర్మణా నిర్మితో దేహః ప్రారబ్ధం తస్య కల్ప్యతామ్ ।**
**నానాదేరాత్మనో యుక్తం నైవాత్మా కర్మనిర్మితః ॥ 459**

శరీరము కర్మలచేత నిర్మితమైనది. కావున ప్రారబ్ధము కూడ దానిదే యని భావింపవలెను. ఆ ప్రారబ్ధము అనాదియైన ఆత్మకు చెందినది అని తలచుట యుక్తముకాదు. ఏలయనగా ఆత్మ కర్మనిర్మితమైనది కాదు.

**అజో నిత్య ఇతి బ్రూతే శ్రుతిరేషాత్వమోఘవాక్ ।**
**తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా ॥ 460**

యథార్థమును వివరించునట్టి శ్రుతి ఆత్మ జన్మరహితమైనదని, నిత్యమైనదని, అనాది యని వక్కాణించుచున్నది. అట్టియెడ సర్వదా ఆయాత్మ స్వరూపముతోనే స్థితుడై యుండు పండితుని ప్రారబ్ధకర్మలు మిగిలియుండునన్న కల్పనయైనను ఎట్లు చేయవచ్చును?

**ప్రారబ్ధం సిద్ధ్యతి తదా యదా దేహాత్మనా స్థితిః ।**
**దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతామతః ॥ 461**

దేహమందు ఆత్మభావము ఉండునంత వఱకు మాత్రము ప్రారబ్ధము సిద్ధమగుచుండును. ముముక్షువునకు దేహాత్మభావము ఇష్టము కాదు. కాబట్టి ప్రారబ్ధ దశను కూడ విడిచిపెట్టవలెను.

**శరీరస్యాపి ప్రారబ్ధకల్పనా భ్రాంతిరేవ హి ।**
**అధ్యస్తస్య కుతస్సత్త్వమసత్త్వస్య కుతో జనిః ।**
**అజాతస్య కుతో నాశః ప్రారబ్ధమసతఃకుతః ॥ 463**

నిజమరయుగా శరీరమునకు కూడ ప్రారబ్ధభావన భ్రాంతియే యగును. ఏలయనగా అది స్వయముగా అధ్యస్త (భ్రాంతిచేత కల్పిత) మైనది. అధ్యస్త వస్తువునకు సత్తా(అస్తిత్వము) ఎక్కడ నుండును అస్తిత్వమే లేనిదానికి జన్మము మాత్రము ఎటనుండి వచ్చినది? జన్మమే లేనిదానికి నాశము ఎట్లు కలుగును? ఈ విధముగా ఏది సర్వవిధముల ఉనికిలేనిదో దానికి ప్రారబ్ధము ఎట్లు కలుగును?

జ్ఞానేనాజ్ఞానకార్యస్య సమూలస్య లయో యది ।
తిష్ఠత్యయం కథం దేహ ఇతి శంకావతో జడాన్ ।
సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధం వదతిశ్రుతిః ॥ 463
న తు దేహాది సత్యత్వ బోధనాయ విపశ్చితామ్ ।
యతః శ్రుతేరభిప్రాయః పరమార్థైకగోచరః ॥ 464

జ్ఞానము వలన అజ్ఞానము సమూలముగా నశించినప్పుడు జ్ఞానికి ఈ స్థూలదేహము ఎట్లు నిలుచును అని శంకించునట్టి మూఢులను సమాధానపఱచుటకై శ్రుతి బాహ్యదృష్టితో దానికి కారణము ప్రారబ్ధమని చెప్పుచున్నది. అది పండితునకు దేహాదులు సత్యములని బోధించుటకు అట్లు చెప్పుటలేదు ఏలయనగా కేవలమొక్క పరమార్థవస్తువును వివరించుట మాత్రమే శ్రుతియొక్క అభిప్రాయము.

## నానాత్మ నిషేధము

పరిపూర్ణమనాద్యంతమప్రమేయమవిక్రియమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాఽస్తి కించన ॥ 465

నిజమరయుగా సర్వత్ర పరిపూర్ణము ఆదిరహితము, అంతరహితము, అప్రమేయము, వికారరహితము, ఏకము, అద్వితీయమునగు బ్రహ్మమే నిండియున్నది. అందువేఱుగా నానాపదార్థజాతము (సమూహము) ఏదియును లేదు.

సద్ఘనం చిద్ఘనం నిత్యమానందఘనమక్రియమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన ॥ 466

ఘనీభవించిన సత్తు, చిత్తు, ఆనందము ఏది కలదో ఆ నిత్యము, ఏకము, క్రియారహితము, అద్వితీయమునగు బ్రహ్మము ఒక్కటియే సత్యవస్తువు, అందు నానా పదార్థసముదాయము ఏదియును లేదు.

ప్రత్యగేకరసం పూర్ణమనంతం సర్వతోముఖమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాఽస్తి కించన ॥ 467

అంతరాత్మయు, ఏకరసము, పరిపూర్ణము, అనంతము, సర్వవ్యాపకమునగు అద్వితీయ బ్రహ్మము ఒక్కటియే యున్నది. అందు నానాపదార్థసముదాయము ఏదియును లేదు.

అహేయమనుపాదేయ మనాధేయమనాశ్రయమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మనేహ నానాఽస్తి కించన ॥ 468

విడువలసినది కానిది, గ్రహించవలసినది కానిది, ఎందును ఉంచుటకు శక్యము కానిది, ఇతరమైన ఆధారము ఏదియు లేనిది, అద్వితీయమైనదియు నగు బ్రహ్మము ఒక్కటియే సత్యమైనది. అందు నానాపదార్థ సముదాయము ఏదియును లేదు.

నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మనేహ నానాఽస్తి కించన ॥ 469

గుణరహితమై, కలారహితమై, సూక్ష్మమై, నిర్వికల్పమై, నిర్మలమై యొప్పునట్టి అద్వితీయ బ్రహ్మపదార్థము ఒక్కటియే సత్యమై యున్నది. అందు నానాపదార్థజాతము ఏదియును లేదు.

అనిరూప్యస్వరూపం యన్మనోవాచామగోచరమ్ ।
ఏకమేవాద్వయం బ్రహ్మనేహ నానాఽస్తి కించన ॥ 470

వర్ణింపనలవి గాని రూపము గలది, మనస్సునకు, వాక్కునకు గోచరము

కానట్టిది, అద్వితీయమైనదియు నగు బ్రహ్మము ఒక్కటియే యున్నది. అందు నానావిధవస్తు సముదాయము ఏదియును లేదు.

**సత్సమృద్ధం స్వతస్సిద్ధం శుద్ధం బుద్ధమనీదృశమ్ ।**
**ఏకమేవాద్వయం బ్రహ్మనేహ నానాఽస్తి కించన ॥ 471**

సత్యమై, వైభవసంపన్నమై, స్వతస్సిద్ధమై, శుద్ధమై, జ్ఞానస్వరూపమై, ఉపమానరహితమై యొప్పునొకే ఒక అద్వితీయబ్రహ్మము ఉన్నది. అదియే సత్యమైనది. అందు నానాపదార్థ సముదాయము ఏదియును లేదు.

## ఆత్మానుభవము యొక్క ఉపదేశము

నిరస్తరాగా నిరపాస్తభోగాః
శాంతాస్సుదాంతా యతయో మహాంతః ।
విజ్ఞాయ తత్త్వం పరమేతదంతే
ప్రాప్తాః పరాం నిర్వృతిమాత్మయోగాత్ ॥ 472

ఎవరికి ఏ వస్తువునందును రాగవృత్తి లేకుండునో, భోగాపేక్ష కూడ శాంతించిపోయెనో, చిత్తము శాంతించి ఇంద్రియములు ఉపరతములయ్యెనో అట్టి మహాత్ములైన సన్న్యాసులు మాత్రము యీ పరమతత్త్వమును దెలిసికొని కడపట ఈ అధ్యాత్మయోగము ద్వారా పరమశాంతిని పొందియున్నారు.

భవానపీదం పరతత్త్వ మాత్మనః
స్వరూపమానంద ఘనం విచార్య ।
విధూయ మోహం స్వమనః ప్రకల్పితం
ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః ॥ 473

కావున ఓ వత్సా! నీవు కూడ ఆత్మయొక్క యీ పరమతత్త్వమును, ఆనందఘన స్వరూపమును విచారము చేయుచు నీ మనస్సులో కల్పితమైన మోహమును వీడి ముక్తుడవు కమ్ము! ఈ విధముగా అజ్ఞాననిద్ర నుండి మేల్కొని కృతకృత్యుడవుగమ్ము!

సమాధినా సాధు వినిశ్చలాత్మనా
పశ్యాత్మతత్త్వం స్ఫుటబోధచక్షుషా ।
నిస్సంశయం సమ్యగవేక్షితశ్చే
చ్ఛ్రుతః పదార్థో న పునర్వికల్ప్యతే ॥ 474

సమాధిమూలమున చక్కగా నిశ్చలత్వము వెలసిన చిత్తము, ప్రస్ఫుటములైన జ్ఞాననేత్రములును గలిగియుండి యాత్మతత్త్వమును అవలోకింపుము! ఏలయనగా విన్నయట్టి పదార్థము చక్కగా చూడబడుట సంభవమయ్యేనేని దాని విషయమున ఇక ఎట్టి సంశయమునకును తావుండదు.

స్వస్యావిద్యాబంధసంబంధమోక్షాత్
సత్యజ్ఞానానందరూపాత్మలబ్ధౌ ।
శాస్త్రం యుక్తిర్దేశికోక్తిః ప్రమాణం
చాంతస్సిద్ధా స్వానుభూతిః ప్రమాణమ్ ॥ 475

స్వకీయమైన అజ్ఞానరూపమైన బంధనముతోడి సంబంధము తెగిపోవుట వలన ఏ సచ్చిదానందరూపమగు ఆత్మ ప్రాప్తించుట సంభవమగునో అందు శాస్త్రము, యుక్తి, గురువాక్యమ, అంతఃకరణమునందు సిద్ధించునట్టి స్వకీయమైన అనుభవమును ప్రమాణములగును.

బంధో మోక్షశ్చ తృప్తిశ్చ చింతారోగ్య క్షుధాదయః ।
స్వేనైవ వేద్యా యజ్ఞానం పరేషామానుమానికమ్ ॥ 476

బంధనము, మోక్షము (విడుదల) తృప్తి, చింత, ఆరోగ్యము, ఆకలి మొదలైనవి స్వయముగనే తెలియదగినవి. వాని విషయమున ఇతరులకు కలుగు జ్ఞానము కేవలము అనుమాన పూర్వకమైనది.

తటస్థితా బోధయంతి గురవః శ్రుతయో యథా ।
ప్రజ్ఞయైన తరేద్విద్వానీశ్వరానుగృహీతయా ॥ 477

శ్రుతివలె గురువులు కూడ బ్రహ్మమును గూర్చి కేవలము తటస్థులు గానే బోధ మొనరింతురు. కాబట్టి పండితుడైనవాడు ఈశ్వరాను గ్రహపాత్రమైన బుద్ధిచేత (దానిని ప్రత్యక్షముగా అనుభవములోనికి తెచ్చికొని) ఈ సంసారమును తరించిపోవలెను.

(ప్రత్యక్షముగా బ్రహ్మమును ఎవ్వడును నిరూపింపజాలడు. ఏలయనగా అది శబ్దశక్తికి అతీతమైనది. శబ్దము అంతవఱకు చేరజాలదు. తద్గతమైన జ్ఞానము లక్షణావృత్తి చేతనే సాధ్యమగును. కావున బ్రహ్మ సాక్షాత్కారమును పొందగోరువాడు దాని యుపాధి రూపమందున్న యీ సమస్త ప్రపంచమును నిషేధింపవలయును. ఏలయనగా ఇదియే దాని స్వరూపమును ఆచ్ఛాదించియున్నది. కాని దృశ్య నిషేధమన్నది అందు మిథ్యా భావన కలుగనిదే సంభవము కాదు. అట్టి బుద్ధి శిష్యునకు ఈశ్వరకృపా ప్రభావముననే ప్రాప్తించును. కాబట్టి జ్ఞానము కలుగుటకు శాస్త్రముల కృపవలె, గురుని కృపవలె, భగవత్కృప కూడ అత్యంతావశ్యకమైనది).

**స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా స్వమాత్మాన మఖండితమ్ ।**
**సంసిద్ధః ససుఖం తిష్ఠేన్నిర్వికల్పాత్మనాత్మని ॥ 478**

స్వానుభవము చేత పురుషుడు స్వయముగా ఆత్మను దెలిసికొని సిద్ధుడై నిర్వికల్ప భావముతో ఆనందపూర్వకముగా సర్వదా ఆత్మస్థితుడై యుండవలెను.

**వేదాంతసిద్ధాంత నిరుక్తిరేషా**
**బ్రహ్మైవ జీవ స్సకలం జగచ్చ ।**
**అఖండరూపస్థితిరేవ మోక్షో**
**బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణమ్ ॥ 479**

'జీవుడు, సమస్త జగత్తును కేవలము బ్రహ్మమే. అద్వితీయమైన ఆ బ్రహ్మమునందు అఖండరూపమున నెలకొని యుండుటయే మోక్షము. బ్రహ్మము అద్వితీయమైనది యనుటకు శ్రుతులే ప్రమాణము'. అని వేదాంత సిద్ధాంతము తెలుపుచున్న మాట.

## బోధోపలబ్ధి

ఇతి గురువచనాచ్ఛ్రుతి ప్రమాణాత్
పరమవగమ్య సతత్త్వమాత్మయుక్త్యా ।
ప్రశమితకరణస్సమాహితాత్మా
క్వచిదచలాకృతిరాత్మనిష్ఠితో-భూత్ ॥ 480

ఈ విధముగా శ్రుతిప్రమాణయుక్తమైన గురువచనములను, తన యుక్తులను సహాయకములుగా గ్రహించి పరమాత్మతత్త్వమును గ్రహించి చిత్తమును, ఇంద్రియములను శమించిపోవునట్లు చేసికొని (భాగ్యశాలియైన) యే శిష్యుడో నిశ్చలవృత్తితో ఆత్మస్వరూపమందు స్థితుడై యుండుట సంభవమయ్యెను.

కంచిత్కాలం సమాధాయ పరే బ్రహ్మణి మానసమ్ ।
వ్యుత్థాయ పరమానందాదిదం వచన మబ్రవీత్ ॥ 481

అట్లు ఆ శిష్యుడు కొంత తడవు చిత్తమును పరబ్రహ్మమునందు సమాహితము గావించియుండి, పిమ్మట ఆ పరమానందమయదశ నుండి వెలికివచ్చి గురువుతో నిట్లు పలికెను.

బుద్ధిర్వినష్టా గలితా ప్రవృత్తిః
బ్రహ్మాత్మనో రేకతయాఽధిగత్యా ।
ఇదం న జానేఽప్యనిదం న జానే
కిం వా కియద్వా సుఖమస్త్యపారమ్ ॥ 482

"అహో! బ్రహ్మముయొక్కయు, ఆత్మయొక్కయు ఏకత్వ పరిజ్ఞానము కలుగుటతోడనే ఒక్కుమ్మడిగా నా బుద్ధి యంతరించిపోయినది. ప్రవృత్తి యెల్ల తొలగిపోయినది. నాకు ఇప్పుడు ఇది యనబడు (ప్రత్యక్ష) వస్తువుయొక్క పరిజ్ఞానమును లేదు. అది యనబడు (అప్రత్యక్ష) వస్తువుయొక్క పరిజ్ఞానము లేదు. అపారమైన ఆ యానందము ఎట్టిది? ఎంతటిది? అన్న విషయమును కూడ నేను ఎరుగను.

**వాచా వక్తుమశక్యమేవ మనసా మంతుం న వా శక్య తే**
**స్వానందామృతపూరపూరితపరబ్రహ్మాంబుధేర్వైభవమ్ ।**
**అంభోరాశివిశీర్ణవార్షికశిలాభావం భజన్మే మనో**
**యస్యాంశాంశలవే విలీనమధునాఽఽనందాత్మనానిర్వృతమ్ ॥ 483**

సముద్రములో పడి కరిగిపోయిన వడగల్ల దశను పొందినదై నామనస్సు ఏ యానందామృత సముద్రము యొక్క ఏకాంశాంశమందు లీనమై యిప్పుడు అమితానంద రూపమున స్థితి నందియున్నదో ఆ యానందమనెడు అమృతప్రవాహముతో నిండియున్న పరబ్రహ్మ సముద్రముయొక్క వైభవము మాటలతో వర్ణింప నలవి కానిది. మనస్సుతో మననము చేయ సాధ్యము కానిది.

**క్వ గతం కేన వా నీతం కుత్ర లీనమిదంజగత్ ।**
**అధునైవ మయాదృష్టం నాస్తి కింమహదద్భుతమ్ ॥ 484**

ఈ లోకమంతయు ఏమైపోయినది? ఎందుపోయినది? ఎవరు కొనిపోయిరి? ఇది యెందు లీనమైపోయింది? ఇంతవఱకు ఏ లోకమును నేను చూచుచుంటినో అది యిప్పుడు ఎందును కానరాకున్నది? అహో! ఏమి యాశ్చర్యము?

**కిం హేయం కిముపాదేయం కిమన్యత్కింవిలక్షణమ్ ।**
**అఖండానందపీయూషపూర్ణే బ్రహ్మమహార్ణవే ॥ 485**

ఈ అఖండానందామృతమయమైన బ్రహ్మ అనే మహాసముద్రమందు ఏ వస్తువు త్యాజ్యమైనది? ఏది గ్రాహ్యమైనది? ఏది సాధారణమైనది? ఏది విలక్షణమైనది?

**న కించదత్ర పశ్యామి న శృణోమి నవేద్మ్యహమ్ ।**
**స్వాత్మనైవ సదానందరూపేణాస్మి విలక్షణః ॥ 486**

నాకు ఇక్కడ ఏదియు కానవచ్చుటలేదు. వినవచ్చుట లేదు. ఏదియు తెలియవచ్చుట లేదు. నేను నా నిత్యానంద స్వరూపమైన ఆత్మయందు

స్థితుడనై నా పూర్వావస్థకన్న భిన్నముగా సర్వవిధముల విలక్షణుడను అయిపోయితిని.

**నమో నమస్తే గురవే మహాత్మనే**
**విముక్తసంగాయ సదుత్తమాయ ।**
**నిత్యాద్వయానందరస స్వరూపిణే**
**భూమ్నే సదాఽపారదయాఽంబుధామ్నే ॥ 487**

**యత్కటాక్ష శశిసాంద్ర చంద్రికా -**
**పాతధూత భవతాపజశ్రమః ।**
**ప్రాప్తవానహమఖండవైభవా -**
**నందమాత్మ పదమక్షయం క్షణాత్ ॥ 488**

ఎవని కృపాకటాక్షమనెడు చంద్రుని సాంద్రమైన చంద్రిక (వెన్నెల) తోడి సంపర్కము కారణముగా నా సంసారతాపజన్యమైన శ్రమము అంతయు అంతరించిపోవగా క్షణములో నేను అఖండైశ్వర్యమయము, ఆనందమయము, అక్షయము నగు ఆత్మపదమును పొందగలిగితినో ఆ సంగములేనివాడు, సాధుపుంగవుడు, నిత్యుడు, అద్వితీయానందరస స్వరూపుడు, మహానుభావుడు, నిత్యము అపారదయాసముద్రుడై యుండువాడు. మహాత్ముడు నగు గురుదేవునకు మఱియు మఱియు నమస్కారము.

**ధన్యోఽహం కృతకృత్యోఽహం విముక్తోఽహంఽ భవగ్రహాత్ ।**
**నిత్యానందస్వరూపోఽహం పూర్ణోఽహం తదనుగ్రహాత్ ॥ 489**

ఆ గురుదేవుని కృపవలన నేడు నేను ధన్యుడనైతిని. కృతకృత్యుడనైతిని. సంసారబంధ విముక్తుడనైతిని. నిత్యానంద స్వరూపుడను, పరిపూర్ణుడను అయితిని.

**అసంగోఽహమనంగోఽహమలింగోఽహమభంగురః ।**
**ప్రశాంతోఽహమనంతోఽహమతాంతోఽహం చిరంతనః ॥ 490**

నేను సంగము లేనివాడను, అశరీరుడను. లింగ (శరీర) రహితుడను. క్షయము లేని వాడను. పరమశాంతుడను. అనంతుడను. అతాంతుడను (నిరీహుడను). పురాతనుడను.

అకర్తాఽహమభోక్తాహమవికారోఽహమక్రియః ।
శుద్ధబోధ స్వరూపోఽహం కేవలోఽహం సదాశివః ॥ 491

నేను కర్తను కాను. భోక్తను కాను. వికారములు గలవాడను కాను. క్రియలేనివాడను. శుద్ధజ్ఞానస్వరూపుడను. కేవలుడను. కల్యాణస్వరూపుడను.

ద్రష్టుః శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్న ఏవాహమ్ ।
నిత్యనిరంతరనిష్క్రియనిస్సీమాసంగబోధాత్మా ॥ 492

ద్రష్ట, శ్రోత, వక్త, కర్త, భోక్త - ఈ యెల్లరకంటెను భిన్నమైనవాడను. నేను నిత్యుడను. నిరంతరుడను. క్రియావిరహితుడను. సీమలు లేనివాడను. సంగరహితుడను. పూర్ణబోధ స్వరూపుడను.

నాహమిదం నాహమదోఽప్యుభయోరవభాసకం పరంశుద్ధమ్ ।
బాహ్యాభ్యంతరశూన్యం పూర్ణం బ్రహ్మాద్వితీయమేవాహమ్ ॥ 493

నేను ఇదియును కాదు. అదియును కాదు. ఈ రెండింటిని (స్థూల సూక్ష్మ జగత్తులను) ప్రకాశింపజేయునట్టిది, బాహ్యాభ్యంతర శూన్యమైనది, పూర్ణము, అద్వితీయము, శుద్ధమునైనదియు నగు పరబ్రహ్మమును.

నిరుపమమనాదితత్త్వం త్వమహమిదమద ఇతి కల్పనా దూరమ్ ।
నిత్యానందైకరసం సత్యం బ్రహ్మాద్వితీయమేవాహమ్ ॥ 494

ఉపమానరహితమై, అనాదితత్త్వమై, నీవు, నేను, ఇది, అది - మున్నగు కల్పనలకు దూరమైనదియునగు ఆ నిత్యానందైకరసస్వరూపము, సత్యము, అద్వితీయము నగు పరబ్రహ్మమును నేనే.

నారాయణోఽహం నరకాంతకోఽహం
పురాంతకోఽహం పురుషోఽహమీశః ।

అఖండబోధో౽హమశేషసాక్షీ
నిరీశ్వరో౽హం నిరహం చ నిర్మమః ॥ 495

నేను నారాయణుడను. నరకాసురుని అంతమొందించినవాడను. త్రిపురాసురుని సంహరించినవాడను. పరమపురుషుడను. ఈశ్వరుడను. నేను అఖండబోధస్వరూపుడను. సర్వసాక్షిని, స్వతంత్రుడను. అహంకార మమకారములు లేనివాడను. (ఈ వర్ణనమంతయు శుద్ధమైన ఆత్మతత్త్వము పరబ్రహ్మ పరమాత్మకంటె భిన్నమైనది కాదు అన్న వియమును ప్రతిపాదించుటకు ఉద్దిష్టమైనది.)

సర్వేషు భూతేష్వహమేవ సంస్థితో
జ్ఞానాత్మనాంతర్బహిరాశ్రయస్సన్ ।
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం
యద్యత్పృథగ్దృష్టమిదంతయా పురా ॥ 496

జ్ఞానస్వరూపముతో సర్వాశ్రయభూతుడనై సమస్తప్రాణుల బాహ్యాభ్యంతరములయందు నేనే స్థితుడనైయున్నాను. ఇంతకు ముందు ఏయే పదార్థములు ఇదం వృత్తి ద్వారా (ఇది ఇది యనుట) భిన్నభిన్నముగా గుర్తింపబడినవో అందు భోక్తము భోగ్యమును సర్వమును నేనే.

మయ్యఖండసుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః ।
ఉత్పద్యంతే విలీయంతే మాయామారుతవిభ్రమాత్ ॥ 497

అఖండానందసముద్రస్వరూపుడనైన నాయందు మాయ యను వాయువుయొక్క వేగము చేత నానావిధములైన విశ్వతరంగములు ఉత్పన్నములు అగుచున్నవి. అంతరించుచున్నవి.

స్థూలాదిభావా మయి కల్పితా భ్రమా
దారోపితానుస్ఫురణేన లోకైః ।
కాలే యథా కల్పకవత్సరాయ
నర్త్వాదయో నిష్కలనిర్వికల్పే ॥ 498

(నిజమరయగా) నిష్కలము, నిర్వికల్పమునైన కాలమునందు స్వరూపముగా కల్పము, సంవత్సరము, (ఉత్తర దక్షిణ) అయనములు, ఋతువులు మున్నగు విభాగము ఏదియును లేదు. అట్లే జనులు భ్రాంతివశమున కేవల స్ఫురణ మాత్రముగానే ఆరోపించి నాయందు స్థూల సూక్ష్మాది భేదభావములను కల్పించియున్నారు.

ఆరోపితం నాశ్రయదూషకం భవే
త్కదాఽపి మూఢైర్మతిదోషదూషితైః ।
నార్ద్రీకరోత్యూషరభూమిభాగం
మరీచికావారి మహాప్రవాహః ॥ 499

బుద్ధిదోషదూషితులైన అజ్ఞానులచేత ఆరోపింపబడిన వస్తువు తన యాశ్రయమును కలుషితము చేయజాలదు. ఎట్లనగా ఎండమావులయందు (భ్రాంతిచే) గోచరించు మహాజలప్రవాహము తనకు ఆశ్రయభూతమైన చవిటినేలను(కొంచెమైనను) తడుపగలదా? లేదు.

ఆకాశవల్లేపవిదూరగోఽహం
ఆదిత్యవద్భాస్య విలక్షణోఽహమ్ ।
అహార్యవన్నిత్య వినిశ్చలోఽహం
అంభోధివత్పారవివర్జితోఽహమ్ ॥ 500

నేను ఆకాశమువలె నిర్లేపుడను. సూర్యునివలె అప్రకాశ్యుడను. (ప్రకాశింపబడనివాడు). పర్వతమువలె నిత్యము చలింపనివాడను. సముద్రమువలె పారము లేనివాడను.

న మే దేహేన సంబంధో మేఘేనేవ విహాయసః ।
అతః కుతో మే తద్ధర్మా జాగ్రత్స్వప్నసుషుప్తయః ॥ 501

మేఘమునకు ఆకాశముతోడ సంబంధము లేదు. అట్లే నాకు శరీరముతోడ సంబంధములేదు. ఇక ఈ శరీరము యొక్క ధర్మములైన జాగ్రత్స్వప్న సుషుప్తులు నాలో ఎట్లు ఉండును?

ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుంక్తే ।
స ఏవ జీర్యన్మ్రియతే సదాఽహం
కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః ॥ 502

ఉపాధి వచ్చుచుండును. పోవుచుండును. అదియే కర్మలు చేయుచుండును. వాని ఫలమును అనుభవించుచుండును. వృద్ధావస్థ రాగా అదియే మరణించును.నేను మాత్రము నిత్యము కులపర్వతమువలె చలింపకుందును.

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తిః
సదైకరూపస్య నిరంశకస్య ।
ఏకాత్మకో యో నిబిడో నిరంతరో
వ్యోమేవ పూర్ణః స కథం ను చేష్టతే ॥ 503

సర్వదా ఏకరసరూపుడను, అవయవరహితుడను అగు నాకు ఏ విషయమందు ప్రవృత్తియును లేదు. నివృత్తియును లేదు. నిరంతరమును ఏకరూపము ఘనీభావలక్షణము కలిగియుండి ఆకాశమువలె పూర్ణముగా నుండు తత్త్వము ఎట్లు చేష్టింపగలుగును?

పుణ్యాని పాపాని నిరింద్రియస్య
నిశ్చేతసో నిర్వికృతేర్నిరాకృతేః ।
కుతో మమాఖండ సుఖానుభూతే
ర్బ్రూతేహ్యనన్వాగతమిత్యపి శ్రుతిః ॥ 504

ఇంద్రియములు, చిత్తము, వికారము, ఆకారము లేకయు అఖండానంద స్వరూపుడనై యుండు నాకు పాపపుణ్యములు ఎట్లు కలుగును? 'అనన్వాగతం పుణ్యేనానన్వాగతం పాపేన' (బృహ. 4/3/22) ఈ శ్రుతి కూడ ఈ మాటనే చెప్పుచున్నది.

ఛాయయా స్పృష్టముష్ణం వా శీతం వా సుష్ఠు దుష్ఠు వా ।
న స్పృశత్యేవ యత్కించిత్పురుషం తద్విలక్షణమ్ ॥ 505
న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశంతివిలక్షణమ్ ।
అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్ ॥ 506

వేడికాని, చలికాని, మంచికాని, చెడుకాని - ఏ వస్తువు ఛాయచేత స్పృశింపబడినను అది యా ఛాయకంటె భిన్నముగా నున్న పురుషుని స్పృశించజాలదు. గృహమును ప్రకాశింపజేయు దీపము మీద ఆ గృహము యొక్క సౌందర్యము కాని మాలిన్యము కాని అట్టి ధర్మములు ఏవియు ఎట్టి ప్రభావమును చూపజాలవు. అట్లే శరీరాది దృశ్య పదార్థముల ధర్మములు ఆ శరీరము కంటె భిన్నముగా సాక్షియై యుండు నాత్మను కొద్దిగానైన తాకలేవు. ఏలయనగా అది వికారములు లేనిది. ఉదాసీనమైనది.

రవేర్యథా కర్మణి సాక్షిభావః
వహ్నేర్యథా వాయసి దాహకత్వమ్ ।
రజ్జోర్యథాఽఽరోపితవస్తుసంగ
స్తథైవ కూటస్థ చిదాత్మనో మే ॥ 507

మానవులకర్మలకు సూర్యుని సాక్షిభావము ఉన్న విధముగా, ఇనుమును కాల్చుటలో అగ్నికి దాహకత్వము ఉన్న విధముగా ఆరోపితములైన సర్పాదులతోడ రజ్జువునకు సంబంధమున్న విధముగా, కూటస్థుడను, చేతనాత్మ స్వరూపుడను అగు నాకు విషయములయందు సాక్షిభావ మున్నది. (అనగా అతని ప్రవృత్తులు చేయబడునవి కాక స్వభావసిద్ధమైనవి యెట్లు అగుచున్నవో అట్లే ఆత్మయొక్క సాక్షిభావము కూడ స్వాభావికమైనది. కాని అది దాని క్రియ (కర్మ)కాదు.

కర్తాఽపి వా కారయితాఽపి నాహం
భోక్తాపి వా భోజయితాఽపి నాహమ్ ।
ద్రష్టాఽపి వా దర్శయితాఽపి నాహం
సోఽయం స్వయంజ్యోతిరనీదృగాత్మా ॥ 508

నేను చేయువాడను గాను, చేయించువాడను గాను. అనుభవించు వాడను గాను, అనుభవింపజేయువాడను గాను. చూచువాడనుగాను, చూపించువాడను గాను. నేను సర్వవిలక్షణమై యుండు స్వయంప్రకాశమగు ఆత్మను.

**చలత్యుపాధౌ ప్రతిబింబలౌల్య**
**మౌపాధికం మూఢధియో నయంతి ।**
**స్వబింబభూతం రవివద్వినిష్క్రియం**
**కర్తాస్మి భోక్తాస్మి హతోఽస్మి హేతి ॥ 509**

ఉపాధి చంచలము కాగా (జలరూపమైన ఉపాధి) ఆ యుపాధి గతమైన ప్రతిబింబము యొక్క చాంచల్యమును మూఢజనులు బింబభూతుడైన సూర్యుని మీద ఆరోపింతురు. అట్లే వారు సూర్యునివలె నిష్క్రియమైన ఆత్మయందు (చిత్తచాంచల్యమును ఆరోపించి) నేను కర్తను, నేను భోక్తను, అయ్యో! చచ్చితిని అని ఏమేమో పలుకుచుందురు.

**జలేవాపి స్థలే వాఽపి లుఠత్వేష జడాత్మకః ।**
**నాహం విలిప్యే తద్ధర్మైర్ఘటధర్మైర్నభో యథా ॥ 510**

కడవయొక్క ధర్మములతో ఆకాశమునకు సంబంధముండదు.అట్లే యీ జడశరీరము నీటిలోనో, నేలమీదనో ఎందైనను దొరలుచుండును గాక! నేను దాని ధర్మముల చేత లిప్తుడను కాను.

**కర్తృత్వ భోక్తృత్వ ఖలత్వమత్తతా**
**జడత్వబద్ధత్వవిముక్తతాదయః ।**
**బుద్ధేర్వికల్పా న తు సంతి వస్తుతః**
**స్వస్మిన్ పరే బ్రహ్మణి కేవలేఽద్వయే ॥ 511**

కర్తృత్వము, భోక్తృత్వము, దుష్టత్వము, ఉన్మత్తత, జడత్వము, బంధనము, మోక్షము - ఇవి యన్నియు, బుద్ధియొక్క కల్పనలు, ఇవి కేవలమై, ప్రకృత్యాదులకు అతీతమై, అద్వితీయమై, బ్రహ్మస్వరూపమైన స్వాత్మయందు లేవు.

సంతు వికారాః ప్రకృతేర్దశధా శతధా సహస్రధా వాపి ।
కిం మేఽ సంగచితేస్తైర్న ఘనః క్వచిదంబరం స్పృశతి ॥ 512

ప్రకృతియందు పదులు, వందలు, వేలుగా వికారములు ఉండిన నుండుగాక! వానితోడ సంగరహిత చేతనాత్మనగు నాకు సంబంధమేమి? మేఘము ఎన్నడును ఆకాశమును తాకజాలదు.

అవ్యక్తాది స్థూలపర్యంతమేత
ద్విశ్వం యత్రాభాసమాత్రం ప్రతీతమ్ ।
వ్యోమప్రఖ్యం సూక్ష్మమాద్యంతహీనం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి ॥ 513

అవ్యక్తము మొదలు స్థూలములైన భూతముల వఱకును గల యీ విశ్వమంతయు ఎందు ఆభాసమాత్రముగా ప్రతీతమగుచుండునో, ఏది ఆకాశమువలె సూక్ష్మమై, ఆద్యంతరహితమైన అద్వైతపరబ్రహ్మమో అదియే నేను. (నా స్వరూపము).

సర్వాధారం సర్వవస్తుప్రకాశం
సర్వాకాశం సర్వగం సర్వశూన్యమ్ ।
నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి ॥ 514

సర్వమునకు ఆధారభూతమై, సమస్తవస్తువులను ప్రకాశింపజేయునదియై, సర్వరూపమై, సర్వవ్యాపియై, సర్వరహితమై, నిత్యమై, శుద్ధమై, నిశ్చలమై, వికల్పరహితమైన ఆ యద్వితీయ పరబ్రహ్మమును నేనే అయి యున్నాను.

యత్రప్రత్యస్తాశేషమాయా విశేషం
ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానమ్ ।
సత్యజ్ఞానానంతమానందరూపం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి ॥ 515

మాయాసంబంధమగు భేదములు ఏవియు లేనిది, అంతరాత్మ స్వరూపమగునది, ప్రత్యక్షముగా ప్రతీతికి అందనిది, అనంతమైనది, సచ్చిదానంద స్వరూపమగునదియునగు అద్వైతబ్రహ్మము ఏది కలదో అది నేనే అయియున్నాను.

నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మి నిష్కలోఽస్మి నిరాకృతిః ।
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్ద్వయః ॥ 516

నేను క్రియారహితుడను. వికారరహితుడను. కలారహితుడను. ఆకారరహితుడను. వికల్పరహితుడను. నిత్యుడను నిరాలంబుడను. అద్వితీయుడను.

సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహమద్వయః ।
కేవలాఖండబోధోఽహమానందోఽహం నిరంతరః ॥ 517

నేను సర్వాత్మస్వరూపుడను. సర్వరూపుడను. సర్వాతీతుడను. అద్వితీయుడను. కేవలుడను. అఖండజ్ఞానస్వరూపుడను. నిరంతరానంద స్వరూపుడను.

స్వారాజ్య సామ్రాజ్య విభూతిరేషా
భవత్కృపాశ్రీ మహిమ ప్రసాదాత్ ।
ప్రాప్తా మయా శ్రీగురవే మహాత్మనే
నమో నమస్తేఽస్తు పునర్నమోఽస్తు ॥ 518

ఓ గురుదేవా! మీ కృపామహిమయొక్క ప్రసాదము వలన నాకు ఈ స్వారాజ్యసామ్రాజ్య విభూతి ప్రాప్తించినది. మహాత్ములగు మీకు నేను మాటికి మాటికి నమస్కరించుచున్నాను.

మహాస్వప్నే మాయా కృతజని జరామృత్యుగహనే
భ్రమంతం క్లిశ్యంతం బహుళతరతాపైరనుదినమ్ ।
అహంకార వ్యాఘ్రవ్యథితమిమమత్యంత కృపయా
ప్రబోధ్య ప్రస్వాపాత్పరమవితవాన్మామసి గురో ॥ 519

నేను మాయచేత జన్మజరామరణాల మూలముగా అత్యంతము మహాభయంకర స్వప్నమందు పరిభ్రమించుచు దినదినము నానావిధ తాపములతో సంతాపము చెందుచున్నను. ఓ గురుదేవా! అహంకార వ్యాఘ్రముచేత అత్యంతము పీడితుడనై దీనుడనైయున్న నన్ను (మోహ) నిద్రనుండి మేల్కొలిపి మీరు నాకు మహారక్షణమును కల్పించితిరి.

నమస్తస్మై సదేకస్మై కస్మై చిన్మహసే నమః ।
యదేతద్విశ్వరూపేణ రాజతే గురురాజ తే ॥ 520

ఓ గురురాజా! ఏదియో విలక్షణమైన మీ యా మహాతేజస్సునకు నమస్కారము. మీ యా తేజస్సు కేవలమై యుండియు సత్తుయొక్క స్వరూపమై యుండియు విశ్వము రూపమున విరాజిల్లుచున్నయది.''

## ఉపదేశము యొక్క ఉపసంహారము

ఇతి నతమవలోక్య శిష్యవర్యం
సమధిగతాత్మసుఖం ప్రబుద్ధతత్త్వమ్ ।
ప్రముదితహృదయః స దేశికేంద్రః
పునరిదమాహ వచః పరం మహాత్మా ॥ 521

ఈ విధముగా ఆత్మానందమును, తత్త్వప్రబోధమును పడసి తనకు ప్రణమిల్లుచున్న శిష్యశేఖరుని గాంచి మహాత్ముడైన గురుదేవుడు అత్యంత ప్రసన్నచిత్తముతో ఈ విధముగా శ్రేష్ఠవచనములు పలుకసాగెను.

బ్రహ్మ ప్రత్యయసంతతిర్జగదతో బ్రహ్మైవ సత్సర్వతః
పశ్యాధ్యాత్మదృశా ప్రశాంతమనసాసర్వాస్వవస్థాస్వపి ।
రూపాదన్యదవేక్షితుం కిమభితశ్చక్షుష్మతాం విద్యతే
తద్వద్బ్రహ్మవిదస్సతః కిమపరంబుద్ధేర్విహారాస్పదమ్ ॥ 522

"వత్సా! ఈ లోకమంతయు బ్రహ్మప్రతీతి యొక్క ప్రవాహమే. కావున ఇది సర్వవిధముల సత్యస్వరూపమగు బ్రహ్మమే. నీ యాధ్యాత్మిక దృష్టి చేత శాంతచిత్తుడవై సర్వావస్థలయందును ఈ విధముగనే

చూచుచుండుము! కన్నులున్న వానికి నాలుగు వంకల చూచుటకు రూపము దక్క అన్యము ఏమియుండును? అట్లే బ్రహ్మజ్ఞానికి బుద్ధికి విషయముగా సత్యస్వరూపమగు బ్రహ్మము దక్క అన్యమేమియుండును?

కస్తాం పరానందరసానుభూతిం
ఉత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్ ।
చంద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేందుమాలోకయితుం క ఇచ్ఛేత్ ॥ 523

ఆ పరమానందరసానుభవమును మాని, పొల్లు విషయములందు ఏ బుద్ధిమంతుడు ఆనందించును? పరమానంద సంధాయకుడై చంద్రుడు పూర్ణుడై ప్రకాశించుచుండగా అతనిని కాదని చిత్తరువునందు లిఖింపబడిన చంద్రుని చూచుటకు ఎవడు ఇచ్ఛగించును?

అసత్పదార్థానుభవే న కించిత్
నహ్యస్తి తృప్తిర్న చ దుఃఖహానిః ।
తదద్వయానందరసానుభూత్యా
తృప్తస్సుఖం తిష్ఠ సదాత్మనిష్ఠయా ॥ 524

సత్తు కానట్టి పదార్థముల అనుభవము వలన తృప్తియు గలుగదు. దుఃఖమును నశింపదు. కాబట్టి అద్వయానందరసమును అనుభవించుట వలన తృప్తిజెంది, సత్యమైన ఆత్మనిష్ఠ వహించి సుఖముగా నుండుము!

స్వమేవ సర్వథా పశ్యన్ మన్యమానఃస్వమద్వయమ్ ।
స్వానందమనుభుంజానః కాలం నయ మహామతే! ॥ 525

ఓయి మహామతీ! ఎల్లవంకల నిన్నే చూచికొనుచు, అద్వితీయునిగా నిన్నే భావించికొనుచు ఆత్మానందమును అనుభవించుచు కాలమును గడుపుము.

అఖండబోధాత్మని నిర్వికల్పే
వికల్పనం వ్యోమ్ని పురఃప్రకల్పనమ్ ।

తదద్వయానందమయాత్మనా సదా
  శాంతిం పరామేత్య భజస్వ మౌనమ్ ॥ 526

అఖండజ్ఞానస్వరూపము, వికల్పరహితము నగు ఆత్మయందు వికల్పము ఉండుట యున్నది. ఆకాశమందు నగర కల్పనముతో తుల్యమైనది. కాబట్టి అద్వితీయము, ఆనందమయము నగు ఆత్మరూపమున స్థితుడవై పరమశాంతిని పొంది మౌనము వహింపుము.

తూష్ణీ మవస్థా పరమోపశాంతి-
  ర్బుద్ధేరసత్కల్ప వికల్పహేతోః ।
బ్రహ్మాత్మనా బ్రహ్మవిదో మహాత్మనో
  యత్రాద్వయానంద సుఖం నిరంతరమ్ ॥ 527

మహాత్ముడైన బ్రహ్మవేత్తయందలి మిథ్యావికల్పములకు హేతుభూతమైన బుద్ధికి బ్రహ్మభావముతో మౌనము వహించుటయే పరమోపశాంతి యగును. ఆ దశయందు నిరంతరము అద్వయానందరసానుభూతి గలుగుచుండును.

నాస్తి నిర్వాసనాన్మౌనాత్పరం సుఖకృదుత్తమమ్ ।
విజ్ఞాతాత్మస్వరూపస్య స్వానందరసపాయినః ॥ 528

ఆత్మ స్వరూపమును తెలిసికొని స్వానందరసపానము చేయుపురుషునకు వాసనారహితమైన మౌనము కన్న అధికముగా ఉత్తము సుఖము ప్రసాదించునది వేరు ఏదియును లేదు.

గచ్ఛంస్తిష్ఠన్నుపవిశన్ శయానో వాన్యథాపి వా ।
యథేచ్ఛయా వసేద్విద్వానాత్మారామస్సదా మునిః ॥ 529

వెడలుచు, నిలుచుచు, కూర్చుండుచు, పరుండుచు, మేల్కొనుచు మరియే పని చేయుచున్న దశయందైనను నిరంతరము ఆత్మయందు ఆనందించుచు స్వేచ్ఛగా ఉండవలెను.

న దేశకాలాసన దిగ్యమాది
  లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధవృత్తేః ।

**సంసిద్ధతత్త్వస్య మహాత్మనోఽస్తి**
**స్వవేదనే కా నియమాద్యపేక్షా ॥ 530**

ఎవనికి చిత్తవృత్తి నిరంతరము ఆత్మ స్వరూపమందు లగ్నమై యుండునో, ఎవనికి ఆత్మతత్త్వము సిద్ధించిపోయెనో ఆ మహాపురుషునకు దేశము, కాలము, ఆసనము, దిక్కు, యమము, నియమము మున్నగు వాని యావశ్యకత యేదియు నుండదు.స్వస్వరూపమును తెలిసికొన్న మీదట ఇక యమనియమాదుల అపేక్ష యేల?

**ఘటోఽయమితి విజ్ఞాతుం యమః కోన్వపేక్ష్యతే ।**
**వినా ప్రమాణసుష్ఠుత్వం యస్మిన్సతి పదార్థధీః ॥ 531**

'ఇది కడవ' అని తెలిసికొనుటకు వస్తుజ్ఞానమును గలిగించునట్టి ప్రమాణ సౌష్ఠవము తప్పవేఱుగా ఏ నియమము అపేక్షితమగును? ఏదియును అపేక్షితము కాదని భావము.

**అయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే ।**
**న దేశం నాపి వా కాలం న శుద్ధిం వాఽప్యపేక్షతే ॥ 532**

ఆత్మ నిత్యసిద్ధమైనది, ప్రమాణము లభించుటతో భాసించును. (తన ప్రతీతికై) అది దేశము, కాలము, శుద్ధి మున్నగువానిని ఆపేక్షింపదు.

**దేవదత్తోఽహమిత్యేతద్విజ్ఞానం నిరపేక్షకమ్ ।**
**తద్వద్బ్రహ్మవిదోఽప్యస్య బ్రహ్మాహమితి వేదనమ్ ॥ 533**

'నేను దేవదత్తుడను' అను జ్ఞానము కలుగుటకు ఏ నియమమును ఎట్లు అపేక్షితము కాదో అట్లే బ్రహ్మవేత్త యైనవానికి 'నేను బ్రహ్మమును' అను జ్ఞానము ఎట్టి నియమాపేక్షయు లేకయే కలుగును.

**భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా ।**
**అనాత్మకమసత్తుచ్ఛం కిం ను తస్యావభాసకమ్ ॥ 534**

సూర్యుని వలన లోకమంతయు ప్రకాశించు విధముగా దేని ప్రకాశము చేత సత్తుకానివి, తుచ్ఛమైనవియు నగు అనాత్మ పదార్థములు అన్నియు భాసించుచుండునో దానిని ప్రకాశింపజేయునది వేఱుగా ఏది యుండును?

వేదశాస్త్రపురాణాని భూతాని సకలాన్యపి ।
యేనార్థవంతి తం కిం ను విజ్ఞాతారం ప్రకాశయేత్ ॥ 535

వేదశాస్త్ర పురాణాలు, సమస్త భూతములును దేనిచేత ప్రయోజనవంతములు అగుచున్నవో ఆ సర్వసాక్షియగు పరమాత్మను వేఱుగా ఎవ్వరు ప్రకాశింపజేయుదురు?

ఏష స్వయంజ్యోతిరనంతశక్తి
రాత్మాఽప్రమేయ స్సకలానుభూతిః ।
యమేవ విజ్ఞాయ విముక్తబంధో
జయత్యయం బ్రహ్మవిదుత్తమోత్తమః ॥ 536

(సర్వసాక్షియగు) నీ యాత్మ స్వయంప్రకాశము, అనంతశక్తి యుక్తము, అప్రమేయము, సర్వానుభవస్వరూపము నగునది. దీనినే తెలిసికొన్న మీదట బ్రహ్మవేత్తలలో సర్వశ్రేష్ఠుడైన మహాత్ముడుసంసార బంధము నుండి విముక్తుడై ధన్యుడగును.

న ఖిద్యతే నో విషయైః ప్రమోదతే
న సజ్జతే నాఽపి విరజ్యతే చ ।
స్వస్మిన్ సదా క్రీడతి నందతి స్వయం
నిరంతరానందరసేన తృప్తః ॥ 537

విషయముల వలన అతడు దుఃఖించడు, సంతోషించడు. అందు ఆసక్తిని వహింపడు. విరక్తిని వహింపడు. అతడు నిరంతరము ఆత్మానందముతో తృప్తుడై స్వయముగా తనలో తాను క్రీడించుచు ఆనందము నందుచుండును.

క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలఃక్రీడతి వస్తుని ।
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహంసుఖీ ॥ 538

ఆకలిని, దేహబాధను కూడ విస్మరించి బాలకుడు ఆటవస్తువుతో అడుకొనుచు కాలము వెళ్లబుచ్చును. అట్లే అహంకారమమకారరహితుడై పండితుడు అగువాడు తన యాత్మయందే క్రీడించుచుండును.

చింతాశూన్యమదైన్యభైక్షమశనం పానం సరిద్వారిషు
స్వాతంత్ర్యేణ నిరంకుశా స్థితిరభీర్నిద్రా శ్మశానేవనే ।
వస్త్రం క్షాళన శోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరేబ్రహ్మణి ॥ 539

బ్రహ్మవేత్తయైన విద్యావంతునకు చింతావిరహితము, దైన్యశూన్యమును అయిన భిక్షాన్నమే భోజనము. నదులలోని నీరే పానమగును. అతని స్థితి స్వతంత్రతా పూర్వకము, నిరంకుశము (స్వేచ్ఛాపూర్వకమును) అయి యుండును. అతనికి ఎట్టి భయమును ఉండదు. వనమునందో, శ్మశానమందో సుఖముగా నిద్రించును. ఉదుకుట, ఆరబెట్టుటలతో పనిలేని దిక్కులే వస్త్రములగును. (దిగంబరత్వమన్నమాట) పుడమియే శయ్యయగును. అతని రాకపోకలు వేదాంతవీథులలో సాగుచుండును. అతని క్రీడ పరబ్రహ్మమునందు జరుగును.

విమానమాలంబ్య శరీరమేతత్
భునక్త్యశేషాన్ విషయానుపస్థితాన్ ।
పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా
యోఽవ్యక్తలింగోఽననుషక్తబాహ్యః ॥ 540

ఆత్మజ్ఞానియైన యా మహాపురుషుడు ఈ శరీరము అను విమానము నందు ఉండి (సర్వాభిమానవిరహితమైన తన శరీరము నాశ్రయించి యుండి) పరులచేత సిద్ధము చేయబడిన సమస్త విషయములను బాలకుని వలె అనుభవించును. కాని వస్తుస్థితిని అరయగా అతడు ప్రకటమైన చిహ్నములు ఏవియు లేక బాహ్య విషయములందు ఆసక్తి లేకయు ఉండును.

దిగంబరో వాపి చ సాంబరో వా
త్వగంబరో వాపి చిదంబరస్థః ।
ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్ ॥ 541

చైతన్యమే వస్త్రముగా గలిగిన యా మహాభాగ్యశాలియైన పురుషుడు వస్త్రహీనుడుగనో, వస్త్రసహితుడుగనో, మృగచర్మాదులు దాల్చిన వాడుగనో ఉండి ఉన్మత్తునివలెను, బాలకునివలెను, లేక పిశాచాదులవలెను స్వేచ్ఛానుకూలముగా భూమండలమందు చరించుచుండును.

**కామాన్నీ కామరూపీ సంశ్చరత్యేకచరో మునిః ।**
**స్వాత్మనైవ సదా తుష్టః స్వయం సర్వాత్మనా స్థితః ॥ 542**

స్వయముగా సర్వాత్మాభావము నందియుండి తన యాత్మయందే తుష్టుడై యుండునట్టి యా ముని ఇచ్ఛానుసారముగా అన్నమును గ్రహించును. ఇచ్ఛవచ్చిన రూపమును దాల్చి చరించుచుండును.

**క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజవిభవః ।**
**క్వచిద్భ్రాంతఃసౌమ్యః క్వచిదజగరాచారకలితః ।**
**క్వచిత్పాత్రీ భూతః కృచిదవమతః క్వాప్యవిదితః ।**
**చరత్యేవం ప్రాజ్ఞః సతతపరమానందసుఖితః ॥ 543**

బ్రహ్మవేత్తయైన మహాపురుషుడు ఒకచోట మూఢుడుగా, మఱియొక చోట పండితుడుగా, వేఱొకచోట మహారాజవైభవము గలవాడుగా గానవచ్చును. అతడు ఒకచోట భ్రాంతుడుగా, మఱియొక చోట శాంతుడుగా, వేఱొకచోట కొండచిలువవలె నిశ్చలముగా పడియుండియు గోచరించును. ఈవిధముగా నిరంతరము పరమానందమగ్నుడై యుండు పండితుడు ఒకచోట సమ్మానితుడై, మఱియొక చోట అవమానితుడై, వేఱొకచోట అజ్ఞాతముగా అలక్షితగతియై చరించును.

**నిర్ధనోఽపి సదా తుష్టోఽప్యసహాయో మహాబలః ।**
**నిత్యతృప్తోఽప్యభుంజానోఽప్యసమః సమదర్శనః । 544**

అతడు నిర్ధనుడై యుండియు సర్వదా సంతుష్టుడై, అసహాయుడై యుండియు మహాబలశాలియై,భోజనము చేయకున్నను నిత్యతృప్తుడై, విషమముగా చరించుచున్నను సమదృష్టి గలవాడైయుండును.

అపి కుర్వన్నకుర్వాణశ్చాభోక్తా ఫలభోగ్యపి ।
శరీర్యప్యశరీర్యేష పరిచ్ఛిన్నోఽపి సర్వగః ॥ 545

ఆ మహానుభావుడు సర్వము చేయుచుండియు, చేయనివాడే యగును. సర్వఫలమును అనుభవించుచున్నను అనుభవించనివాడేయగును.శరీరము గలిగియుండియు లేనివాడేయగును. పరిచ్ఛిన్నుడైయుండియు సర్వవ్యాపియే యగును.

అశరీరం సదా సంతమిమం బ్రహ్మమిదం క్వచిత్ ।
ప్రియాప్రియే న స్పృశత స్తథైవ చ శుభాశుభే ॥ 546

సర్వదా అశరీరభావమందు ఉండుట వలన ఈ బ్రహ్మవేత్తను ప్రియముగాని, అప్రియముగాని, శుభముకాని, అశుభము కాని స్పృశింపనేరవు.

స్థూలాదిసంబంధవతోఽభిమానినః
సుఖం చ దుఃఖం చ శుభాశుభే చ ।
విధ్వస్తబంధస్య సదాత్మనో మునేః
కుతశ్శుభం వాప్యశుభం ఫలం వా ॥ 547

ఏ దేహాభిమానికి స్థూలసూక్ష్మాది దేహములతో సంబంధముండునో వానికే సుఖదుఃఖములు, శుభాశుభములు కలుగుచుండును. ఎవనికి దేహాదులతోడ బంధము తెగిపోయెనో ఆ సత్స్వరూపుడగు మునికి శుభాశుభ ఫలములు ఎట్లు ప్రాప్తించును?

తమసా గ్రస్తవద్భానాదగ్రస్తోఽపి రవిర్జనైః ।
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాంత్యా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్ ॥ 548

తద్వద్దేహాదిబంధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమమ్ ।
పశ్యంతి దేహివన్మూఢాః శరీరాభాసదర్శనాత్ ॥ 549

వాస్తవిక విషయమును ఎఱుగని కారణమున సూర్యుడు రాహుగ్రస్తుడు

కాకపోయినను గ్రస్తునివలె కానవచ్చుటచేత భ్రాంతివశమున జనులు అతనిని రాహుగ్రస్తుడనియే చెప్పుచుందురు. అట్లే దేహాది బంధనముల నుండి విడిపోయిన బ్రహ్మవేత్త ఆభాసమాత్రముగా శరీరము గలవాడుగా కానవచ్చుటచేత అజ్ఞానులు అతనిని దేహము గలవాడనియే భావింతురు.

అహినిర్ల్వయనీవాయం ముక్తదేహస్తు తిష్ఠతి ।
ఇతస్తతశ్చాల్యమానో యత్కించిత్ప్రాణవాయునా ॥ 550

ఈ ముక్తపురుషుని శరీరము సర్పముయొక్క కుబుసమువలె ప్రాణవాయువు మూలమున ఒకింత ఇటునటు చలించుచు పడియుండును. (వానియందు కర్తృత్వాభిమానము పూర్తిగా లుప్తమైపోవుట కారణముగా వాస్తవముగా క్రియయేదియు జరుగదు.)

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నతస్థలమ్ ।
దైవేన నీయతే దేహో యథాకాలోపభుక్తిషు ॥ 551

జలప్రవాహవశమున కొయ్య నిమ్నోన్నతప్రదేశములకు కొనిపోవబడును. అట్లే దైవవశముననే అతని శరీరము సమయానుకూలముగా భోగములను పొందుచుండును.

ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభిః
సంసారివచ్చరతి భుక్తిషు ముక్తదేహః ।
సిద్ధః స్వయం వసతి సాక్షివదత్ర తూష్ణీం
చక్రస్య మూలమివ కల్పవికల్పశూన్యః ॥ 552

ముక్తుడైనవాని శరీరము ప్రారబ్ధముచేత కల్పింపబడిన వాసనల ద్వారా సంసారియైన పురుషుని వలె నానావిధములైన భోగములను అనుభవించును. సిద్ధ పురుషుడు కుమ్మరి చక్రపు మూలమువలె సంకల్పవికల్పములు లేక సాక్షిభావముతో మౌనము వహించియుండును.

నైవేంద్రియాణి విషయేషు నియుంక్త ఏష
నైవోపయుంక్త ఉపదర్శనలక్షణస్థః ।

నైవ క్రియాఫలమపీషదపేక్షతే స
స్వానందసాంద్రరసపానసుమత్తచితః ॥ 553

బ్రహ్మవేత్తయైన పురుషుడు అతిసాంద్రమైన ఆత్మానందరసమును పానము చేయుటవలన మత్తిల్లి సాక్షిభూతుడై యుండి యింద్రియములను విషయములందు ప్రవర్తిల్లను జేయడు. వానినుండి తొలగింపనుజేయుడు. అతడు తన కర్మల ఫలమువంకకు దృష్టినైనను సారించడు.

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్కేవలాత్మనా ।
శివ ఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మవిదుత్తమః ॥ 554

లక్ష్యదృష్టిని అలక్ష్యదృష్టిని రెండింటిని కూడ వీడి కేవలమొక్క యాత్మస్వరూపముతోనే ఎవడు స్థితుడైయుండునో అట్టి యా బ్రహ్మవిద్వరిష్ఠుడైన మహాపురుషుడు సాక్షాత్తు శివుడే యగును.(అనగా అన్యవస్తువులేని కారణమున ఎవనికి లక్ష్యము (ప్రాప్తవ్యము) ఏదియు నుండదో, ఎవడు జడునివలెను, నిద్రాగతునివలెను జ్ఞానశూన్యుడై కూడ ఉండడో అట్టి పురుషుడే శ్రేష్ఠతముడైన ఆత్మనిష్ఠుడగును.)

జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః ।
ఉపాధినాశాద్బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతినిర్ద్వయమ్ ॥ 555

ఇట్టి బ్రహ్మజ్ఞాని సజీవుడై యుండికూడ సర్వదా ముక్తుడు, కృతార్థుడు నయి యుండును.శరీరరూపమగు ఉపాధి నశించుటతో అతడు బ్రహ్మభావమందు స్థితుడై యుండియే అద్వితీయ బ్రహ్మమునందు లయము నందును.

శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథా పుమాన్ ।
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః ॥ 556

నటుడు అగువాడు విచిత్రవేషధారణము చేసినను పురుషుడే, ఏ వేషమును లేనప్పుడును పురుషుడే. అట్లే బ్రహ్మవేత్త యైనవాడు ఉపాధి కలిగియున్ననప్పుడును బ్రహ్మమే. లేని యప్పుడును సర్వదా బ్రహ్మస్వరూపమే యగును. కాని వేఱు ఏమియును గాడు.

యత్ర క్వాపి విశీర్ణం సత్పర్ణమివతరోర్వపుఃపతనాత్।
బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ హి తచ్చిదగ్నినాదగ్ధమ్ ॥ 557

చెట్టునుండి అందందు రాలిన యెండుటాకులవలె బ్రహ్మభావము నందిన యతియొక్క శరీరము ఎందైనను రాలిపోవును గాక! అది ముందుగనే చైతన్యాగ్ని చేత దగ్ధమైయుండును.

సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః
పూర్ణాద్వయానంద మయాత్మనా సదా ।
న దేశకాలాద్యుచితప్రతీక్షా
త్వఙ్మాంసవిట్పిండవిసర్జనాయ ॥ 558

సత్తుయొక్క స్వరూపమగు బ్రహ్మమునందు సర్వదా పరిపూర్ణము, అద్వితీయమునగు ఆనందస్వరూపముతో స్థితుడై యుండు మునికి త్వక్కు, మాంసము, మలమూత్రముల పిండమైన శరీరమును విసర్జించుటకు ఉత్తమదేశకాలాదులకై ప్రతీక్షకాని తదపేక్ష కాని యుండదు.

దేహస్య మోక్షో నో మోక్షో న దండస్యకమండలోః।
అవిద్యాహృదయగ్రంథిమోక్షో మోక్షో యతస్తతః ॥ 559

ఏలయనగా హృదయమందలి అవిద్యారూపగ్రంథి నశించుటయే మోక్షమని చెప్పుదురు. కావున దేహత్యాగమును మోక్షము గాదు. దండకమండలు పరిత్యాగమును మోక్షము గాదు.

కుల్యాయామథ నద్యాం వా శివక్షేత్రే-పి చత్వరే ।
పర్ణం పతతి చేత్తేన తరోః కిం ను శుభాశుభమ్ ॥ 560

చెట్టునుండి రాలిన పండుటాకు కాలువలో పడిననేమి? నదిలో పడిననేమి? శివక్షేత్రమందు పడిననేమి? ఏదేని వేదికమీద పడిననేమి? దానివలన వృక్షమునకు కలుగు హాని లాభములేమి?

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవత్
దేహేంద్రియప్రాణధియాం వినాశః ।
నైవాత్మనః స్వస్య సదాత్మకస్యా
నందాకృతేర్వృక్షవదస్తి చైషః ॥ 561

వృక్షము యొక్క ఆకులు, పూవులు, ఫలములను వలె జీవుని దేహము, ఇంద్రియములు, ప్రాణములు, బుద్ధి మున్నగునవి నశించును. కాని స్వయముగా సదానందస్వరూపమగు ఆత్మ నాశమును పొందదు. అది వృక్షమువలె చలనము లేక నిలిచియుండును.

ప్రజ్ఞానఘన ఇత్యాత్మలక్షణం సత్యసూచకమ్ ।
అనూద్యోపాధికస్యైవ కథయంతి వినాశనమ్ ॥ 562

'ప్రజ్ఞానఘనము' అనబడు ఈ యాత్మయొక్క లక్షణము సత్యమును సూచించునది యని విజ్ఞులు అనువాదము (వర్ణనము) చేసి ఉపాధి కల్పితవస్తువునకే వినాశనమును దెలిపిరి.

అవినాశీ వా అరేఽయమాత్మేతి శ్రుతిరాత్మనః ।
ప్రబ్రవీత్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు ॥ 563

"అవినాశీ వాఅరేఽయమాత్మానుచ్ఛిత్తిధర్మా" (బృహ. 4/5/14) 'అరే! ఈ యాత్మ అవినాశి' యని శ్రుతి కూడ వికారవంతములైన దేహాదులు నశించిన మీదట ఆత్మ వినాశములేనిదై నిలుచుటను ప్రతిపాదించుచున్నది.

పాషాణ వృక్షతృణధాన్యకటాంబరాద్యా
దగ్ధా భవంతి హి మృదేవ యథా తథైవ ।
దేహేంద్రియాసుమనఆది సమస్తదృశ్యం
జ్ఞానాగ్ని దగ్ధముపయాతి పరాత్మభావమ్ ॥ 564

రాయి, చెట్టు, గడ్డిపరక, అన్నము, పొట్టు, బట్టలు మున్నగునవి యెల్ల దగ్ధములై మట్టియగును. అట్లే దేహము, ఇంద్రియములు, ప్రాణములు,

మనస్సు మొదలైనవి యెల్ల దృశ్యపదార్థములును జ్ఞానాగ్ని చేత దగ్ధములై పరమాత్మ స్వరూపములుగా పరిణతము లగును.

విలక్షణం యథా ధ్వాంతం లీయతే భానుతేజసి ।
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే ॥ 565

సూర్యుడు ప్రకాశింపగా అతని ప్రకాశమందు తద్భిన్న లక్షణముగల అంధకారమెల్ల లీనమైపోవును. అట్లే దృశ్యప్రపంచమంతయు జ్ఞానము ఉదయించినంతనే బ్రహ్మమునందు లీనమైపోవును.

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటమ్ ।
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్ ॥ 566

కడవ విచ్ఛిన్నమైనప్పుడు అందలి యాకాశము (ఘటాకాశము) మహాకాశమైపోవును. అట్లే ఉపాధి లయమైనప్పుడు బ్రహ్మవేత్త స్వయముగా బ్రహ్మమే యైపోవును.

క్షీరం క్షీరే యథా లిప్తం తైలం తైలే జలం జలే ।
సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥ 567

పాలలో కలిసి పాలు, నూనెలో కలిసి నూనెయు, నీటిలో కలిసి నీరును ఏకమైపోవు విధమున ఆత్మజ్ఞానియైన ముని ఆత్మయందు లీనమైనప్పుడు ఆత్మస్వరూపుడే యైపోవును.

ఏవం విదేహకైవల్యం సన్మాత్రత్వమఖండితమ్ ।
బ్రహ్మభావం ప్రపద్యైష యతిర్నావర్తతే పునః ॥ 568

అఖండసత్తామాత్రమున స్థితుడై యుండుటయే విదేహకైవల్యము. ఈ విధముగా బ్రహ్మభావమును పొంది యతివర్యుడు మఱల సంసారచక్రమునందు చిక్కుకొనడు.

సదాత్మైకత్వ విజ్ఞానదగ్ధావిద్యాదివర్ష్మణః ।
అముష్య బ్రహ్మభూతత్వాద్బ్రహ్మణః కుత ఉద్భవః ॥ 569

బ్రహ్మము యొక్కయు, ఆత్మయొక్కయు ఏకత్వ పరిజ్ఞాన రూపమగు అగ్నిచేత అవిద్యాజన్యములైన శరీరాదులుగా ఉన్న ఉపాధి దగ్ధమైపోయినమీదట ఈ బ్రహ్మవేత్త బ్రహ్మరూపుడే అయిపోవును.అట్టి యెడ బ్రహ్మకు పునర్జన్మము ఎట్లు సంభవమగును?

**మాయాక్లుప్తౌ బంధమోక్షౌ న స్తః వస్తుతః ।**
**యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమౌ ॥ 570**

బంధనము, మోక్షము అనునవి మాయ చేత కల్పితములైనవి. నిజమరయగా అవి యాత్మయందు లేవు. రజ్జువునందు సర్పప్రతీతి కలుగుటయు, కలుగకుండుటయు భ్రాంతిమాత్రములు.కాని నిజమరయగా అవి యందు లేవు.

**ఆవృతేస్సదసత్త్వాభ్యాం వక్తవ్యే బంధమోక్షణే ।**
**నావృతిర్బ్రహ్మణః కాచిదన్యాభావాదనావృతమ్ ।**
**యద్యస్త్యద్వైతహానిః స్యాద్ద్వైతం నో సహతే శ్రుతిః ॥ 571**

అజ్ఞానము యొక్క ఆవరణశక్తి ఉండుటను, లేకుండుటను బట్టియే వరుసగా బంధము, మోక్షము చెప్పబడినవి. కాని బ్రహ్మమునకు ఏ యావరణమును ఉండదు. ఏలయనగా బ్రహ్మముకన్న భిన్నమైన వస్తువు ఏదియును లేనేలేదు. కాబట్టి ఆది యావరణరహితమే యగును. బ్రహ్మమునకు కూడ ఆవరణము ఉన్నదనుటను సమ్మతించినచో అద్వైతము సిద్ధింపదు. ద్వైతమును శ్రుతి సమ్మతింపదు.

**బంధం చ మోక్షం చ మృషైవ మూఢా**
**బుద్ధేర్గుణం వస్తుని కల్పయంతి ।**
**దృగావృతిం మేఘకృతాం యథా రవౌ**
**యతోఽద్వయాసంగ చిదేకమక్షరమ్ ॥ 572**

బంధము, మోక్షము అనునవి రెండును బుద్ధియొక్క గుణములు, మేఘముల మూలమున దృష్టి నిరోధింపబడినప్పుడు సూర్యుడు అచ్ఛన్నుడైనట్లు చెప్పబడుచున్నది. అట్లే మూఢులు వ్యర్థముగా తమ

కల్పనను ఆత్మతత్త్వమందు చేయుచున్నారు. ఏలయనగా బ్రహ్మము సర్వదా అద్వితీయము, సంగరహితము, చైతన్య స్వరూపము, ఏకము, నాశనములేనిదిగా నైనది.

అస్తీతి ప్రత్యయో యశ్చ నాస్తీతి వస్తుని ।
బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః ॥ 573

పదార్థము ఉండుట లేకుండుట అన్నట్టి జ్ఞానము బుద్ధియొక్క గుణమే. కాని నిత్యవస్తువైన ఆత్మది కాదు.

అతస్తౌ మాయయా క్లృప్తౌ బంధమోక్షౌ నచాత్మని ।
నిష్కలే నిష్క్రియే శాంతే నిరవద్యే నిరంజనే ।
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్కల్పనా కుతః ॥ 574

కావున ఆత్మయందు ఈ బంధమోక్షములు అనబడునట్టివి రెండును మాయ చేత కల్పింబడినవి. కాని నిజముగా ఉన్నవికావు. ఏలయనగా ఆకాశమువలె అవయవరహితము, క్రియారహితము, శాంతము, నిర్మలము, నిరంజనము, అద్వితీయమును అగు పరతత్త్వమందు కల్పన యెట్లు సాధ్యమగును?

న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥ 575

కాబట్టి (సారాంశముగా చెప్పవలసిన వాస్తవికమైన) పరమార్థ వాక్యము ఇదియే - నిజమరయగా దేనికిని నాశమును లేదు. ఉత్పత్తియును లేదు. బంధమును లేదు. సాధకుడును లేడు. మోక్షమును గోరువాడును లేడు. ముక్తుడును లేడు.

సకల నిగమచూడాస్వాంతసిద్ధాంతరూపం
పరమిదమతిగుహ్యం దర్శితం తే మయాద్య ।
అపగతకలిదోషం కామనిర్ముక్తబుద్ధిం
స్వసుతవదసకృత్త్వాం భావయిత్వా ముముక్షుమ్ ॥ 576

ఓ వత్సా! కలిదోషములు ఏవియు లేనివాడవు, కామనారహితుడవు, మోక్షాపేక్ష గలవాడవు నగు నిన్ను నాపుత్రునిగా భావించి నేను అనేకమార్లు సర్వశాస్త్రముల యొక్కయు సారశిరోమణి యనదగు ఈ అత్యంత గుహ్యమైన పరమ సిద్ధాంతమును నీ ముందు ప్రకటించితిని."

## శిష్యునకు వీడ్కోలు

ఇతి శ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః ।
స తేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్తబంధనః ॥ 577

గురుదేవుడనిన యీ పలుకుల నాలకించి శిష్యుడు అత్యంతనమ్రతతో అతనికి ప్రణమిల్లి సంసారబంధమునుండి విముక్తుడై అతని సెలవు గొని వెడలిపోయెను.

గురుదేవం సదానందసింధౌ నిర్మగ్నమానసః ।
పావయన్ వసుధాం సర్వాం విచచార నిరంతరమ్ ॥ 578

గురువర్యుడు కూడ సచ్చిదానంద సముద్రమున నిమగ్నమైన మానసముతో సమస్తభూమండలమును పావనము గావించుచు ఇందందు చరింపసాగెను.

## అనుబంధ చతుష్టయమ్

ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదేనాత్మ లక్షణమ్ ।
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే ॥ 579

ఈ విధముగా గురుశిష్య సంభాషణ రూపమున మోక్షాపేక్ష కలవారికి సుగమముగా బోధపడుటకై ఈ యాత్మ జ్ఞాననిరూపణము చేయబడినది.

(ఈ శ్లోకములో శంకారాచార్యులవారు గ్రంథము యొక్క అనుబంధ చతుష్టయమును వివరించిరి. ఈ గ్రంథమునకు అధికారి మోక్షాపేక్ష గల పురుషుడు. విషయము ఆత్మజ్ఞానము. సంబంధము నిరూప్య నిరూపక సంబంధము. మోక్షమును గోరుకొనువారికి ఆత్మజ్ఞానము సిద్ధించుట ప్రయోజనము.)

హితమిమముపదేశమాద్రియంతాం
విహితనిరస్తసమస్తచిత్తదోషాః ।
భవసుఖవిరతాః ప్రశాంతచిత్తాః
శ్రుతిరసికా యతయో ముముక్షవో యే ॥ 580

వేదాంత విహితములైన శ్రవణాదుల మూలమున ఎవరి చిత్తదోషములు ఎల్ల నివృత్తములు అయ్యెనో, ఎవరు సంసార సుఖము నెడల విరక్తులై, శాంతచిత్తులై, శ్రుతిరహస్యములను ఎఱుగుటయందు అభిరుచి గలవారై, మోక్షాపేక్ష కలవారై యుందురో అట్టి యతిజనులు ఈ హితకరమైన ఉపదేశమును ఆదరించెదరు గాక!

## గ్రంథ ప్రశంస

సంసారాధ్వని తాపభానుకిరణప్రోద్భూతదాహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి శ్రాంత్యా పరిభ్రామ్యతామ్ ।
అత్యాసన్నసుధాంబుధి సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయం
త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణసందాయినీ ॥ 581

సంసార మార్గమందు (గలుగు) నానావిధములైన క్లేశములనెడు సూర్యకిరణముల చేత గలిగిన తాపపు వ్యథచేత పీడితులై జలాపేక్షతో మరుభూమియందు ఇందందు తిరుగాడుచు అలసి సొలసియున్న పురుషులకు, మిక్కిలి చేరువగా అద్వితీయ బ్రహ్మమనెడు పరమానందదాయకమైన అమృత సముద్రము జూపునట్టి శ్రీశంకరాచార్యవర్యుల నిర్వాణదాయకమైన వాణి నిరంతరము విజయవంతమై వెలయును గాక!

॥ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాద శిష్య
శ్రీమచ్ఛంకర భగవత్కృత
వివేక చూడామణి సమాప్తము ॥



ఆదిశంకరుల

# వేదాంత డిండిమము (సంక్షిప్తము)

వేదాన్త డిణ్డిమా స్తత్వం ఏక ముద్ఘోషయన్తి యత్ ।
ఆస్తాం పురస్తాత్ తత్తేజో దక్షిణామూర్తి సంజ్ఞితమ్ ॥ 1

ఏ అద్వయ సత్తాస్వరూపమును గూర్చి వేదాంత డిండిమము పలుకుచున్నదో, అట్టి దక్షిణామూర్తి సంజ్ఞకమగు ఆ జ్యోతి నాకు ప్రత్యక్షమగుగాక!

ఆత్మానాత్మ పదార్థౌ ద్వౌ భోక్తృ భోగ్యత్వ లక్షణౌ ।
బ్రహ్మై వాత్మా న దేహాదిః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 2

ఆత్మ అనియు, అనాత్మ అనియు రెండు పదార్థములు గలవు. ఒకటి భోక్త. రెండవది భోగ్యము. బ్రహ్మమే ఆత్మ. దేహాదులు ఆత్మ కానేరవు అని వేదాంత డిండిమము ప్రకటించుచున్నది.

జ్ఞానాజ్ఞానే పదార్థౌ ద్వౌ ఆత్మనో ముక్తి బన్ధదౌ ।
జ్ఞానాన్ముక్తి ర్నిబన్ధోఽన్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 3

జ్ఞానమనియు, అజ్ఞానమనియు రెండు పదార్థములు గలవు. జ్ఞానము మోక్షమును, అజ్ఞానము బంధమును అందించుచున్నవి. ఇదియే వేదాంత డిండిమము ప్రకటించినది.

సుఖ దుఃఖే పదార్థౌ ద్వౌ ప్రియ విప్రియ కారకే ।
సుఖం బ్రహ్మ జగద్దుఃఖం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 4

సుఖమనియు, దుఃఖమనియు రెండు పదార్థములు గలవు. సుఖము ప్రియమును, దుఃఖము అప్రియమును కల్గించును. బ్రహ్మమే సుఖమనియు, జగత్తు దుఃఖమనియు గ్రహించమని వేదాంతభేరి మ్రోగుచున్నది.

సమిష్టి వ్యష్టిరూపౌ ద్వౌ పదార్థౌ సర్వసమ్మతౌ ।
సమిష్టి రీశ్వరో వ్యష్టిః జీవో వేదాన్త డిణ్డిమః ॥ 5

సమిష్టి అనియు, వ్యష్టి అనియు సర్వసమ్మతములైన పదార్థములు రెండు గలవు. సమిష్టి ఈశ్వరుడు, వ్యష్టి జీవుడు అని వేదాంత డిండిమము మ్రోగించినది.

జ్ఞాన కర్మ పదార్థౌ ద్వౌ వస్తు కర్త్రాత్మతన్త్రకౌ ।
జ్ఞానా న్మోక్షో న కర్మభ్యః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 6

జ్ఞానమనియు, కర్మ అనియు రెండు పదార్థములు గలవు. ఒకటి వస్తుతంత్రము, రెండవది కర్తృతంత్రము, జ్ఞానము వలననే మోక్షము కలుగును. కర్మవలన కాదు అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

శ్రోతవ్యాఽశ్రావ్యరూపౌ ద్వౌ పదార్థౌ సుఖదుఃఖదౌ ।
శ్రోతవ్యం బ్రహ్మ నై వాన్యత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 7

శ్రోతవ్యము, అశ్రావ్యము అని రెండు పదార్థములు గలవు. ఒకటి సుఖమును, రెండవది దుఃఖమును ఒనగూర్చును. బ్రహ్మమును గూర్చియే వినవలయును, అన్యము లేవియును వినకూడనివి అని వేదాంత డిండిమము చాటినది.

చిన్త్యాఽచిన్త్య పదార్థౌ ద్వౌ విశ్రాన్తి శ్రాన్తి దాయకౌ ।
చిన్త్యం బ్రహ్మపరం నాన్యత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 8

చింతించదగినది, చింతించదగనిది అని రెండు పదార్థములు గలవు. ఒకటి విశ్రాంతిని ప్రసాదించగా, రెండవది శ్రాంతిని అందించును. చింతించదగినది పరబ్రహ్మమే కాని అన్యము కానేరదు అని వేదాంత డిండిమము ఘోషించుచున్నది.

ధ్యేయాధ్యేయ పదార్థౌ ద్వౌ ధీ సమా ధ్యసమాధిదౌ ।
ధ్యాతవ్యం బ్రహ్మ నై వాన్యత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 9

ధ్యానింపదగినది, ధ్యానింపదగనిది అని రెండు పదార్థములు కలవు. ఒకటి సమాధిని కలిగించగా, రెండవది అసమాధిని కలిగించును. బ్రహ్మ

మొక్కటియే ధ్యానించదగినది. అన్యమైన దేదియును కాదు అని వేదాంత భేరి మ్రోగించుచున్నది.

యోగినో భోగినో వాఽపి త్యాగినో రాగిణోఽపి చ ।
జ్ఞానాన్మోక్షో న సన్దేహః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 10

యోగివైనను, భోగివైనను, త్యాగివైనను, రాగివైనను, ఎవ్వరైనను జ్ఞానముచే మోక్షము నొందుదురు. ఈ విషయమున సంశయము అనవసరము అని వేదాంత డిండిమము చాటిచెప్పినది.

న వర్ణాశ్రమ సంకేతైః న కర్మోపాసనాదిభిః ।
బ్రహ్మజ్ఞానం వినా మోక్షః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 11

వర్ణాశ్రమ సంకేతములుగాని, కర్మోపాసనలుగాని మోక్షము ననుగ్రహించ లేవు. బ్రహ్మజ్ఞానము తప్ప మరొక విధముగ ముక్తి లభించదు అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

అసత్య స్సర్వ సంసారో రసాభాసాది దూషితః ।
ఉపేక్ష్యో బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 12

సమస్తమైన సంసారము అసత్యము. రసాభాసాది దోషములతో కూడియున్నది. దానిని ఉపేక్షించి బ్రహ్మనే ఎఱుగుము అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

వృథాక్రియా వృథాలాపాన్ వృథావాదాన్ మనోరథాన్ ।
త్యక్త్వైకం బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 13

వ్యర్థక్రియలను, వ్యర్థప్రసంగాలను, శుష్కవాదములను, కోరికలను పరిత్యజించి బ్రహ్మము నొక్కదానినే తెలుసుకొనవలెను అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

స్థితో బ్రహ్మాత్మనా జీవో బ్రహ్మ జీవాత్మనా స్థితమ్ ।
ఇతి సమ్పశ్యతాం ముక్తిః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 14

జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు. అనగా చక్కగా అవలోకించు వారికే ముక్తి లభించునని వేదాంత డిండిమము చాటినది.

**జీవో బ్రహ్మాత్మనా జ్ఞేయో జ్ఞేయం జీవాత్మనా పరమ్ ।**
**ముక్తి స్త ద్యైక్య విజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 15**

జీవుని బ్రహ్మముగాను, జ్ఞేయవస్తువే జీవుడనియు తెలుసుకొనవలెను. జీవబ్రహ్మల ఐక్యవిజ్ఞానమే ముక్తి యనబడుచున్నది అని వేదాంత డిండిమము ఘోషించుచుననది.

**సర్వాత్మనా పరం బ్రహ్మ శ్రోతురాత్మతయా స్థితమ్ ।**
**నాయాసస్తత్వ విజ్ఞప్తౌ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 16**

పరమాత్మ, సర్వాత్మరూపు డైనందున శ్రోతయొక్క ఆత్మగానే తెలియుచున్నాడు. అందుచేత బోధించుటయందు ఆయాసము లేదు అని వేదాంత డిండిమము ఉద్ఘోషించినది.

**ఐహికం చాముష్మికం చ తాపాన్తం కర్మ సంచయమ్ ।**
**త్యక్త్వా బ్రహ్మైవ విజ్ఞేయం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 17**

ఐహిక, ఆముష్మిక సుఖములను వాంఛించి మానవు డాచరించు కర్మలన్నియు పరితాపము నందించేవిగానే ఉన్నవి. వీటిని విడిచిపెట్టి బ్రహ్మము నొక్కదానినే తెలుసుకొనవలెను అని వేదాంత డిండిమము తెల్పినది.

**అద్వైత ద్వైతవాదౌ ద్వౌ సూక్ష్మస్థూల దశాం గతౌ ।**
**అద్వైత వాదా న్మోక్షస్స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 18**

అద్వైతము, ద్వైతము అని రెండు వాదములు గలవు. ఒకటి సూక్ష్మము, రెండవది స్థూలము. అద్వైతవాదము వలననే ముక్తి లభించును అని వేదాంత డిండిమము ప్రకటించినది.

**కర్మిణో వినివర్తన్తే నివర్తన్తే ఉపాసకాః ।**
**జ్ఞానినో న నివర్తన్తే ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 19**

కర్మాచరణమున మునుగువారు తిరిగి ఈ లోకమునకు అరుదెంచుచున్నారు. ఉపాసనతో తేలియాడువారు మఱల జన్మించుచున్నారు. జ్ఞానులు మాత్రము తిరిగి జన్మించరు అని వేదాంత భేరి మ్రోగుచున్నది.

**పరోక్షాఽసత్ఫలం కర్మ జ్ఞానం ప్రత్యక్ష సత్ఫలమ్ ।**
**జ్ఞానమేవాఽభ్యసే త్తస్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 20**

కర్మలవలన లభించు ఫలములు ఎక్కడో, ఎప్పుడో లభించును. పైగా అవి అనిత్యములు, జ్ఞానమువలన లభించు ఫలము ఇప్పుడే, ఇక్కడే లభించును. పైగా జ్ఞానఫలము నిత్యమైనది. కనుక జ్ఞానమునే అభ్యసింపవలెను అని వేదాంత డిండిమము ఘోషించుచున్నది.

**వృథాశ్రమోఽయం విదుషాం వృథాఽయం కర్మిణాం శ్రమః ।**
**యది న బ్రహ్మ విజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 21**

బ్రహ్మజ్ఞానము ప్రాప్తించనిచో పండితుల వైదుష్యము, కర్మిష్ఠుల కర్మాచరణము సర్వమూ నిష్ఫలమే కదా! అని వేదాంతభేరి తెలుపుచున్నది.

**అలం యాగై రలం యోగైః అలం భుక్తై రలం ధనైః ।**
**పరస్మిన్ బ్రహ్మణి జ్ఞాతే ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 22**

పరబ్రహ్మము నెరిగిన వానికి యాగమువలన, యోగమువలన, భుక్తివలన, ధనము వలన ప్రయోజనమేమి? అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**అలం వేదై రలం శాస్త్రైః అలం స్మృతి పురాణకైః ।**
**పరమాత్మని విజ్ఞాతే ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 23**

పరబ్రహ్మమును గ్రహించిన వానికి వేద, శాస్త్ర, స్మృతి, పురాణాదుల వలన ప్రయోజన మేమి? అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**నర్చా న యజుషార్థోఽస్తి న సామ్నార్థోఽస్తి కశ్చన ।**
**జ్ఞాతే బ్రహ్మాత్మ విజ్ఞానే ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 24**

బ్రహ్మజ్ఞానము లభించినవాడు ఋగ్యజుస్సామ వేదములద్వారా సాధించదగినది ఏమియును ఉండదు అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**కర్మాణి చిత్తశుద్ధ్యర్థం ఐకాగ్ర్యార్థ ముపాసనా ।**
**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 25**

చిత్తశుద్ధికి కర్మలును, ఏకాగ్రత కొరకు ఉపాసనయును విధింపబడినవి. బ్రహ్మజ్ఞాన మొక్కటియే మోక్షమును ప్రసాదించగలదు అని వేదాంత డిండిమము స్పష్టీకరించినది.

**సంచితాగామి కర్మాణి దహ్యన్తే జ్ఞాన వహ్నినా ।**
**ప్రారబ్ధానుభవా న్మోక్షః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 26**

సంచిత, ఆగామి కర్మలు జ్ఞాన మనెడి అగ్నిచేత దహించబడుచున్నవి. ప్రారబ్ధమును అనుభవించగనే మోక్షము ప్రాప్తించుచున్నది. ఇదియే వేదాంత డిండిమము తెలుపుచున్నది.

**న పుణ్యకర్మణా వృద్ధిః న హానిః పాపకర్మణా ।**
**నిత్యాసఙ్గాత్మ నిష్ఠానాం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 27**

సదా ఆత్మనిష్ఠ యందుండు వారికి పుణ్యకర్మల వలన వృద్ధిలేదు. పాపకర్మలవలన హాని కలుగదు అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**బుద్ధిపూర్వాఽబుద్ధిపూర్వ కృతానాం పాప కర్మణామ్ ।**
**ప్రాయశ్చిత్త మహో జ్ఞానమ్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 28**

తెలిసియో, తెలియకనో చేసిన పాపకర్మలకు ఆహా! బ్రహ్మజ్ఞానము ప్రాయశ్చిత్త మగుచున్నది గదా! అని వేదాంత డిండిమము ఉద్ఘోషించినది.

**దృగ్దృశ్యౌతౌ పదార్థౌ ద్వౌ పరస్పర విలక్షణౌ ।**
**దృగ్బ్రహ్మ దృశ్యం మాయా స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 29**

దృక్, దృశ్యములని రెండు పదార్థములు గలవు. అందు దృక్కు బ్రహ్మము, దృశ్యము మాయ అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**అవిద్యోపాధికో జీవో మాయోపాధిక ఈశ్వరః ।**
**మాయాఽవిద్యా గుణాతీతః ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 30**

అవిద్యను ఉపాధిగా కలిగినవాడు జీవుడు. మాయను ఉపాధిగా కలిగినవాడు ఈశ్వరుడు. ఈ రెండింటికి అతీతమైనది బ్రహ్మము అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**సాకారం చ నిరాకారం నిర్గుణం చ గుణాత్మకమ్ ।**
**తత్త్వం తత్పరమం బ్రహ్మ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 31**

పరమాత్మ స్వరూపము సాకారమును, నిరాకారమును, నిర్గుణమును సగుణమును గూడ అయివున్నది అని వేదాంత డిండిమము స్పష్టపరచినది.

**ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః ।**
**బ్రహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాత్ ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 32**

విధి నియమాలను పాటించువారు ద్విజులు, వేదమును పఠించువారు విప్రులు, బ్రహ్మజ్ఞానమును బడసినవారు బ్రాహ్మణులు అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

**సర్వాత్మనా స్థితం బ్రహ్మ సర్వం బ్రహ్మాత్మనా స్థితమ్ ।**
**న కార్యం కారణా ద్భిన్నం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 33**

కార్యము కారణముకంటే భిన్నముకాదు. అందుచేత సమస్తము నందును బ్రహ్మమే స్థిరముగా యున్నది. అలాగే సమస్తము బ్రహ్మమునందే యున్నది అని వేదాంత డిండిమము ప్రకటించినది.

**సత్తా స్ఫురణ సౌఖ్యాని భాసన్తే సర్వ వస్తుషు ।**
**తస్మా ద్బ్రహ్మమయం సర్వం ఇతి వేదాన్త డిణ్డిమః ॥ 34**

సమస్త వస్తువులు అస్తి, భాతి, ప్రియ రూపములై భాసించుచున్నవి. కనుక సమస్తము బ్రహ్మమయమే అని వేదాంతభేరి మ్రోగుచున్నది.

